క్కి వైచి యట్టికావ్యరచనకుఁ దిలాంజలి యొసఁగి సానివాడలలోను, చాకిరేవులలోను, సారాదుకాణములలోను వ్యవహరింపఁబడుభాషతో నాధునికులు కొందఱు రచించు నాభాస కావ్యములఁ దూఱు పాఱఁబట్టి యుత్తమకావ్యములం గొనియాడి భావికావ్య రచనకుం గార్యగతుల నిరూపించుటకును విమర్శగ్రంథము లావశ్యకము లనివక్కాణించిరి.

కావ్యమునకు విమర్శ కనకమున కగ్నిపరీక్షవంటి దనియు కవికిం బోలె విమర్శకునికిం గూడఁ బ్రతిభ కావలె ననియుఁ బ్రతిభలేని విమర్శకునకుఁ గవిహృదయము గోచరింపదనియుం జెప్పి యింకను గవికిని విమర్శకునికిని గావలసినపాశ్చాత్త్యసంప్రదాయ సిద్ధములగు పరికరముల నిరూపించి వ్యాసమును ముగించిరి.

ఏడవవ్యాసము.—బ్ర॥ శ్రీ॥ జయంతిరామయ్య పంతులు, బి. ఏ., బి. ఎల్., గారు దేశచరిత్రపఠనమావశ్యక మనునంశమును గూర్చి యుపన్యసించిరి.

తొలుత చరిత్రశబ్దవ్యుత్పత్త్యర్థము నిరూపించి, దేశ చరిత్రమనఁగా దేశమునందలి జనులు సంఘరూపమున సలిపిన కార్యముల వృత్తాంతము, అనఁగా ఏయేకాలమునందు వా రేయే స్థితిలో నుండిరో, యేయేకారణములచేత వారి సాంఘికస్థితియం దేయే మార్పులు కలిగియుండెనో, ఏయే సందర్భములయం దేయే విధముగా నేయే యిక్కట్టుల వారు తప్పించి కొనఁగలిగిరో లేక యేయే యిక్కట్టులకు లోఁబడిరో యిత్యాది వృత్తాంతములను దెలుపుననియు, వృత్తాంతశ్రవణ మాత్రము వలనఁ గలుగు నానందాది తాత్కాలికఫలముకంటె వ్యక్తులయందు జాతివలె వృత్తాంతవిషయములయందు వ్యంగ్యార్థరూపకముగా నిమిడియుండు సామాన్యనీతులను(General principles) బోధించుటయే చరిత్రముయొక్క ప్రధానఫల మనియు, నట్టిసామాన్యనియమములను సాధించుట కుపకరించువిషయములు ముఖ్యములు తదితరము లముఖ్యములనియు, ఇట్లు ముఖ్యాముఖ్యవిచారము చేసి ముఖ్యాంశములనే చరిత్రమునందుఁ జేర్పవలయుననియుఁ జెప్పి చరిత్రస్వరూపమును నిర్ణయించిరి. అనంతరము చరిత్రమువలని ప్రయోజనములు ముఖ్యముగా రెండనియు, నందులో నొకటి యాత్మవిశ్వాసమును ఆత్మగౌరవమును గలిగించుటయనియు, ఆత్మవిశ్వాసములేనివాఁడు తనశక్తిని తా నెఱుఁగక శక్త్యనుగుణములగు కార్యములుచేయలేక పోవుననియు, ఆత్మసంభావనలేనివాఁ డధికారంభములఁ జొలికిఁ బోఁజాలఁడనియు, మనలకు సాధారణముగానాత్మగౌరవము తక్కువయని దేశాంతరుల యభిప్రాయమనియు, నీలోపమును బోఁగొట్టుకొనినఁగాని యితోధికాభివృద్ధికి మనము కడంగ లేమనియు నీలోపమును బోఁగొట్టుకొనుటకు స్వదేశ పూర్వవృత్తాంతజ్ఞాన మావశ్యకమనియుఁ జెప్పిరి.

తదనంతరము పురోభివృద్ధికి మనము ప్రయత్నింప వలసిన మార్గములను నిరూపించుట చరిత్రమువలని రెండవప్రయోజన మనియు, జనులకువలె జనసంఘములకు సైతము పూర్వానుభవమువలన పృథక్ప్రకృతు లేర్పడుననియు, సాధారణముగా వారు చేయుకార్యములు తమప్రకృత్యనుసారముగానుండు ననియు, ప్రకృతిస్వభావము నెఱుంగక తత్ప్రతికూలము లగుయత్నము లొనర్చిన నవి విఫలము లగుననియుఁ, గావున జనులకువలె సంఘములకును స్వస్వరూపజ్ఞానమావశ్యక మనియు నట్టి జ్ఞానము పూర్వవృత్తాంతశ్రవణము వలనఁ గలుగు ననియుఁ జెప్పి స్వదేశచరిత్రపఠన మత్యావశ్యక మని నిరూపించిరి.

# ఆంధ్రపండితసభావృత్తాంతము.

---

గతమేమాసము 15, 16 తేదులను చెన్నపురి పచ్చైయప్పకాలేజి సభాభవనమున నాంధ్రసాహిత్య పరిషత్తు వారొక యాంధ్రపండితసభం గూర్చిరి. ఆసభకు—

మ-రా-రా-శ్రీ. శ్రీచల్లపల్లి కుమారరాజుగారు.
" మా. పాపారావునాయుఁడుగారు.
" వే. రామదాసు పంతులుగారు
" గూడూరు. రామచంద్రరావు పంతులుగారు.
" మ. సాంబశివరావుగారు.
" పోతరాజు. నరసింహముగారు.
" గాడిచెర్ల. హరిసర్వోత్తమరావుగారు.
" ఆర్. కృష్ణమాచార్యులు (విద్యానిధి. ఎం. ఏ.) గారు.
" కే. వి. లక్ష్మణరావుగారు. ✓
" వేదము. వేంకటరాయ శాస్త్రిలుగారు.
" తల్లాప్రగడ. సూర్యనారాయణరావుగారు.
" డి. వి. రమణారావుగారు.
" గురిజాడ. అప్పారావుగారు.
" పురాణము. నాగభూషణముగారు.
" జయంతి. రామయ్యపంతులుగారు.
" టి. వరదరాజులునాయుఁడుగారు.
" గోటేటి. కనకరాజుపంతులుగారు.
" ఆచంట. లక్ష్మీపతిగారు.
" యనమండ్రి. నారాయణమూర్తి పంతులుగారు.
" పురాణపండా. కామేశ్వరరావుగారు
" సుసర్ల. వేంకటసుబ్బారావుగారు.
" ఆదిపూఁడి. ప్రభాకరరావుగారు.
" చిలుకూరి. వీరభద్రరావుగారు.
" చెన్నాప్రగడ. భానుమూర్తిగారు.
" బొడ్డికూరపాటి. వేంకటరంగమునాయుఁడుగారు.
" పండిత ది. గోపాలచార్యులుగారు.

మ-రా-రా-శ్రీ. పి. ఎస్. రామమూర్తిపంతులుగారు.
,, టి. రామకృష్ణపిళ్లెగారు.
,, జి. సి. వి. శ్రీనివాసాచార్యులుగారు.
,, వి. రామచంద్రాచార్యులుగారు.
,, సోమంచి. భీమశంకరముగారు.
,, జి. రంగయ్యనాయుఁడుగారు.
,, పురాణపండా. మల్లయ్యశాస్త్రిలుగారు.
,, మల్లాది. సూర్యనారాయణశాస్త్రిలుగారు.
,, పేరి. కాశీనాథశాస్త్రిలుగారు.
,, కాశీ. కృష్ణాచార్యులుగారు.
,, భాగవతుల. రామమూర్తిశాస్త్రిలుగారు.
,, మేడేపల్లి. వేంకటరమణాచార్యులుగారు.
,, మానవల్లి. రామకృష్ణకవిగారు.
,, చెల్లపిళ్ల. వేంకట శాస్త్రిలుగారు.
,, దివాకర్ల. తిరుపతిశాస్త్రిలుగారు.
,, మంగు. వేంకటరామానుజరావుగారు.
,, గునుపాటి. యానాదిరెడ్డిగారు.
,, పి. వి. నరసింహరావునాయుఁడుగారు.
,, సి. దొరస్వామయ్యగారు.
,, సుదలువాడ. సుందరరామశాస్త్రిలుగారు.
,, దండిగుంట. సూర్యనారాయణశాస్త్రిలుగారు.
,, కేతవరపు. వేంకటశాస్త్రిలుగారు.
,, గట్టుపల్లి. శేషాచార్యులుగారు.
,, కాళ్లకూరి. సాంబశివరావుగారు
,, పురాణం. సూర్యనారాయణతీర్థులుగారు.
,, పంచాగ్నుల. దక్షిణామూర్తి శాస్త్రిలుగారు.
,, కాశీభట్ల. రామకృష్ణశాస్త్రిలుగారు.

ఇంకను అనేకులును వచ్చియుండిరి.

అందుఁ బ్రథమదినమున పగలు రెండుగంటలకు సభయారంభమాయెను. శ్రీపురాణం. నాగభూషణము ఎం. ఏ. బి. ఎల్., గారు సభాపతిగ నుండిరి. సభారంభకాలమున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలుగారు వచ్చిన పండితులకెల్లరకు స్వాగతమొసంగిరి. పిదపఁ గావ్యములలో శృంగారవర్ణనాచిత్యముంగూర్చి యీక్రిందఁ జేర్కొనంబడువారు తమతమయభిప్రాయములం దెలుపు వ్యాసములం జదివిరి.

మ-రా-రా-శ్రీ. చెల్లపిళ్ల. వేంకటశాస్త్రిలుగారు. (బందరు)
,, పురాణపండా. మల్లయ్యశాస్త్రిలుగారు. (పిఠాపురము)

మ-రా-రా-శ్రీ, వేరి. కాశీనాథశాస్త్రిలుగారు. (విజయనగరము)
,, మల్లాది. సూర్యనారాయణశాస్త్రిలుగారు. (అమలాపురము)
,, కాశీ. కృష్ణాచార్యులుగారు. (గుంటూరు)
,, భాగవతుల. రామమూర్తిశాస్త్రిలుగారు. (విజయనగరము)
,, మేడేపల్లి. వేంకటరమణాచార్యులుగారు. (విజయనగరము)
,, కేతవరపు. వేంకటశాస్త్రిలుగారు. (బొబ్బిలి)
,, ఆదిపూడి. ప్రభాకరరావుగారు. (కాకినాడ)
,, కాశ్లకూరి. సాంబశివరావుగారు. (కాకినాడ)
,, చెట్లూరి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు. (వేంకటగిరి)
,, గునుపాటి. యానాదిరడ్డిగారు. (నెలూరు)
,, మంగు. వేంకటరామానుజరావుగారు. (నెల్లూరు)
,, చదలువాడ. సుందరరామశాస్త్రిలు గారు. (చెన్నపురి)
,, సి. దొరస్వామయ్యగారు. (చెన్నపురి)

మఱియు—

,, శ్రీ కల్లూరి. వేంకటరామశాస్త్రిలుగారు. (రాజమహేంద్రవరము)
,, కొప్పరపు. వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు. (కొప్పరము)
,, వావిలికొలను సుబ్బరావుగారు. (చెన్నపురి)
,, పెద్దిభట్ల లక్ష్మీనరసింహముగారు. (తెనాలి)
,, వేటూరిప్రభాకరశాస్త్రిలు గారు. (పెద్దకల్లేపల్లి)
,, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిలుగారు. (రాజమహేంద్రవరము)
,, వడ్డాది సుబ్బారాయుఁడు గారు. ,,
,, కూచి నరసింహముగారు. (పిఠాపురము)
,, శొంఠి భద్రాద్రిరామశాస్త్రిలుగారు. (కాకినాడ)
,, విక్రమ దేవవర్మగారు. (విశాఖపట్టణము)
,, పెద్దాపురము జగపతిరాజుగారు. (పెద్దాపురము)
,, పురాణం రామచంద్రశాస్త్రిగారు. (ముక్త్యాల)
,, కోరాడ దుర్గానాగేశ్వరశాస్త్రిగారు. (బందరు)
,, అమరవాది రామయ్యగారు. (బాలేమర్రు)
,, జనమంచి శేషాద్రిశర్మగారు. (కడప)
,, పంగులూరి రామచంద్రయ్యగారు. (గుంటూరు)
,, శృంగారకవి సర్వారాయుఁడుగారు. (కాకినాడ)
,, నిట్టల వేంకటశాస్త్రిలుగారు. (తుని)

మొదలగువారు వ్యాసములను వ్రాసిపంపిరి.

,, జి. రంగయ్యనాయుఁడుగారు. (చెన్నపురి)
,, దివాకర్ల తిరుపతిశాస్త్రిలుగారు. (కాకినాడ)

మ-రా-రా-శ్రీ, వి. రామచంద్రాచార్యులుగారు. (నెల్లూరు)
,, జి సి వి. శ్రీనివాసాచార్యులుగారు. (చెన్నపురి)
,, వే. రామదాసుపంతులుగారు. (తణుకు)

తమయభిప్రాయముల నుపన్యసించిరి.

సభాంతమున సగ్రాసనాధిపతిగారు సర్వోపన్యాసములలోని యభిప్రాయసారమును విమర్శించిన పిమ్మట నీ క్రింద వివరింపబడిన ప్రకారము తీర్మానింపఁబడినది. ఈ తీర్మానమునకు శ్రీ కనకరాజుపంతులుగారు తప్ప మిగిలిన సభ్యు లందఱు సమ్మతించిరి. కనకరాజుపంతులుగారు తమ యభిప్రాయమును స్పష్టపఱుపలేదు.

శృంగారవర్ణనను గుఱించిన తీర్మానము.

1. ఒక్క తెలుఁగునందు మాత్రమే గాక సాధారణముగా నన్ని భాషలయందును శృంగారరస ముత్తమరసముగా గ్రహింపఁబడుచున్నది. కావ్యములలో సర్వసాధారణముగా నిదియే ప్రధానరసముగా నంగీకరింపఁబడి యున్నది. సంస్కృతభాషలోఁ గావ్యరచనాపద్ధతులను శాసించు విపులశాస్త్రము కలదు. ఆ శాస్త్రమాంధ్రకవులచే నయిత మనుసరింపఁ బడుచున్నది.

2. ఏతచ్ఛాస్త్రానుసారముగా రచింపఁబడిన పూర్వకవికృత కావ్యములు నేఁటివఱకు నిరాక్షేపముగా నాంధ్రలోకముచే నంగీకరింపఁబడి యున్నవి. అనుచితవర్ణనలు కావ్యశాస్త్రమునం దశ్లీలాదిదోషములుగాఁ బరిగణింపఁబడి నిషేధింపఁ బడినవి. కొందఱు కవు లొకానొకస్థలమునం దొక్కొక్కరసము నించుకనొక్కి వర్ణించినను అట్టిపట్టులందు సాధారణముగా భావము పండితైకవేద్య మగు ప్రౌఢభాష నుపయోగించియున్నారు. అట్టి భావములు విప్పిచెప్పినఁగాని స్పష్టపడవని యాంధ్రభాషాపరిచయము గలవారికి విశదము.

3. ఏభాషయందైన నన్ని కావ్యములును సర్వసామాన్య జనపఠనీయములుగా నుద్దేశింపఁబడి యుండవు. పాఠకాధికారానుగుణముగాఁ బఠింపఁబడును. ఈ యంశ మాంధ్రకావ్యరచనయందుఁ గూడఁ బాటింపఁబడినది.

4. పూర్వము గ్రీకుదేశమందలి ప్రౌఢశిల్పులచే నిర్మింపఁబడిన శిలావిగ్రహములందును, ప్రస్తుతము పాశ్చాత్త్యకళాకోవిదులచే రచింపఁబడుచున్న చిత్రపటములయందును శిల్పనైపుణ్య ప్రకటనమున కధికావకాశ మొసంగుటచే నగ్నప్రతిమలే శ్లాఘాపాత్రములుగా గణింపఁబడుచున్నవి. కేవలశ్రవ్య ప్రబంధములకంటె దృశ్యప్రబంధములును వానికంటె దృశ్యపదార్థములును మనోవికారమును గలుగఁజేయుటయం దధికసామర్థ్యము గలవని యందఱకు విదితమే.

5. శృంగారకావ్యములం జదువుటవలన జనులకు దుర్వృత్తులయందుఁ బ్రవేశము కలుగుచున్నదనుట యుక్తముకాదు. అట్లనుటకుఁ బ్రమాణము లేదు. సర్వసాధారణముగా నట్టివ్యాపారములందుఁ బ్రవేశించువారు ప్రౌఢకావ్యములం జదివి యర్థముచేసికొనఁ జాలనివా రయి యున్నారు. చదివెడి వారియం దా దోష మొక్కొక్కచోటఁ గనుపడినను దానికి గ్రంథపఠనము కారణముగాదు.

6. కావ్యములలోఁ గొన్ని యాయాకాలములయందుఁ బ్రభుత్వము చేయుచుండిన ప్రభువులచే రచింపఁబడియున్నవి. అనేకములు తత్తత్కాలములందలి ప్రభువులకుఁ గాని వారిమంత్రులకుఁగాని యంకితములు చేయఁబడి యున్నవి. ప్రభు సమ్మానము వడయుటచేతనే తత్తత్కాలములం దాగ్రంథములు దూష్యములుగా నెన్నఁబడియుండలేదని స్పష్ట మగుచున్నది.

ఉచితానుచితవివేకము కాలభేదమునుబట్టి భేదించును. భావభేదము కలిగినప్పుడెల్లఁ బూర్వగ్రంథములను సవరింపవలయు నని నిర్ణయించినచో నందువలన ననేకానర్థములు పుట్టు నను టకు సందేహము లేదు. అట్టి సిద్ధాంత మేదేశమందు నెవరు నంగీకరించియుండలేదు. ఇప్పు డంగీకరించినయెడల సాధారణముగా నన్నిభాషలయందు నమూల్యములుగాఁ బరిగణింపఁబడుచున్న గ్రంథములనుగూడ సవరింపవలసి వచ్చును. తుదకు మతగ్రంథములకుఁ గూడ నాదశ పట్టవలసి వచ్చును.

7. శృంగారవర్ణన లెక్కువగా నున్న గ్రంథముల రూపుమాప యత్నించుటవలన భాషా వాఙ్మయములకు విపత్తు కలుగు ననుట నిస్సందేహము. అట్లు చేసినచోఁ దెలుఁగులోమాత్రమే కాక భరతఖండములోని యితరభాషలలో నయితము గల యనేకగ్రంథము లదృశ్యములు కావలసి వచ్చును.

8. లాక్షణికు లనేకులు శృంగారరసప్రధానకావ్యముల నాధారముచేసికొని లక్షణము నేర్పఱచియున్నారు. తెలుఁగులో శబ్దస్వరూపమును నిర్ణయించుటకుఁ బూర్వకవిప్రయోగములు ముఖ్యాధారములు. అట్టి యాధారముల నాశనముచేయుట భాష కపకారక మగును.

కాఁబట్టి పూర్వకవికృత శృంగారప్రబంధముల రూపుమాపుటగాని యందలి భాగముల లోపింపఁజేయుటగాని కూడదని యీసభవారి దృఢాభిప్రాయము.

16-వ తేదిని ఉదయము 7 గంటలు మొదలు 10 గంటలవఱకును, సాయంకాలము 3 గంటలు మొదలు రాత్రి 9 గంటలవఱకును సభ జరిగెను. ఈసభకు చల్లపల్లి కుమారరాజాగా రగు శ్రీ యార్లగడ్డ అంకినీడు ప్రసాద బహద్దరు బి. ఏ, గా రగ్రాసనాధిపతిగా నుండిరి. ఇందు గ్రంథము లందు వ్యావహారికభాషాప్రయోగౌచిత్యము, సంధి, అర్ధానుస్వారము, శకటరేఫము, అన్యదేశ్య పదప్రయోగము, వీనింగూర్చి చర్చజరిగెను.

మొదట శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు వ్యావహారికభాషాప్రయోగముం గూర్చి వ్రాసిపంపిన వ్యాసము చదువఁబడెను. పిదప పూర్వోక్తపండితులు తమతమవ్యాసములం జదివిరి. కొంద ఱుపన్యసించిరి.

అంతట శ్రీగురిజాడ అప్పారావు పంతులుగారు వ్యావహారికభాషలో గ్రంథములు గూర్చి నఁ దప్పనవల దనియు నుత్తమజాతివారు సంభాషించుభాష సకలజాతులవారును సద్భాషగా గ్రహించువాడుక కల దనియు, ఇదివఱ కంగీకరింపఁబడిన లక్షణము ననుసరించి గ్రాంథికభాషను గ్రంథముల రచించుట ప్రాయశః సాధ్యముకానందున వ్యావహారికభాషను రచించిన గ్రంథములు గూడ నాదరణీయము లనియు నుడివిరి. దీనిం గూర్చి విశేషముగా చర్చజరిగెను. శ్రీపురాణం నాగభూషణముగారు, వేదము వేంకటరాయశాస్త్రులుగారు, పేరి కాశీనాథశాస్త్రులుగారు, పురాణపండా మల్లయ్యశాస్త్రులుగారు, చెన్నాప్రగడ భానుమూర్తిగారు, సోమంచి భీమశంకరముగారు, దివాకర్ల తిరుపతిశాస్త్రులుగారు, మఱికొందఱును, ఈవిషయముం గూర్చి ప్రసంగించుచు వ్యావహారికభాషయు గ్రాంథికభాషయు వేఱు వే అని చెప్పఁదగదనియు, వ్యావహారిక భాషయందు జనులుచ్చారణాసౌలభ్యము ననుసరించి లక్షణవిరుద్ధములగు పదముల విశేషముగా వాడెద రనియు, వ్యావహారికభాషయందలి పదములు కేవలము గ్రామ్యములుగా నున్నయెడల సంస్కరించి యుపయోగింప వచ్చుననియు, కేవలము వాడుకలో నున్న వ్యావహారికభాషను గ్రంథముల రచించుట యేదేశములోను లే దనియు వక్కాణించిరి.

శ్రీ పేరి కాశీనాథశాస్త్రిలుగారు సంస్కృతమందు వైదిక భాషకును లౌకికభాషకును వ్యాకరణసిద్ధమైన భేద మెట్లు కలదో ఆతెలుఁగుననే యాంధ్రమందును గ్రాంథికభాషకును వ్యావహారికభాషకును భేదము గ్రహింపవచ్చు ననియు, లౌకికభాష కేవలము గ్రామ్య మని విసర్జింపక దానికిం దగునట్లు వ్యాకరణ మేర్పఱిచి యట్టి వ్యాకరణము ననుసరించి వ్యావహారిక భాషను గ్రంథములం బ్రయోగించుట కాక్షేపణ యుండఁగూడ దనియుఁ దమ యభిప్రాయముగాఁ జెప్పిరి.

సభాంతమున వ్యావహారికభాషాప్రయోగముం గూర్చియు, అర్ధానుస్వారము, శకటరేఫము, సంధి, అన్యదేశ్యములు, వీనిం గూర్చియు నీక్రిందిరీతి నేకగ్రీవముగాఁ దీర్మానింపఁబడెను. తీర్మాన కాలమందు అప్పారావుపంతులుగారు లేకుండిరి.—

## తీర్మానములు.

### I. గ్రామ్యభాషా ప్రయోగము.

గ్రంథరచనయందుఁ బూర్వలాక్షణికమతానుసారమగు భాషను బ్రయోగింపవలయునుగాని లక్షణవిరుద్ధమగు భాషను బ్రయోగింపఁగూడదు. గ్రంథములను మృదుమధురశైలిని రచింపవలయు ననుట సర్వజనసమ్మతము. అట్లొనరించుటకు లక్షణభంగ మవశ్యముకాదు. లక్షణభంగము కాకుండ భాషావైచిత్ర్య మెంతయైనం గనుపఱుపవచ్చును. అందువలన శైలిభేదము లేర్పడును.

### 2,3, అర్ధానుస్వారము, శకటరేఫము:

అర్ధానుస్వారశకటరేఫములు శబ్దస్వరూపావయవములగుటను శబ్దవ్యుత్పత్తుల నిరూపించుటకు సాధనము లగుటను త్యాజ్యములు కావు.

### 4. సంధి:—

గద్యరచనయం దచ్చటచ్చట నర్థావబోధనార్థమును, బఠనసౌకర్యార్థము నావశ్యకమని తోఁచినపట్టులందు సంధిచేయకున్నను దోషము కాదు. కాని సంధి యెప్పుడును జేయనక్కఱలేదని వాదించువారి వాద మంగీకార్యముకాదు. సంధిచేయుటయుఁ జేయకుంటయుఁ, గొంతవఱకుఁ బాఠకాధికారము ననుసరించియుండును. పసిపిల్లలనిమిత్త ముద్దేశింపఁబడిన పుస్తకములందు శాస్త్రవిరుద్ధము గాకుండ సంధిని దగ్గించుట మంచి దనియే చెప్పవచ్చును. పద్యరచనయందు సర్వదా విసంధి దుష్టమే.

### 5. అన్యదేశ్య పదప్రయోగము:—

పూర్వకవిమతానుసారముగా రసపోషణమునకై యచ్చటచ్చట యథోచితముగా నన్యదేశ్యపదములం బ్రయోగింపవచ్చును. కాని యథేష్టముగాఁ బ్రయోగింపఁగూడదు. అన్యభాషలలోనుండు భౌతికశాస్త్రాది గ్రంథములఁ దెలుఁగులోనికిఁ బరివర్తనము చేయునపుడు తత్తచ్ఛాస్త్రోచిత పారిభాషికపదంబులు తెనుఁగునఁ గాని సంస్కృతమునఁ గాని నిర్ణయించి వానినే యుపయోగింపవలయును. ఏకపదములు దొరకనిచో నాతిదీర్ఘసమాసపదంబుల నిర్మింపవచ్చును. అట్లొనర్చుటకు సాధ్యముకానిచో నన్యదేశ్యమూలపదంబుల నాంధ్రభాషా సంప్రదాయానుసరణముగా సంస్కరించి గ్రహింపవచ్చును. పారిభాషికపదములు సంస్కృతమున నుండినచో భరతఖండములోని యన్నిభాషలకును సమానములుగా నుండును గాన నట్టిపదములు బహుశః సంస్కృతములోనే యుండుట మేలు. ఆంధ్రసాహిత్య పరిషత్తువారిట్టిపదముల నిర్ణయించి ప్రకటించిన బాగుగ నుండును.

తదనంతరము పూర్వోక్త సభానిర్ణయములను సభవారపక్షమున దొరతనమువారికి సమర్పించి, వారికి సభవారి యుద్దేశములను సవిస్తరముగ విన్నవించుట కీక్రింద నుదాహరింపఁ బడిన వారిని ప్రతినిధులుగ నియమించుటయైనది.

మ-రా-రా-శ్రీ,

1. ఆనరబిల్. మోచెర్ల రామచంద్రరావుగారు.
2. రాయబహద్దరు బయ్యానరసింహేశ్వర శర్మగారు
3. పండిత డి. గోపాలాచార్యులుగారు.
4. తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు.
5. గునుపాటి యేనాదిరెడ్డిగారు.
6. వేమవరపు రామదాసు పంతులుగారు.
7. నెమలి పట్టాభిరామరావుగారు.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు రాయబారము.

పండిత సంఘాంతమందలి తీర్మానముప్రకారము పూర్వోక్తపరిషత్సభ్యు లీ సంవత్సరమాగష్టు నెల 7 తేది పగలు 11 గంటలకుఁ జెన్నపురి గవర్నరుగారి కడ కేగి శృంగారప్రబంధములను గూర్చియు గ్రామ్యభాషనుగూర్చియు విన్నవించిరి. పూర్వప్రబంధములను నశింపఁజేయుటగాని మార్చుటగాని భాషకునష్టమనియు, వానియందచ్చటచ్చట నత్యధికశృంగార వర్ణనమున్నను నది పామరులకుఁ దెలియని కఠినశైలిలోనున్నదనియు వీనివలనఁ బూర్వకాలపువారుగాని యిప్పటివారుగాని నీతియందు దౌర్బల్యము చెందలేదనియు, నీప్రబంధములపై నభియోగములు తెచ్చినచోఁ బూర్వగ్రంథప్రకటనమునకు నిరుత్సాహమును భంగమును గలుగుననియు నెప్పుడైనఁ బ్రభుత్వమువారట్టి ప్రబంధములలో దేనినైన హానికరమని తలఁతురేని నావిషయ మాంధ్రసాహిత్యపరిషత్తువంటి పండితసంఘమునకుఁ దెలిపిన నాసంఘమాపలోపమును నివారించుననియుఁ గనుకఁ బూర్వప్రౌఢవాఙ్మయముజోలికిఁ బ్రభుత్వమువారు పోఁగూడదనియు మనవిచేసిరి. మఱియు జనసామాన్యమునందు విద్యావ్యాప్తికై సులభశైలిలో గ్రంథముల వ్రాయుట యత్యంతావసరమేయైనను గ్రామ్యభాషను గ్రంథములలోఁ జేర్చుట, మీదుమిక్కిలి యట్టిగ్రంథములు పాఠశాలలలోని బాలురకుఁ బఠనీయగ్రంథములుగా నిర్ణయింపఁబడుట యనర్థదాయకములనియుఁ దెలుఁగు మాతృభాషకానివారినిఁ బఠనీయగ్రంథనిర్ణాయకసంఘములో నుంచుట యసంతృప్తికరముగ నున్నదనియు విజ్ఞాపన మొనరించిరి. గ్రంథము నీతివిషయమున నింద్యమా యను ప్రశ్న నుగూర్చి లార్డుకుక్బరన్ గారు వివరించిరనియు వారుచెప్పినట్లు గ్రంథము ముద్రింపఁబడి సర్వసాధారణముగఁ గొలఁది వెలకమ్మఁ బడుచు దుర్నీతిఁ బ్రోత్సాహపఱచునెడల నది నింద్యమనియు నట్లుకాక యెక్కువవెలకలిగి పుస్తకభాండాగారములకును బండితులకునుమాత్రమే విక్రయింపఁబడుచుండినయెడలఁ బ్రకటనకర్తపై నేరముండదనియు మొదటివిన్నపమునకు శ్రీ గవర్నరుగారు ప్రత్యుత్తరమొసఁగిరి; గ్రామ్యభాషావిషయమై ప్రభుత్వమువారు మధ్యస్థముగ నుందురనియుఁ దెలుఁగుమాతృభాషగాఁగలవారి నింకను బఠనీయగ్రంథ నిర్ణాయకసంఘములోఁ జేర్చవలను పదునా యని విచారింతుమనియు రెండవవిజ్ఞాపనమునకు సమాధానము వాక్రుచ్చిరి. గవర్నరుగారి కభివందనము లొనర్చి పరిషత్తురాయబారులు తిరిగివచ్చిరి.



# ప్రకటనలు.

---

## ఆంధ్రసాహిత్యపరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు :—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజారావు కుమారవేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజాసర్ వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమున్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీపిఠాపురము రాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-హా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

1 మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.,
2 ,, వేదము. వేంకటరాయశాస్త్రిగారు.
3 ,, ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచికృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,
ది ఆనరబిల్ రావుబహదూర్ పిట్టీత్యాగరాయసెట్టిగారు, బి. ఏ.

కార్యస్థానము.

192, ఎగ్మూరు. చెన్నపురి.

పరిషదుద్దేశము:—ఆంధ్రశబ్దమునకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువురచించుట, తెలుఁగు భాషకితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించు లక్షణశాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును ప్రమాణపూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్రికనొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

చందానిర్ణయము.

| | | |
|---|---|---|
| 1. ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. పోషకులకు | ,, | 1000. |
| 3. యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, | |

పరిషత్సభ్యులు పత్రికకు వేఱుగాఁ జందానియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేరవ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# పల్నాటి వీరచరిత్రము

ఇది శృంగార నైషధ, కాశీఖండ, హరవిలాసాది ప్రబంధముల రచించి కవిసార్వభౌముండని ప్రసిద్ధికెక్కిన శ్రీనాథునిచే రచింపఁబడినది. 12 వ శతాబ్దాంతమునందలి యాంధ్రదేశచరిత్రమే పల్నాటి వీరచరిత్రముగనున్నది. చరిత్రముగ నమూల్యమైనదనియుఁ గావ్యముగ నాంధ్రవాఙ్మయాలంకారమనియు స్వాభావిక కవితాధిష్ఠానమనియు నైషధాదిప్రబంధములచేత శ్రీనాథునికిఁ గలిగిన యశస్సు దీనిచే ద్విగుణీకృతమైనదనియుఁ బలువురు పత్రికాధిపతులు పండితులు ప్రశంసించియున్నారు. ఇది ప్రకటింపఁబడుటకిదియే ప్రథమపర్యాయము. వీరచరిత్రకథాసారము, వీరచరిత్రచారిత్రము, శ్రీనాథజీవిత సంగ్రహమునను 90 పుటల యుపోద్ఘాతము బెజవాడ హిందూహైస్కూలునందలి తెలుఁగు పండితులును బ్రస్తుతమాంధ్రసాహిత్య పరిషత్తు మేనేజరునగు అక్కిరాజు ఉమాకాంతంగారిచే రచింపఁబడి దీనికిఁ జేర్పఁబడినది. దీనివెల రు 1—0—0. నిండుకాలికోబైండు చేసినది, రు. 1—4—0. వలయువారీక్రిందివారికి వ్రాసి తెప్పించికొనవచ్చును.

అక్కిరాజు ఉమాకాంతం.

మేనేజరు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు.

192, ఎస్ప్లనేడు, చెన్నపురి.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల.

## నియమములు.

1. దేశాభివృద్ధికి ఆవశ్యకములైన గ్రంథములు ప్రచురించి భాషాభివృద్ధి చేయుటయే యీ గ్రంథమాలయొక్క యుద్దేశము. ఇందు సంవత్సరమునకు రమారమి 1600 పుటలుగల స్వతంత్రమైన గ్రంథములు నాలుగు ప్రచురింపఁబడును.

2. కొందరు తలచునట్లు ఇది మాసపత్రికకాదు. ఇందు (i) దేశదేశముల చరిత్రములును, (ii) పదార్థ విజ్ఞాన శాస్త్రము (Physics), రసాయనశాస్త్రము (Chemistry), జీవశాస్త్రము (Biology), వృక్షశాస్త్రము (Botany), మొదలయిన ప్రకృతిశాస్త్రములును, (iii) దేశోపకారులగు కొందరు మహనీయుల చరిత్రములును, (iv) ఇంగ్లీషునందలి ఉద్గ్రంథములభాషాంతరీకరణములును మాత్రము ప్రచురింపఁబడును. చరిత్రానుసారములగు కల్పిత కథలు (Historical Novels) కూడ ప్రచురింపఁబడును. కావ్యనాటకాదు లిందుండవు.

3. ఈగ్రంథమాలలో నిదివరకు అచ్చువేయఁబడిన గ్రంథముల నన్నిటిని కొనుచు, నికముందు సంవత్సరమునకు నాలుగు చొప్పున ప్రచురింపబడు గ్రంథముల నన్నిటిని గొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపు చందాదారులు.

4. శాశ్వతపు చందాదారులకు ఈగ్రంథమాలలోని గ్రంథములన్నియు నంచెకూలి మేమేభరించి నూరుపుటలకు రు 0-4-0 చొప్పుననిచ్చెదము. ఇతరులకు ఈపుస్తకములు అంచెకూలి గాకనూరుపుటలకు రు0-6-0 చొ॥ నీయబడును. సంవత్సరము ఒక్కింటికి 1600 పుటలకంటె నెక్కువపుటలుగల గ్రంథములు మేము ప్రచురించముగాన, చందాదారులకు సంవత్సరమునకు రూ. 4-0-0 కంటె నెక్కుడు కర్చు కానేరదు.

5. శాశ్వతపు చందాదారులు సంవత్సరపుచందా మొదట నీయనక్కరలేదు. ఒక్కొకపుస్తక మచ్చుపడగానే అది వ్యాల్యూపేయబిల్ ద్వారా పంపబడును.

6. వెనుకటి పుస్తకములనన్నిటినిగొను చందాదారులు 0-4-0లు ప్రవేశరుసుముక్రింద చెల్లించవలెను. ఈ సొమ్ము దరఖాస్తుతో పంప వచ్చును. లేదా మేము మొదటపంపు వి. పి. లో చేర్చి రాబట్టుకొందుము. వెనుకటి పుస్తకములనన్నిటిని ఒక్కసారి కొనలేని వారు రు 5-0-0ల వెలగల పుస్తకములు మొట్టమొదట కొనిన జాలును. మిగత పుస్తకములు తరువాత తెప్పించుకొనవలెను.

7. వెనుకటి పుస్తకములు అక్కరలేనివారును, లేక కొన్నిమాత్రమే కావలెనను వారును ప్రవేశరుసుముక్రింద రు 1-0-0 చెల్లించవలెను.

8. గ్రంథమాలలోని గ్రంథములన్నియు నునుపైన దళసరికాగితములమీద ముద్రింపబడును. అనేక చక్కనిపటములతో నొప్పుచుండును. క్యాలికోబైండుచేయబడును. సరసమైన వచనశైలిని కలిగియుండును. ఇట్లు సర్వాంగసుందరములై చౌకవెలలకు దొరకు గ్రంథములు తెలుగుభాషలో నరుదు.

## విజ్ఞానచంద్రికా గ్రంథమాల.

### ప్రచురింపబడిన గ్రంథములు.

| | | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|---|
| 1. | అబ్రహాములింకను (Abraham Lincoln) | 0– 8–0 | 0–12–0 |
| 2. | హిందూమహాయుగము (Hindu Period) | 0–11–0 | 1– 0–0 |
| 3. | జీవశాస్త్రము Biology)* | 1– 0–0 | 1– 8–0 |
| 4. | రాణీసంయుక్తము (Historical Novel) | 0– 9–0 | 0–12–0 |
| 5. | మహమ్మదీయమహాయుగము (Mahammadan Period) | 1– 3–0 | 1–12–0 |
| 6. | పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics)* | 0–14–0 | 1– 5–0 |
| 7. | రసాయనశాస్త్రము (Chemistry) | 0–13–0 | 1– 5–0 |
| 8. | ఆంధ్రులచరిత్ర (1-వ. భా.) (Andhra History i.) | 1– 0–0 | 1– 4–0 |
| 9. | విమలాదేవి (Historical Novel) | 0–13–0 | 1– 2–0 |
| 10. | కలరా (Cholera)* | 0– 4–0 | 0– 6–0 |
| 11. | 12. 13. ప్రకృతిశాస్త్రముల ప్రథమపాఠములు* | 1– 2–0 | 1–10–0 |
| 14. | భౌతికశాస్త్ర ప్రథమపాఠములు* | 0– 7–0 | 0– 9–0 |
| 15. | రా. బ. క. వీరేశలింగముగారి స్వీయచరిత్రము | 1– 0–0 | 1– 8–0 |
| 16. | భౌతికశాస్త్రము (Physiography) | 1– 0–0 | 1– 8–0 |
| 17. | ఢిల్లీదర్బారు (Dheli Durbar) | 1– 0–0 | 1– 8–0 |
| 18. | ఆంధ్రులచరిత్రము (2-వ. భా.) (Andhra History ii.) | 1– 0–0 | 1– 8–0 |
| 19. | చంద్రగుప్తచక్రవర్తి (Emperor Chandra Gupta) | 0– 8–0 | 0–12–0 |
| 20. | చలిజ్వరము (Malaria) | 0– 5–0 | 0– 7–0 |

☞ ఇందు చందాదారులు పోస్టేజి భరించ నక్కర లేదు. ఇతరులు పోస్టేజి భరించవలెను. పుస్తకము లన్నియు చక్కని క్యాలికోబైండు చేయబడినవి. * ఈ గ్రంథములు ప్రస్తుతమందు లేవు.

చింత్రాదిపేట 1912 }
మద్రాసు. }

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం,
మేనేజరు:

---

# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల.

## నిడదవోలు, కృష్ణాజిల్లా.

ఇందు చక్కని క్యాలికోబైండుగల నవలలు రెండుమాసముల కొక్కొక్కటిగా వెలువడును. ఈ నవలలు చరిత్రబోధకములును మనోహరకథాకల్పితములునై చదువరుల హృదయముల నాకర్షించుచుండును. ఈనవలలనుగూర్చియు, ప్రస్తుతకాలమున నాంధ్రభాషాభివృద్ధికి నవలలయొక్కయవసరమును గూర్చియు, ననేకు లనేకాభిప్రాయముల నిచ్చియున్నారు. ఆంధ్రభాషాభివృద్ధి కీనవలలు ప్రథమసోపానములని చెప్పవచ్చును. ఇందు శాశ్వతచందాదారులుగా చేరువారికి మంచి క్యాలికోబైండుచేయబడిన నవలలు డెమ్మీసైజున 100 పేజీలకు రు 0—6—0 చొ॥ వెలయేర్పఱచి వి. పి. గాఁబంపుచుందుము. ఇతరులకు పోస్టేజిగాక100 పేజీలకు రు 0—8—0ల చొ॥నిచ్చెదము.

ఏనవలయైనను ఒకరూపాయి వెలకు మించియుండదు.

చందాదారులుగా చేరువారు 0—2—0అడ్మిషను ఫీజు నీయవలెను.

## ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల.

### ఈ గ్రంథమాలికనుండి వెలువడిన నవలలు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1. దుర్గేశనందని. 231 పేజీలు | 0—12—0 | 1—0—0 |
| 2. వసుమతీవసంతము. 300 | 1—0—0 | 1—8—0 |
| 3. లలితచంద్రహాసము. 166 పేజీలు | 0—10—0 | 0—14—0 |
| 4. మృణ్మయి. 256 పేజీలు | 1—0—0 | 1—5—0 |
| 5. సీతారామ. 320 పేజీలు | 1—0—0 | 1—8—0 |
| 6. నూర్జహాను. 340 పేజీలు | 1—0—0 | 1—8—0 |
| 7. రాజసింహ. 280 పేజీలు | 1—0—0 | 1—8—0 |

### అనుబంధ గ్రంథములు.

| | |
|---|---|
| 1. రాధారాణి | 0—4—0 |
| 2. యుగళాంగుళీయకము | 0—3—0 |
| 3. రాజభక్తి | 0—2—0 |
| 4. లీల | 0—4—0 |
| 5. దుర్గేశనందని విమర్శనము | 0—8—0 |

వలయువారు:—

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

నిడదవోలు కృష్ణాజిల్లా.

అని వ్రాయవలయును.

శ్రీ కృష్ణాయనమః.

# * ఆంధ్రగద్యపద్యకావ్యములు.

ఈ యుపన్యాసంబున నేను నుడువునంశంబులలోఁ గొన్నిటింగూర్చి కొందఱికి భిన్నాభిప్రాయంబు గలుగవచ్చునని యే నెఱుంగుదు. ఐనను భాషావిషయమై నా డెందంబునఁ దోఁచినవానిం జెప్పమి ధర్మేతరంబని తలంచివానిం జెప్పెదఁ గాని యెవ్వారికిని నెవ్వొదవింప నెంచినవాఁడను గానని యందఱికిని సవినయంబుగ విన్నవించువాఁడ. మనమందఱమును మనభాషకు లగ్గొదవింప నెంచినవారముకాని యెగ్గుకావింప నెంచినవారము కాముకదా. అభిప్రాయభేదములున్నంతన మనలో నొండొరులకు మనంబుల నొప్పమి యుప్పతిల్లనేల? అందఱమునుగూడి నెయ్యంబలరార నెల్లవిషయంబులను లెస్సగాఁ జర్చించి మేలుకీడులనరసి భాషాపోషంబోషింపఁ బ్రయత్నింతము.

ఈ యుపన్యాసమును నేను విదిత వేదితవ్యులును సరసకావ్య నిర్మాణదక్షులును నగు మహాపండితులకొఱ కెంతమాత్రమును వ్రాసినవాఁడఁగాను గావున వారెఱింగిన విషయంబులను నేను జెప్పినచో నవి యాంధ్రభాషయందాదరంబు కలిగినవీనముగా గ్రంథరచనయందుఁ బ్రవర్తింపఁ దలంపుగొనిన వారి కొఱకై వ్రాయుచ్చువాఁడనని విన్నవింతు.

మున్నుగాఁ గావ్యమునుగూర్చి కొంతచర్చించెద. కావ్యంబనఁగాఁ గవిచే రచియింపఁబడిన గ్రంథము. కావ్యమువలన జనులకుఁ బురుషార్థములు లభించు. కావ్యంబునఁ గవికిని నందుఁగీర్తింపఁబడిన వారికిని జిరంబగు యశస్సుగలుగును.

"కావ్యం యశసేర్థకృతే । వ్యవహార విదే శివేతరక్షతయే ।
సద్యఃపరనిర్వృతయే । కాంతాసమ్మిత తయోపయుజే ॥"

"వినుతయశంబునం గలుగు విశ్రుతనాకనివాసమయ్యశో
జననము శ్రవ్యకావ్యముల సంగతినొప్పగు శ్రవ్యకావ్యముం
దనరుఁగవిప్రభావమునఁ దత్కవి సమ్మతిలేని రాజులే
పునవిహరింపరవ్విభులు పోయినజాడ లెఱుంగఁబోలునే॥"

---

* ఈ యుపన్యాసము పరిషత్ప్రథమసాంవత్సరిక సభయందు చదువఁబడినది.

"కవిసంసిద్ధపదంబు భావరసవిఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబునుదాత్తనాయకము శ్రవ్యంబుంజతుర్వర్గసం
భవసద్మంబును నైన కావ్యమిల నాపద్మోద్భవస్థాయియై
కవిసంస్ఫూర్తియు దాత్మకీర్తియుఁదగం గల్పించు నెల్లప్పుడున్॥"

అని లాక్షణికులు చెప్పియున్నారు.

కావ్యంబు చదువువారి మనంబుల నానందవిశేషంబుఁ గల్పించు. కావ్యానందంబు బ్రహ్మానందముతోఁడులఁ దూఁగునని సహృదయులు నుడువుదురు.

అట్లు సర్వాభీష్టప్రదంబై తనరారుకావ్యము ద్వివిధము. గద్యకావ్యము. పద్యకావ్యము. అని.

వాక్యసముదాయముల నొప్పారునది గద్యకావ్యము. ఛందోనిబద్ధమై యొప్పునది పద్యకావ్యము. నాటకము గద్యపద్యసంకలితము. నాటకముంగూర్చి యీ వ్యాసంబునఁజెప్ప నవసరంబు లేమిచే దానిం జెప్పనైతి.

తొలుతఁగావ్య సామాన్యమునుగూర్చి కొంత యుపన్యసించి పిదపఁ బద్య కావ్యములగుఱించి వక్కాణించి యనంతరము గద్యకావ్యములఁగూర్చి నుడివెద.

కావ్యనిర్మాణము చేయఁదలంపుగొనిన కవికిఁ బ్రతిభయు, వ్యుత్పత్తియు, నభ్యాసమును నవశ్యములు. ఈమూఁటిలో నేదిలేకున్నను నుత్తమకావ్యము రచింప సాధ్యముకాదు.

"ప్రతిభ" యనఁగాఁ గావ్యరచనకు హేతువగు నొకశక్తి- అయ్యది ప్రాక్తన జన్మసంస్కారవిశేషము వలనఁ గలుగును.

"శక్తిః కవిత్వబీజం హి ప్రాక్తనీ కాపిసంస్క్రియా।
యయావినాన ప్రసరేత్కావ్యం శిక్షావతామపి॥"

ప్రతిభాస్వరూపం బిట్లునిరూపింపఁబడియె:—

"స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా।
బుద్ధిస్తాత్కాలికీజ్ఞేయా ప్రజ్ఞాత్రైకాలికీమతా॥
ప్రజ్ఞానవనవోన్మేషశాలినీ ప్రతిభామతా॥"

క్రొత్తక్రొత్త గనుల్లేఖంబుల నంకురింపఁజేయు ప్రజ్ఞావిశేషము ప్రతిభ యనంబడును.

"వ్యుత్పత్తి" యనఁగా లోకమునందలి వస్తువుల స్వరూపములను, నాచారవ్యవహారములను, ఛందస్సు, వ్యాకరణము మొదలగు శాస్త్రములను, బురాణేతిహాసములు మొదలగు కావ్యములను లెస్సగా నెఱుఁగుటవలనఁ గలిగిన పాండిత్యము.

"వ్యుత్పత్తిర్లోక చారిత్ర శాస్త్ర కావ్యాద్యవేక్షణం" అని ప్రమాణ వచనముగలదు.

అభ్యాసమనఁగాఁ గావ్యజ్ఞోపదిష్ట మార్గమునఁ సత్కావ్యరచన యందు నిరంతరము పరిశ్రమము సేయుట.

ఇమ్మూంటిలో నేదిలేకున్నను నుత్తమకావ్యము రచింపశక్యముగాదు. కేవలప్రతిభయుండియు వ్యుత్పత్తిలేనియాతఁడు రచియించు కావ్యము తప్పులకుప్పయై పరిహాసపాత్రంబగు. వ్యుత్పత్తియున్నను బ్రతిభ లేకుండెనేనిఁ గావ్యము రసవంతముగానోపదు. అభ్యాసము లేనిచోఁ గావ్యరచనయే కష్టంబని చెప్పవలయునే?

"చరస్థిరానేకవిధలోక వృత్తానువర్తినః।
కావ్యస్యకారణంలోక జ్ఞానముచ్ఛ్వసితంకవేః॥"
"లోకశాస్త్రపురాణాది జ్ఞానవానపిసీదతి।
అజ్ఞాతకావ్యసరణిః కావ్యనిర్మాణకర్మణి॥"
"కిమేవంబహునోక్తేన లోకేయద్వ్యవహార్యతే।
తత్తత్సర్వంవేదితవ్యం కాంక్షతాకావ్యనిర్మితిం॥"
అని పెద్దలు చెప్పియున్నారు

ఆంధ్రభాషయందుఁగల కావ్యములిప్పటికేచందంబుననున్నవి? ఇఁక మీఁదఁ గావ్యరచనలు సేయునెడఁ గృతికర్తలేయేవిధంబుల నేయేమార్పులు గావింపవచ్చు? ఈయంశంబులు కొంచెకవిచారింతము.

ఆంధ్రమునఁ బ్రథమగ్రంథము కవిత్రయమువారని వినుతిగన్న నన్నయ, యెఱ్ఱన, తిక్కన, యనునిమ్మువ్వురు కవీశ్వరులు వ్రాసినమహాభారతము. దీనికి ముందు గ్రంథము లుండకపోవుగాని యవియనుపలబ్ధంబులగుటచే భారతము మొదటికబ్బంబని చెప్పనొప్పు.

కవిత్రయమువారి కవిత్వ మెల్లవిధంబులను లోకోత్తరము. వారికవిత్వముతో సమానమగు కవనము మనభాషయందు లేదని పండితులందఱు నేకగ్రీ

నంబుగ నుతువుచున్నారు. ఆంధ్రసరస్వతికి వారిరచనలే ప్రాణములు. భారత శైలికంతటి ప్రాశస్త్య మెట్లుగలిగె ? ఈగ్రంథమునఁ దెలుఁగుపదములు మెండు-రచన లక్షణసమన్వితమై నిర్దుష్టముగా నొప్పారు. అర్థపుష్టిని గలిగింపని వ్యర్థపద ములు తఱుచుగా లేవు. పదములపొందిక లలితమై యర్థగాంభీర్యముగలిగి ప్రౌఢ మై యొసలారు. సంస్కృతరచన లున్నచోటుల సుప్రసిద్ధములును నార్యజన సమ్మతములునునగు మాటలేయిందుఁ జూపట్టుఁగాని నిఘంటుమాత్ర శరణంబు లగు నప్రసిద్ధపదంబులు గన్పట్టవు. రూక్షములగు నతిదీర్ఘసమాసములు ప్రాయి కముగా లేవు. కేవలశబ్ద చిత్రములు గలరచన లీగ్రంథంబునఁ బొడసూపవు. పాక ముద్రాఖౌ పాకమై పద్యములఁజదివినంతన భావవిస్ఫూర్తి గలిగించు. అన్వయ సౌలభ్యముకలిగి చక్కని లోకోక్తులచే విలసిల్లుచు రసవంతమై శైలియెంతయు మనోహరమై చదువఁజదువఁ బరమాహ్లాదంబుఁ గలిగించు. ఈచెప్పిన గుణము లు నన్నయ, యెఱ్ఱన, రచనలకంటెఁ దిక్కనసోమయాజి శైలియందెక్కుడుగాఁ గాన్పించును. ఇమ్మహనీయ గ్రంథమునఁ జూపట్టురచనా ప్రౌఢిమయుఁ బదసా రళ్యంబును ననర్గళంబగు కవితాధారయు వ్యాకరణప్రయోగ ప్రాగల్భ్యంబును ఛందశ్శాస్త్రపటిమయు మఱియెవ్వరికవనంబునను జూపట్టవు. కావున భారతము కేవలలక్ష్య గ్రంథముగానేకాక గొప్పలక్షణ గ్రంథముగాను వినుతిగాంచుచు నాంధ్రగ్రంథములలో నుత్తమోత్తమంబై నివ్వటిల్లు.

పిమ్మటికవులు కవిత్రయము వారికవనమునం దత్యంతగౌరవము సూపుచు వారిని నాదిసత్కవీశ్వరులనుగాఁ దమ కావ్యములలోఁ బ్రస్తుతించుచు వారికవి త్వములం గన్పట్టులక్షణములను దమరచనలలోఁ బాటించుచువచ్చిరి. కాని, శైలి నంతగా ననుసరింపక స్వేష్టానుబోధంబుగ మార్చుచువచ్చిరి.

శ్రీనాథుఁడు, పెద్దన, రామరాజభూషణుఁడు లోనగుకవిపుంగవులు విశే షముగా సంస్కృత శబ్దములను బ్రయోగింపుచుఁ గడుదీర్ఘములగు సమాస ములను వ్రాయుచుఁ గావ్యనిర్మాణంబు గావించిరి.

శా. "కిందుర్వాణపురందరాదిక మహాగీర్వాణ కోటీకిరీ
టాంకస్థాపితనూత్నరత్న రుచిధారాశ్లేష కిమ్మీరప
త్పంకేజుండు హరుండుజంతువులకుం బ్రాణాంతకాలంబునం
దోంకారాక్షర మంత్రరాజము చెవిన్ దానొజించుఁగాశీస్థలిన్"

పోతన మొదలగువారు వీనికిఁదోడుగ శబ్దాలంకారములను బ్రయోగింపఁ జొచ్చిరి.

ఉ. "పుణ్యుఁడు రామచంద్రుఁడటఁ బోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యము తాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హి బర్హలా
వణ్యము గౌతమీవిమలవాఃకణ పర్యటనప్రభూతసా
ద్గుణ్యము నుల్లసత్తరుని కుంజవరేణ్యము సత్యగణ్యము౯."

శ్రీనాథాదులు వ్రాసినవి కొన్ని పురాణములు. తక్కినవి ప్రబంధములు. వారికిఁ దరువాతి కవీశ్వరులును మహాసమర్థులయ్యు నేలోకోత్తమకావ్యములను శబ్దాలంకార భూయిష్ఠములుగను కేవలవర్ణనల నెప్పువానిఁగాను సంస్కృత రచనా ప్రావీణ్యంబు నెఱపుచు గతానుగతికులై రచియించుచు వచ్చిరి. బంధకవిత్వము, గర్భకవిత్వము, పాదభ్రమకము, పద్యభ్రమకము, శబ్దచిత్రరచనలు మొదలగువానియం దత్యంతాదరంబు సేయుచుఁ దద్రచనలయందుఁ దమనైపుణ్యంబుఁ జూపఁదొడంగిరి.

సంస్కృత భాషాపరిజ్ఞానము లేక తెలుఁగుభాషయందుఁ బాండిత్యము లభింపదు. దానియందును వ్యాకరణము నభ్యసించినంగాని యుత్తమజ్ఞానంబు లవడదు. వ్యాకరణశాస్త్రముఁ జదువనివారు కవిత్వముచేయఁ బూనుచో స్త్రీ పున్నపుంసకలింగ భేదము తెలియంగక "దారాపుత్రాదులు" లోనగు దుష్టప్రయోగములు సేయుచు, సమాసములు ఘటించు నేర్పుగానక, ధర్మధర్మి వాచక భేదంబులు తెలియక "సాఖశాయనికుఁడు" "సౌస్నాతికుఁడు" "ఉష్ట్రిగోయుగము" మొదలగు తద్ధితరూపంబుల యర్థం బెఱుంగక, తోఁచినట్లెల్ల వ్రాయుచు నపహాసభాజనులగుదురు.

పూర్వకాలపుఁ గవినాథులు సంస్కృతభాషయం దధిక పాండిత్యము గలవారనుటకు వారికావ్యములే నిదర్శనములు.

"సామర్షదళిత వరభట, సామజహయకూల ముద్రుజక్షతజధునీ
కాముకితాఖిల జలధికి, నాముష్యాయణ సుధీగృహాంగణ నిధికి౯."

"కర్పూరకదళికా కాంతారపవనంబులధ్వనీనుల శ్రాంతినపనయింప"

"జితకాశులు ధరణీపతులు శిశుపాలాదుల్"

ప్రబంధములు వ్రాసినకవులు వర్ణనలు సేయుటయు శబ్దవైచిత్రి చూపుటయుఁ బరమార్థములుగా గ్రహించిరి.

" సీ॥ కేళీసరోవీథినాళీకవాటీమధూళీఝరీరాజిఁ దేలి తేలి।
చూళీమహాభోగచూళీనవ ప్రసూనాళీ సుగంధంబు లానియాని।
ఱోలీభవత్పుష్పధూళీ చరద్భృంగపాళీ నిరోధాప్తిఁ దాళితాళి।
తాళీవనీ నారికేళీ రసాలకంకేళీ హితచ్ఛాయఁ గరలి కెరలి
మెలఁగునా మనిమునిదరీ వలయనిలయ
నిలయనందన చందనా కలితలలిత
ఫలితలవలీనికుం జాబ్జ వదనపదన
కదనఘూర్ణాపహంబైన గంధవహము॥"

" ఉదయింపు రవియింపు నదలింపు జిగి పెంపు
మెఱయింపు నెఱికెంపు మేడతుదలు।
నెఱకొన్న నునుఁగ్రొన్ననలఁ జెన్నలరుచున్న
తెలివొన్న సురపొన్న తీఁగయిండ్లు।
సుమవాటినలతేఁటి గమివాటిలినమేటి
నన సీటివలియేటి ఘనతటములు।
చెలువారుమణిచారు కళదీరుచును మేరు
గిరితీరుననుమీఱు కేళిధరము॥
చేరికనుఁ గొంచునంతనుదారతార
సౌరభపటీరలతికా కుటీరవార
సారకల్హారకాసారతీరభూమి
నందమగునట్టి హేమకూటాంతరమున॥"

ఇట్టిరచనలు చేసినవారు శబ్దముల నేర్పఱిచి కూర్చిపిమ్మట వానికెట్లో యర్థములను విచారించినట్లు కానంబడుచున్నది కాని మున్నుగాఁ జెప్పఁదగిన యర్థమును మనంబునఁగల్పించుకొని వానిం దెలుపఁ జాలు శబ్దంబులు ప్రయోగించినట్లు కానంబడదు - చూడుఁడు.

" అలికి కేకుల హాళాహాళికి గద్దఱిపికావళికి మందపుఁ గరువలికిఁ గసరు
చిలికి సారెకుఁ జేరి కులికియార్చు పిసాళికలికి రాచిలుక తెక్కలికిఁ దొగల
చెలికిఁ గప్రపుబూతివలికి మారుని పూవ్రుములికి మొత్తములయంకిలికి నంచ
కలికిమిన్నల బల్లవళికి శారికలరవళికి నామని పెద్ద పులికిమృదుల।

వలికిఁ బన్నీటి వాఁకయుబ్బలికి గంధ
ఫలికివికసిత సుమవనస్థలికిఁ గూర్చె
వెలికిఁ గ్రమ్మఁగఁ జిలుకలకొలికి కెంత
యలికియులికెనో మముఁ దూలఁబలికి నేఁడు ॥”

క. “మరుఁడావి చరితసకలా మరుఁడాగరుడాసనుని కొమారుఁడాసుమతీ
మరుఁడా విరహులపైవే మఱుఁడాయఁగ రాకుక్రూరమతిఁబామరుఁడా.”

క. “సారంగమరంగన్మద సారంగమభూరి గంధసారంగమహా
సారసమానవ వికసిత సారసమా చూపఁగదవె సారసమాక్షీ.”

ఇట్టికవనములు మనయాంధ్రకావ్యములలో లెక్కకుమీఱి కానంబడియెడి.

మనకావ్యములలోఁ బ్రతిపాదింపఁబడిన విషయములును నానుపూర్వియుఁ బ్రాయికముగా నొక్కతీరుననే యుండును. గ్రంథారంభంబున నిష్టదేవతాస్తుతియుఁ గృతినాయకవంశాను వర్ణనంబును గవివంశాను కీర్తనంబును, షష్ఠ్యంతములును, బిదప నేదేని నొక పురంబును వర్ణించుటయు, నందుఁగల వప్రగోపుర ప్రాకారపరిఖాదులు, నాలుగువర్ణములు, పుష్పలావికలు, గజతురగస్యందనాదులు, మలయమారుతము, మొదలగువానిని వరుసదప్పక వర్ణించుటయుఁ, గథా నాయకవర్ణనము, వనవిహారము, మృగయావినోద కథనము, కథానాయికా వర్ణనము, వసంతర్తువు, సంధ్యాకాలము, సూర్యాస్తమయము, చంద్రోదయము, విరహము, మలయమారుతాద్యుపాలంభనము, జలక్రీడ, పుష్పాపచయము, నాయికానాయక వివాహాదులు, మొదలగువిషయములను బ్రసక్తములైనను నప్రసక్తములైనను వరుసగా వర్ణించుటయు నొక సంప్రదాయముగాఁగానంబడుచున్నది.

శృంగారాదిరసరములు వర్ణింపవలసిన సందర్భములు పొసఁగినపుడు వాని నుచితరీతుల వర్ణింపవలయుఁగాని గ్రంథమంతయుఁ గేవల వర్ణనలతోఁ బూరించుటయు నావర్ణనలును రసాభాసంబుగఁ జేయుటయు సహృదయ హృదయంగమంబులు కానేరవు. ఈవిషయంబునను గవిత్రయమువారు చూపిన త్రోవ యెంతయుఁ బొగడఁదగి యున్నది.

“చంచలఁ జిగురాకుఁ జించియాడుచునలి
నెలుఁగిచ్చుగండుఁ గోయిలలసొంపు

నలరుఁదేనియఁగ్రోలి సొమ్మలయుసోలంబున
మఱియు తేఁటులనును మ్రోఁతయింపుఁ
దమిఁబండ్లరసమాని తమలోనఁ జెలఁగుచుఁ
బల్కు రాచిల్కల పదువురగుఁ।
గొలఁకుల కెలఁకులఁ గూడి క్రీడించుచుం
డెడునంచతండంబు నడ బెడంగుఁ
దరఁగఁ దేలుచుఁ బూఁదీఁగఁ దగులువడుచు
వచ్చుచిఱుగాలి సోఁకున కిచ్చమెచ్చి
తగిలికొని యాడుచును వినతయును గద్రు
వయును మున్నిటిచేరువ వనమునందు."

ఇట్లు లలితపదములు విలసిల్ల స్వభావోక్తుల వర్ణించుట శ్లాఘాపాత్రం బగుమనోజ్ఞకవనంబుగావున సమ్మార్గంబు నధునాతన కవులనుసంధింపవలయు నని విన్నవించుచున్నాఁడ.

కేవల శబ్దాలంకారములనే వ్రాయుటలో నేమి స్వారస్యము గలదు? ఇఁకనైనను గవులు కేవలవర్ణనలను శబ్దచిత్రములను ముఖ్యముగాఁ గైకొనక యేదైన నొక్కకథను నీతిబోధకమగు దానిం గైకొని దానిం జమత్కారముగా సురుచిరపదకలితంబుగ వ్రాయఁ బూనవలయు. ఏవైనఁ గొన్ని నీతులనోజ్ఞానోత్పాదకంబులును నుపయుక్తములునగు నితరవిషయములనో జనులెఱుంగునట్లు మృదుమధుర వచనంబులఁ గావ్యములు రచించుటొప్పగు. అక్కడక్కడ సందర్భవశంబున నేదైన నొకవిషయంబును వర్ణించుట ప్రసక్తమైనచో నద్దానిని సముచితంబగు చందంబున రసానుగుణంబుగ నించుక వర్ణించినచో నయ్యది భోజన సమయంబున నుపదంశంబునుం బోలెఁ జవులొదవించుచు నాహ్లాదంబు గావించు.

ఆనుశాసనికపర్వంబున నగ్నిదేవుఁడు సుదర్శన యను కన్యకను బెండ్లియగు సందర్భమునఁ దిక్కనసోమయాజి

"అర్చించునప్పుడయ్యంగన కెంగేలిజిగిసొంపు చిత్తంబుఁ దిగిచికొనఁగ
నరసికన్గొను నప్పుడయ్యింతికనుఁగవపొలపము రాగంబుపొదలఁ జేయు
నన్యులఁ బనిపంపునప్పుడా ముద్దియపలుకులతీపు కోర్కులఁ గెరల్ప
నల్లనయాడెడు నప్పుడక్కొమ్మవాతెఱతావిధైర్యంబుఁ ద్రిప్పికొలుప।

మరుఁడు తోడ్తోడఁ దేఁకువమాలికదిసి
తూఁపుగముల గ్రొవ్వాఁడిమిచూపనంత
కంతకునునగ్గలం బగుచంతఁదూలి
పోయెఁ బావకుఁ డేమిచెప్పుదు నరేంద్ర"
అని యెంతయు సరసముగావర్ణించె.

శైలియందును గావ్యములలోఁ జాలమార్పులు చేయవలయునని నాయభిప్రాయము. తెలుఁగుపొత్తములలో సంస్కృతశబ్దములను బెల్లుగాఁ బ్రయోగించుట తగదనియుఁ దెలుఁగుపలుకులనే విశేషముగా నుపయోగింపవలయుననియుఁ జెప్పియున్నాఁడ. గ్రంథమంతయుఁ గడుంబొడవులగు సమాసములతో నిండించినచో నేమని చెప్పవలయునో తెలియరాకున్నది. అట్టి కబ్బంబులను నాంధ్రకావ్యంబులని యెప్పగిదిఁ జెప్పనగు? అవి సంస్కృతగ్రంథములును గాక యాంధ్రగ్రంథములనిపేరందక యుభయభాషా పండితులకును బ్రియంబు సేయవు. కావున సాధ్యమగు నంతకుఁ గేవలాంధ్రపదములనే ప్రయోగింపవలయు. భారత కవనముఁబోలె ద్రాక్షాపాకమై జనులకు సుబోధంబగు శైలినవలంబింపవలయుఁ గాని కేవల పాండిత్య ప్రకటనము సేయుట పరమార్థముగా భావించి కవనము సేయుట సమంజసము కాదు.

"ముక్కుద్రాటఁ గాలుగ్రుచ్చనగునె"
"ఉరిసినపుండులనుప్పు వెట్టినక్రియ"
"నేతికుండపై యెలుక"
"తేనియపూసినకత్తివి"
"కీలెడపిన జంత్రమువడువున"
"గుండ్లు తేలి బెండ్లుమునింగినట్లయ్యె"
"అమ్మునఁ జేయిడిసిద్రవ్వరాదె"
"లేడికడుపునఁ బులిపుట్టునే"
"కప్ప యెలుంగు పాము"
"నాలుకబెల్లము నెదకత్తెరయునై"
"మెత్తనిపులి"
"ఒడల్ చిదిమినఁ బాలువచ్చు"

'ఈగకాలియంతయేనియు వీసరపోవకుండ"

"కడుపు చల్లగాఁబుట్టిన ఘనభుజుండు"

ఇట్టిజాతీయములు (idioms) ప్రయోగించుట యెంతయుస్వారస్యము.

ఇఁకమార్పుచేయరాని యంశంబులఁగూర్చి యించుక విచారింతము. ఏవిషయమునేనియు మార్పుచేయునెడమును వున్నదానికంటె మేలగుతెఱంగున మార్పవలయుంగాని తొంటిచందంబునకు లోఁకువయగు చాడ్పునమార్చుట యొప్పనిపనికదా. కావ్యరచన సేయుటకుమున్నగా దానికివలయు నియమంబులు లెస్సయెఱుఁగుట యావశ్యకము. నియమంబులలోఁగొన్ని వైధంబులు; కొన్ని యైచ్ఛికంబులు.

వైధంబులగు నియమంబులు (1) వ్యాకరణలక్షణములు. ఇవిగద్య పద్య కావ్యములు రెంటికినవశ్యము. (2) ఛందోలక్షణములు. ఇవి పద్యకావ్యముల కావశ్యకము.

ఐచ్ఛికంబులగు నియమంబులు. శ్లేషకావ్యము. నిరోష్ఠ్యము. శుద్ధాంధ్రము. గర్భకవిత్వము. బంధకవిత్వము. సర్వలఘురచన. ఏకాక్షర ద్వ్యక్షర రచనలు. సర్వతఃప్రాసము. అంత్యావర్ణనియమము. యమకము. దుష్కరప్రాసము, లోనగునవేకములు గలవు.

వీనిలో వైధంబులగు నియమంబుల నెన్నఁటికిని విడువఁజనదు. ఇవిభాషకంగములు గావున వీనిని విడిచితిమేని యవయవంబులులేని మనుజుంబోలె భాషపసచెడియేవగించు.

భాషామూలమున నెల్లజనులు నెండొరులతో వ్యవహారములు సలుపుదురు. కావున భాషతన్ను వ్యవహరించు జనుల సంస్కారముల కనుగుణముగా వర్ణలోప వ్యత్యయవికారములఁబొంది యుండును. సామాన్యజనులాడుకొను మాటలు సంస్కారహీనములై నియమమెద్దియును లేక యిచ్చకువచ్చిన చొప్పున నుండును. కావున వివేకవంతులగు మనపూర్వులు తాము వ్యవహరించు భాషను సంస్కరించి నిబంధన లేర్పఱిచి విశృంఖలప్రవృత్తి కెడమీయక శ్రావ్యముగా నొప్పునట్లు గావించిరి, కొందఱుభాష కలంకారములగు నియమంబుల నుగ్రమంబునఁ గల్పించి వన్నియఁదెచ్చిరి.

భాషయెట్లు లోకమున వ్యవహరింపఁ బడుచున్నదో యారీతిననే గ్రంథములలో దానిం బ్రయోగింపవలయునని కొందఱు తలంచునట్లు తెలియవచ్చెడి.

బంగారమును వెండిని గనులలోనుండి త్రవ్వియెత్తిన విధంబున ధరించిన సందం బుగా నుండునే? వానిని సంస్కరించినం గదా యందలి మాలిన్యం బెడలి ప్రకాశమానంబులయి ధారణయోగ్యంబులగు. జనులు మాటలాడు భాష యు సంస్కృతమై నియమములు లేక యుండుటచే నొకపదమునే యొకదేశమున జనులొక్కవిధమునను, మఱియొక దేశమువారు వేఱువిధంబునను, వ్యవహ రించుట సహజముగా నునికి మనమెఱింగినయదియే వ్యవహారభాషలో సా మాన్యముగాం బండితులవలనను గ్రామ్యము లుపయోగింపం బడుచున్నవి.? ఒకరు "వెళ్లాలి" అనుచో నింకొకరు "వెళ్లవలె" అనియు "వస్తవి" అని కొందఱునుదానిని "వస్తాయి" "వొస్తాయ్" అని మఱికొందఱును, "చూత ము" అనుటను "చూస్తాము" "చూతాం" అని కొందఱును "భ్రమసి' అను టను "బెమిసి" అనియు "చేత" అనుటకు "చాత" అనియు "ఏనుఁగు" అను టకు "ఏనిగ" అనియు "లేక,, అనుటకు "ల్యాక" అనియు "చేయు" అను టకు "శాయ" అనియుఁ జెప్పుట మనమనుదినమును వినుచునేయున్నాము. ఈ రూపములను గ్రంథములలో నుపయోగింపం జనునా? వ్యవహారంబున నెట్లు న్నను గ్రంథములలో వ్యాకరణ లక్షణములఁ బాటింపమేని యొకగ్రంథముఁ బోలె మఱియొకటి యుండకపోవుట యటుండఁగా నొకకబ్బమునందే యొక మాట యొకచోట నొక్కవిధంబునను, నొండొకచోటఁ బ్రకారాంతరంబుగను బ్రయోగింపఁబడుట తటస్థించును. భాషకు వ్యవస్థలేకున్నఁ దాఱుమాఱుగా నానారూపములతో శబ్దములు ప్రయుక్తములై శ్రవణకటువులగును. కావున వ్యవహారదృష్టంబగు భాష గ్రంథములలో నెన్నఁడును సమాదరణీయము కాదనియు, దానిని స్వీకరించుట భాషకు వినాశహేతువనియు, "దేశభాష లందుఁ దెనుఁగులెస్స" యనియు " Italian of the East " అనియు లోక విఖ్యాతిఁగాంచిన మనభాషనిట్లు వికృతరూపం గావింపఁబూనుట యుచితంబు గాదనియు విన్నవించుచున్నాఁడ. సంధివిషయమును, నర్ధానుస్వార శకటరేఫ విషయమును, వ్యాకరణలక్షణములలోఁ జేరినవి కావున వానింగూర్చి వేఱుగాఁ జెప్పవలసిన యవసరములేదు.

పద్యకావ్యములలో వ్యాకరణలక్షణములేకాక ఛందోలక్షణములను బాటింపవలయు. ఈవృత్తమునే వ్రాయవలఁయునను నియమము కవులకు లేదు గాని, యేవృత్తము వ్రాయఁబూనిన నావృత్తలక్షణము ననుసరింపవలయు. కొందఱు యతిప్రాసములనుదిగనాడి.

క. "శ్రీవేంకటగిరి నాథుని చరణసరోజద్వయంబు డెందంబుననేఁ
గొలిచెదన శ్రాంతంబును నిహపరసౌఖ్యములనొసఁగిననుఁ బ్రోచుటకై."

అనియీవడువునఁ బద్యములు వ్రాయుట సుకరంబనియు, నిమ్మార్గమను సంధింపవలయుననియు, నభిప్రాయపడు చున్నారని వినుచున్నాను. పైపద్య మెంత రమణీయముగాను శ్రావ్యముగా నున్నదో వినువారలూహింతురు గాక. యతిప్రాసములు మహాకవులచే ననుష్ఠింపఁబడిన సత్సంప్రదాయములు గావున నవి యవశ్యాను సరణీయంబులు.

ఐచ్ఛికనియములం గూర్చి విస్తరించి చెప్పవలసినది లేదు. శుద్ధాంధ్ర మున నే గ్రంథమంతయు రచియింప వలయునను నిర్బంధము లేదు. పొన్నగంటి తెలనార్యుఁడు, కూచిమంచి తిమ్మకవి మున్నగు కవు లచ్చతెనుఁగుననే కావ్యం బులు రసవంతములు గాఁ వ్రాసి యున్నారు.

ఉ. "పిన్నవుగాన నీవు కడుఁ బ్రేముడి ముంగిటిలోనఁ ద్రిమ్మరన్
నిన్న బలెందలంపఁబడు నీవిటనిల్చిన పెక్కులేండ్లు మా
కన్నులువాచునీ మొకముగానక యెప్పుడు॥ జూడకున్న నా
యన్నయిదేటికిందమకమారసి చూచినవింత వాఁడవే."

ఇట్టియచ్చ తెనుఁగురచనలు మధురములై యానందజనకములై యల రారుఁగాని కొన్నిచోటుల సంస్కృతపదంబులు పొదివిరచన సేతయ సరసంబని భావింతు.

సీతారామాంజనేయ సంవాదమను కేవలవేదాంత గ్రంథమునందుఁ గవి తన ప్రాగల్భ్యముఁ జూపుటకై యనేకశబ్దాలంకార రచనలుగావించి తనివి చెందక,

" క. నానానూనుని ననిన న్నే నేనన నిన్నున న్నే నేననని న
న్నే నును నేనన్నా నా నేనునునిన్నెన్ని నన్ను నిను నేననననా.

అనియిట్లొక పద్యమంతయు నెకయక్షరముతోనే యేకాక్షర కందంబని పేరుపెట్టి వ్రాసెను. ప్రబంధరాజ శిరోభూషణ విజయ వేంకటేశ్వర విలాసమను గ్రంథమును జూచితిమేని తత్కృతికర్త శబ్దచిత్రములకై యెంతశ్రమపడి యున్నాఁడో తెల్లంబగు. కొందఱుకవీశ్వరులొక పద్యంబునఁ బెక్కుపద్య ములనిమిడ్చి గర్భకవిత్వమును, చక్రబంధము, నాగబంధము, పద్మదళబంధము, ఛురికాబంధము, రథబంధము మొదలగు బంధకవిత్వమును'.

" క. ధీరశయ నీయశరధీ, మారవిభాను మతమమతమను భావిరమా
సారసవననవసరసా, దారదసమతారతారతామసధరదా."

అనియిట్టి పాదభ్రమకములు మొదలగుక్లిష్టరచనలు కావించియున్నను, నిట్టికఠిన నియమంబులను గవీశ్వరులు తెమ ప్రావీణ్యంబుఁ జూపుటకై తాముగాఁ జేపట్టుదురుగాని యట్టిరచనలు సేయవలయునను నిర్బంధము కవుల కెవ్వఁడును లేదు. అట్లగుటంజేసి యీ యైచ్ఛికనియమంబుల స్వీకరింపక యథేష్టంబుగఁ ద్యజింపవచ్చు. అట్టి నియమంబులఁ జేకొనుట సరసకవిత్వ నిర్మాణమునకుఁ బ్రతిబంధక హేతువనియు, వానిం గైకొనమి లగ్గనియు నా యభిప్రాయము.

అలంకారములు కావ్యములలో నెంతమాత్రము నుంచఁగూడదని యేను జెప్పిన వాఁడనుగాను. ఎక్కడనేని యుపమ, యుత్ప్రేక్ష మొదలగు నలంకారములను సురుచిరంబుగ నుపయోగించుట సరసంబనియే తలంతు.

"గీ. అచ్చరలు నందనంబునఁ దెచ్చుకొనును
రాగసుమములు హర్మ్యవాతాయనముల
చెంతఁగాలూఁది తత్పుర స్త్రీలకొసఁగి
వేఁడికొనిపోవుదురు కప్రవీడియములు."

ఇక్కడ నొకపట్టణమునందలి హర్మ్యము లాకాశోపరిభాగంబున స్వర్లోకంబును స్పృశించుచున్నవని కవి యతిశయోక్తిగా వర్ణించినాఁడు. ఇట్లు వర్ణించుట హృదయంగమంబుగాదు.

శ్లో. సుభగసలిలావగాహాః। పాటలసంసర్గ సురభివనవాతాః।
ప్రచ్ఛాయసులభనిద్రా। దివసాః పరిణామరమణీయాః.

"క. విరియించితామరలలో, నరణాంశులుసొచ్చి సుభగమగు సౌందర్య
స్ఫురణము నొందఁగఁ దోఁచెం, దరణియుదయశిఖరి మీఁదధరణీనాథా."

ఇట్టి స్వభావోక్తు లెంతమనోజ్ఞములుగా నున్నవి !

శబ్దాలంకారములు నట్టివె. "తద్దయుముద్దునేయు" "మందాకినీ నందనుండు" "కోపంబుదీపింప" "మాటలుగీటునంబుచ్చి" "అనవుడు శాంతనవుఁడు" ఇట్లు కొన్నిచోటుల సూక్ష్మములుగా శబ్దాలంకారము లప్రయత్నముగాఁ బ్రయోగింపఁబడునేని యవి వినుటకు సొంపుగానే యుండును.

"ఉ. సంతవసంత మొప్పెఁ జరమాగ్రిమభాగచరాఖిలర్తుసా
మంతమనంతజాలక సమంజసరంజితకుంజమంజరో
ద్వాంతనితాంత సాంద్రమధుదానవిజృంభిత బంభరస్వనా
త్యంతనిరంతరీకృతదిగంత మతాంతలతాంతకుంతమై."

"వెండియు సఖండశశిమండలకుండలిత కుసుమకోదండకాంతానన హిండితకరకుముదకాండ ప్రకాండతాండవిత పాండురపరాగమండలంబున మెండుకొనుచు నిండారవిరసిన బొండుమల్లియల తండంబులంబొదలు.

ఇప్పగిది బహుళముగా శబ్దాలంకారములు ప్రయోగించుట రచనాలాలిత్యంబునకుఁ గొఱంతఁ గావించు.

కావ్యము గద్యాత్మకమైనను, బద్యాత్మకమైనను, లక్షణయుక్తమైయుండవలయునని మున్నె వక్కాణించితి. ఆంధ్రభాషలలోఁ, బద్యకావ్యములు మెండుగాఁ గలవుగాని గద్యప్రబంధము లంతగాలేవు. పూర్వకవీశ్వరులు గద్యకావ్యములు రచియించుట తమపాండిత్యమునకు లోపమనియెంచిరో, వానినాదరించువారు లేమింజేసియో, వానిని వ్రాయరైరి. వారువ్రాసిన పద్యకావ్యములలో నెక్కడనైననొక్కచో నొకగొప్పవచనము వ్రాయుటకలదుగాని యట్టివాక్యము నూఱుబంతులున్నను నెకటేక్లిష్టాన్వయము కలదై గడుసుగా నుండును. పద్యకావ్యములకంటె గద్యకావ్యములు జనులకుఁ జదువుటకు సుకరంబులు గావున వచనప్రబంధములను విశేషముగా వ్రాయఁగడఁగవలయు. ఆంగ్లేయభాషలోనున్న చరిత్రములు, ప్రకృతిశాస్త్రములు, మున్నగు నుపయుక్తవిషయంబులను దెలుఁగుభాషలో వ్రాసిన మనదేశమునకు మేలొనఁగూర్చునని తలంచి యిప్పటి పండితులు వానిని గద్యరూపంబుగ వ్రాసి ప్రకటించుచున్నారు. కేవలము వసంతవర్ణన, పురవర్ణన, మొదలగువానినే మాటిమాటికి గ్రంథములలో వ్రాయుటచే జనులకు జ్ఞానాభివృద్ధి గలుగనోపునే? జ్ఞానదాయకంబులును దేశక్షేమకరంబులునగు విషయములను మనభాషలో గద్యంబుగ వ్రాసినచోఁగవులు లోకహితంబు చేసినవారగుదురు. Novels అని యింగ్లీషునఁ జెప్పఁబడు నీతిబోధక కథాగ్రంథములను సరసమగుశైలిని వ్రాసిననవి జనుల కుబుసుపోక కుపయోగించుటయేకాక యట్టిపొత్తంబులఁ బఠించుటవలన వారిమనంబులఁ గ్రొత్తనీతులు పట్టువడు. ఇప్పటికిఁ గొందఱట్టి వచనగ్రంథములను వ్రాసియున్నారు. ఇంకను నట్టిగ్రంథములు పెక్కులు వ్రాసినచో మనదేశపు జనులకు మేలొదవునని తలంతు. పురాణేతిహాసములలోని కథలను వనితాజనంబులకును సుబోధంబులగునటుల మృదుమధురవచనరచనమెఱయ సులభశైలిని గద్యముగా రచియించుటెంతయుఁ గర్తవ్యము. మనదేశంబున స్త్రీలకు విద్యగఱపుట కరంబావశ్యకంబనియు స్త్రీలు విద్యావతులుగాకున్న దేశంబునకు శుభంబొద

వుట దుష్కరమనియు, నందఱును భావించుచున్నారుగదా. కావున మనవారి మణులు జ్ఞానవతులగుటకై మనభాషలో గద్యరూపంబునఁ బెక్కువిషయములను బండితులు సుగమంబగు లలితశైలిని వ్రాయుటయత్యంతావశ్యకము.

ఇఁకమీఁదట గ్రంథములు వ్రాయువారొక గొప్పవిషయము నాలోచింపవలసి యున్నారు. ఇంగ్లీషుభాషలోనున్న శాస్త్రములను దొల్లి మనదేశములోలేక యిప్పుడు వాడుకలోనున్న నూతనాంశములనుగుఱించి వ్రాయఁబూనినపుడు పెక్కువిషయములకు మనభాషలోఁ బారిభాషిక పదములు లేమింజేసి గ్రంథకర్తలకెంతయుఁ గష్టములు పొసఁగుచున్నవి. Post office, railway station, telegraph, pencil, lantern, case, receipt, stamp, registration, civil, criminal, chimney, fountain pen, train, municipality, మొదలగుశబ్దములును బ్రతిదినమును మనదేశంబున నాబాలగోపాలంబుగ వ్యవహరింపఁబడు చున్నవి. వీనికి మనభాషలోను సంస్కృత భాషలోను సమానమగు పదములులేవు. అట్టిపదంబులను మనభాషలోఁ బ్రయోగింపవలసినపుడెట్లు చేయవలయు? ఆయన్యదేశ్య పదములనే యాంధ్రభాషా ప్రత్యయాదులతోఁజేర్చి తత్సమంబులకై వడిఁ బ్రయోగింపఁజనునా? లేకున్న ననుకరణంబులో వాని నుపయోగింప వచ్చునా? కాదేని వానియర్థముం దెలుపనోపు యౌగికశబ్దములను సంస్కృతభాషలోఁ గ్రొత్తగా సృజియించి వానిం బ్రయోగించు టుచితమా? Post office అనుటకుఁ "బత్రికాప్రేషణాలయము"; Railway Station అనుటకు "అయోమార్గాయతనము" అనియైనను "ధూమానస్సరణీనికేతనము" అనియైనను, Telegraph అనుటకు "విద్యుత్కాంతివాదిని" అని యిమ్మెయినూత్నంబుగ యౌగికపదంబులను గల్పించుట సరసమా? ఈవిషయము నొకరిద్దఱు నిర్ణయింప సాధ్యముకాదు. విపశ్చిద్వరేణ్యులు పెక్కండ్రుకూడి పెక్కుదినంబులు లెస్సగాఁ జర్చించి యాయావిధంబునందలి గుణాగుణంబు లారసి యెవ్విధం బవలంబించుట భాషాభివృద్ధికరమో దానిని నిర్ణయించి యిట్టిపదంబు లుపయోగింపవలయు నియమంబు లేర్పఱుప వలసి యున్నది.

కొన్ని యింగ్లీషుపదములకు మనభాషలలో ననఁగా గీర్వాణభాషయందును, నాంధ్రభాషయందును బర్యాయపదంబులుకలవు. Judge అనుటకుఁ "ప్రాడ్వివాకుఁడు" అనియు, Polce constable అనుటకు "ఆరక్షకభటుఁడు"

అనియు, Magistrate అనుటకు "దండనాథకారి" అనియు Fine అనుటకు "దండుగ" అనియు నిట్లు శబ్దములుగలవు. ఇట్లు మనస్మృతులలోను, న్యాయాది శాస్త్రములలోను శుక్రనీతి మొదలగు గ్రంథములలోను, గన్పట్టుపరిభాషాపద ములను బండితులువెదకి యవసరంబు దొరకొనినపుడు వానిం బ్రయోగింపఁ జను.

కోవిదులారా ? ఈకరణిని మనభాష కభివృద్ధికరంబులగు తెలుంగులారసి నూత్నవస్తుని కరంబులను మనభాషలో వివరింపఁజాలు క్రొత్తపదములు నిర్మింపుఁడు. జ్ఞానోత్పాదకంబులును, దేశక్షేమజనకంబులునునగు నవీనవిషయంబు లనుగూర్చి సులభశైలిని గద్యకావ్యంబులు పెల్లుగాव్రాసి లోకోపకారము సేయుఁడు. పద్యకావ్యంబులు నిర్మించునెడఁ గవిత్రయమువారి చందంబున సులలిత వచోరచన పొలుపారఁ బరిమితాలంకార విలసితంబుగ రసవంతమగు కమనీయ శైలి నవలంబింపుఁడు. గద్యప్రబంధములైనను, బద్యకావ్యములైనను, గీర్వాణ రచనలు విరళంబుగను నాంధ్రపదములు మెండుగాను, దనరార నాంధ్రగ్రంథం బులని పేరందునట్లు గావింపుఁడు. ఏగ్రంథము రచియించినను, వైధంబులగు నియమంబులను మహాకవీశ్వరానుష్ఠిత సంప్రదాయములను నుజ్జగింపకుఁడు. ఏగ్రంథము వ్రాసిననునందుఁ బదలాలిత్యంబుఁ బాటింపుఁడు. రచనాసౌకుమా ర్యం బనుసంధింపుఁడు. అర్థగౌరవంబుఁ బోషింపుఁడు. రసపోషణం బేమఱకుఁడు.

ఏగ్రంథమువ్రాసినను భాషకువన్నియవెట్టు చందంబున నార్యజనసమ్మతం బగు నుత్తమమార్గంబున సలక్షణంబుగ వీనుల విందుగారచనచేసి యాంధ్ర వాణిని సంప్రమోదాయత్త చిత్తఁగావింపుఁడు.

నాగపూడి - కుప్పుసామయ్య.

# ప్రాచీనాంధ్ర వచనకావ్యములు.

"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" నాఁ బరఁగిన మన యాంధ్రభాష యందు నన్నయ భట్టారకుఁడాదిగాఁ గల తొల్లింటి కవులెల్లరును జంపూప్రబంధములను, మిక్కిలి తక్కువగా నిర్వచన పద్యకావ్యములను మాత్రమే రచించి నట్లెలుకపడుచున్నదిగాని శుద్ధవచనకావ్యములను, మఱియు దృశ్యకావ్యములను రచించినట్లు కన్పట్టదు. ఆద్యప్రకృతియగు గీర్వాణభాషయందు, సుబంధుని వాసవదత్తయు, బాణుని కాదంబరీ హర్షచరిత్రములును, దండి దశకుమార చరిత్రమును మొదలుగాఁ గొన్ని ప్రౌఢతమములగు గద్యకావ్యములు గలవు. కాళిదాస భవభూతి ప్రముఖుల రసోత్తరములగు దృశ్యకావ్యములును గలవు. మన యాంధ్రవాఙ్మయము, సంస్కృతవాఙ్మయమును బట్టి పుట్టిపెఱుఁగుటయు, దొలుదొలుతఁ బ్రాయికముగా నాంధ్రకావ్యకర్తలు సంస్కృతగ్రంథములనే యనువదించుచు వచ్చుటయు విస్పష్టమ కదా. పురాణాదులతోపాటు మున్నె కొన్ని గద్యకావ్యములును, దృశ్యకావ్యములును, సంస్కృతమునుండి మన వారిచేఁ దెనుఁగున ననువదింపఁబడెనుగాని యా యనువాదములును జంపూ రూపములే యయ్యెను. వచనకవిత్వ మొకకవిత్వ మనిపించు కొనదని తలఁచి నన్నయ భట్టారకాదులు రచింపమానిరని కొందఱనియెదరు గాని యదిసమంజసమయినట్లు కన్పట్టదు. సంస్కృతమున వాసవదత్తా కాదంబర్యాదులకున్న గౌరవమసామాన్యమైనది గదా! కవిత్వమునకు ఛందఃపరిశ్రమమే ముఖ్యమనుట కెవ్వరంగీకరించెదరు? పద్యకవిత్వముకంటె గద్యకవిత్వమే కవియొక్క సంపూర్ణశక్తి నపేక్షించునని సంస్కృతభాషయందు "గద్యంకవీనాం నికషం వదంతి" యను నానుడికలదు. నన్నయాదులు వచనకావ్యరచన మీ కారణము చేతనే మాని రన్నచో దృశ్యకావ్యములు రచింపమికి వేఱొక కారణము వెదక వలసియుండును. వారు వీనిని రచింపమికిఁ గారణమిదియని నిరూపింపవలను పడదు. పదపడి యిటీవల పదునాఱవశతాబ్దితుదనుండియుఁ గొన్ని వచన కావ్యములును, యక్షగానములును నొకవిధమగు రూపకవికారములును రచింపఁబడుచు వచ్చినవి. యక్షగానము లంతకుఁ బూర్వము నయితముండిన నుండి

యుండునుగాని వచనకావ్యములు లేవనవచ్చును. ఆంధ్రభోజుఁ డనఁబడు కృష్ణదేవరాయల నాఁటనుండియుఁ జోళపాండ్యాది రాజ్యములందుఁ దెలుఁగు రాజభాషగా వ్యవహరింపఁబడుచు వచ్చెను. ఆరాజ్యములను విజయనగరరాజసంబంధులు పరిపాలించుచు వచ్చిరి. పదునాఱవ శతాబ్దినుండి యాంధ్రదేశమున రచింపఁబడిన వానికంటె నక్కడ రచిఁపఁబడిన తెనుఁగుఁ గబ్బములు మెండు. మఱియు నవి రసోత్తరములునయి యున్నవి. విజయవిలాసాది ప్రబంధములయ్యెడనప్పు డుప్పతిల్లినవే. నాఁ డక్కడ రచింపఁబడిన కబ్బము లింకను మనకుఁ గొన్ని చేకుఱలేదు. మన యాంధ్రభాషావధూటి శుద్ధద్రావిడదేశమున సయితముఁ దన నుడికారపుఁ బొంకమున సంపూర్ణాదరము వడసి పోషింపఁ బడినది గదా! తొలుదొలుత నాంధ్రవచన కావ్యరచన దక్షిణదేశముననే యారంభింపఁ బడినది. దక్షిణదేశమందు రచింపఁబడిన యీ వచనకావ్యములఁ గూర్చి ప్రశంసింపఁ బోవునప్పుడు ముందు నన్నయభట్టారకాదులు తమగ్రంథములం దందందుఁ బొందుపఱుచుచు వచ్చిన వచనములఁ గూర్చియుఁ గొంత చర్చించుట యావశ్యకము కాకపోదు. నన్నయభట్టారకుని కవనమునందెడ నెడఁగల్గు గద్యములు మన యచ్చుకూర్పునఁ బదిపదునైదు బంతులకంటె హెచ్చుగాక ముచ్చటలిచ్చుచుండును. తొంటికవుల రచనలలో నన్నయభట్టారకుని గద్యములే పద్యములట్లు ధారాచమత్కృతిగల్గి చదువనింపై యుండును. తిక్కనామాత్యుని గద్యములు మిక్కిలి మెలపుమీఱిన తెలుఁగుఁ బలుకుబళ్లతో నించుక జిలుగులై బిగువుగల్గి రసమొల్కుచుండును. ఈతని కృతులందు గద్యములు నన్నయార్యుని కృతులందువలెఁ గాక, కొండొకమెండై నిడుదలునై పొడకట్టుచున్నవి. ఎఱ్ఱనార్యునికృతులందలిగద్యములొక్కొకయెడఁ బ్రౌఢమగు సంస్కృత రచనమును, గొండొకయెడ నినుపారు తెలుఁగుఁ గూర్పును గల్గి నిబిడములై ప్రాయికముగా వర్ణనాంశము గల్గియుండును. ఈ మువ్వుర గద్యములును ననుప్రాసప్రయాసరహితములై యెల్లవిధముల మేల్మికూర్పు గల్గియున్నవి. కవిత్రయమునకుఁ దర్వాతి వారు రచించిన గ్రంథములందు గద్యములు మిక్కిలి మాఱుపాటును జెందినవి. నాచన సోమనాథుని గద్యములు చదువు వారికి గుండియతల్లడమును గల్గించుచుఁ గొండవీటిచేఁత్రాళ్ల[illegible] బొడుగు[illegible] యనుప్రాస విన్యాసములచే నతికఠినములై దేసి తెనుఁగుఁ బల్కులతో నిండారి యుండును. ఈతని గ్రంథమున వచనము లచ్చునఁబోసి, ముద్రకొట్టఁబడినట్లు నెల

కొని యున్నవి. యుద్ధాదికమును వర్ణించు పట్టులందీతఁడీట్టి వచనములఁ బెట్టు చుండును. కథాంశమును జెప్పునప్పుడీతని కృతియందు గద్యముతో యంతగాఁ గాన్పింపవు. శ్రీనాథుఁడు సంస్కృతప్రాయముగా నుద్ధతశైలిగల యతిప్రౌఢమగు వచనముల రచించెను. ఒక్కొకయెడ నీతని గద్యములు నన్నయార్యుని గద్యములతో సయితము సాటివచ్చుచుండును. తెలుఁగుఁ గూర్పులఁగూడఁ గొండొక కలయఁ గూర్చినను బోతనామాత్యుఁడు వచనములను గమనికులుగను గఠినములుగను నెలకొల్పెను. పెద్దనాదుల కృతులందు వచనములు మిక్కిలి తక్కువ, ఉన్నను వర్ణనాత్మకములై యతిప్రౌఢములై యుండును. పెద్దనాదులకుఁ దర్వాతి కవులు కొందఱు పద్యములందు వలయు గణయతిప్రాసనిర్బంధము లేమిచేఁ దమకుఁ గల్గెడు సౌకర్యమును వీడనాడి యిబ్బడిగా నిర్బంధములను దెచ్చిపెట్టుకొని, తమ గ్రంథములందు బహుక్లిష్టముగను, అనుప్రాస నిరంతరముగను దురవబోధముగను, వచనములఁ గూర్చుచువచ్చిరి. ఇట్టి వచనములను బ్రాయికముగాఁ దద్గ్రంథములఁ బఠించువారు వదలివేయుచుందురు.

నన్నయభట్టారకాదులు పద్యములందింపుగాఁ గూర్పవలనుపడని వంశక్రమాది వృత్తాంతమును దెలుపవలసినపుడును మిక్కిలి విరివిగానున్న కథనల్లంతలో సంగ్రహింపవలసినపుడును బఠించువారికి నిరంతరపద్య సంఘటనమువలనఁ గల్గు విసువునపయింపవలసి నపుడును నెడనెడ సంస్కృతగ్రంథమును మీఱుక హృద్యములగు గద్యములఁ గల్పించిరి. నాచనసోమనాథుఁడుత్తర హరివంశమును దెల్గించెనన్న పేరేగాని యందుండి తనయిచ్చచు వచ్చిన మూఁడు నాల్గుకథలఁగైకొని విచ్చలవిడిగాఁ బెచ్చుపెరుఁగునట్లు గ్రంథమురచించిన వాఁడగుటచేఁ బద్యములందును గద్యములందును గూడఁ దనగడుసరితనమును విశృంఖలముగఁ జూపుకొనఁ గల్గెను. పోతనామాత్యునకు భాగవతమందలి యాధ్యాత్మిక విషయములు కొన్ని పద్యములందుఁగూర్పఁగుదురని నగుటచే గొప్ప గొప్ప గద్యములఁజెప్పక తప్పదయ్యె. ఆధ్యాత్మికవిషయములఁ దెల్పునపుడే కాక మఱికొన్ని యెడలను గూడ నీతఁడు పెక్కువగావర్ణనలఁబెట్టుకొని కఠినములగు గద్యములనుగూర్చెను. తర్వాతఁ బెద్దనాదులుతాము విశృంఖలముగాఁ గల్పింపఁదొరఁకొన్న మనుచరిత్రాది ప్రబంధములందుఁ జంద్రికాదులను వర్ణింపమొదలిడియనల్పములగు కల్పనలఁ గల్పించుకొని యవి పద్యములందిముడ్పఁగుదురకపోఁగా శబ్దాడంబరమందాదరము మెండుకొను కతన నంతంతలేసి ప్రౌఢ గద్యములఁగూర్చిరి. అప్పటినుండియుఁ

ప్రబంధమనుచుఁ గూర్చి మొదలిడి తర్వాత నట్టి గద్యములఁ గూర్చుట కవులకుఁ దప్పనిపనివలెనయ్యెను. మన తెల్గుదేశమున శుద్ధవచనకావ్యములుప్పతిల్లమియకాక చంపూప్రబంధములందలి గద్యములస్థితియు నీవిధముననుండు కాలమున దక్షిణదేశమునందాంధ్ర వచనకావ్యరచన మారంభింపఁబడినది. అప్పుడక్కడ రచింపఁబడిన గద్యకావ్యములందుఁ గేవల కల్పితములు లేవు. అన్నియును బురాణములును దదుపాఖ్యానములునుగనే కన్పట్టుచున్నవి. నన్నయాదులచే రచింపఁబడిన భారతాదిప్రబంధములు ప్రౌఢతమములగు కతనఁ దదర్థగ్రహణము సామాన్యజనసులభముగాక పోవుటయే యక్కడ తొలుత నీ వచనకావ్యరచనోపక్రమమునకుఁ గారణమయినట్టు చూపట్టుచున్నది. తఱచుగా నీ కావ్యములందు వాక్యములు క్లిష్టాన్వయములై యంతును బొంతును లేక యుండవు. వీనియందుగిరి సరిదాదివర్ణనమంతగాఁ గన్పట్టదు. సంస్కృతమూలమునఁ గల ప్రధానకథ ననుసరించి పరిమితములగు వర్ణనలతో నీ వచనరచనకావింపఁ బడినది. ప్రౌఢదీర్ఘ సమాసములును, ననుప్రాసప్రయాసములును వీనియందుఁ గానరావు.

సంహితైకపదేనిత్యా నిత్యాధాతూపసర్గయోః
నిత్యాసమాసే వాక్యేతు సావివక్షామపేక్షతే.

సంస్కృతభాషయందీ కారిక వాక్యమునసయితము సంహిత వివక్షాయుత్తమని తెలుపుచున్నది. కాని యీపద్ధతి తెలుఁగుభాషయందుఁ దొల్లింటి కవులవలంబించినవారు కారు. గద్యముననేకవాక్యమందు సంహితను దప్పకపాటించుటయేకాక, రెండువాక్యములు కలయునప్పుడు సయితము విడువరైరి. ఈకారణముచేఁ బ్రాచీనాంధ్రగ్రంథము లందెక్కడను సంధివిడువఁబడిన గద్యము కాన్పింపదు. ఈదక్షిణదేశపుటాంధ్రవచనకావ్యములందుఁ గొన్నింటనట్లుకాక, యుచ్చారణ సౌలభ్యముకొఱకై క్వాచిత్కముగాఁ బయికారిక ప్రకారము సంహిత యవివక్షితమై సంధివిడనాడఁ బడియున్నది.

కొందఱు లోకవ్యవహారానుగుణముగాను బాలసుగ్రహమగు తెలుఁగున వచనమురచింపవలయునను నభివేశముతోఁ గావలయు శబ్దలక్షణాదికమును సైతమంతగాఁ బాటింపరైరి. ఎంతయేని సలక్షణమును ప్రౌఢమునునగు పద్యకవిత్వమున నాఱితేరిన పుష్పగిరి తిమ్మన్నరచించిన వచనమును గొండొకపట్టుల వ్యాకరణమును నిరాకరించుచున్నది. ఇప్పటికినాకుఁ జేకుఱిన వచనగ్రంథములోఁ దొల్తటిది.

వ చ న భా ర త ము.

ఈగ్రంథమునుగూర్చి తెలిసికొనవలసిన యంశమెక్కువ కలదు గావున మునుమున్నయిందలి యాశ్వాసాంత గద్యముఁ జదువుదము.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద సేవాభినందన పవననందన వరప్రసాదాసాదిత గీర్వాణాంధ్ర కర్ణాటకాది నానాభాషా కావ్యరచనాచతుర, శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వరరాజమార్తాండ ప్రౌఢప్రతాపాప్రతిమ వీరనరపతి బిరుద తెంబరగండ బిరుదాంకిత శంఖచక్రమకరమత్స్య హనూమద్గరుడ గండభేరుండ సింహశరభసాల్వాది నానావిధదేవార్హ ధ్వజాంకిత యాదవవంశ తిలక, అంగవంగకళింగకాశ్మీరలాటాంధ్రద్రవిడద్రావిడాది నానాదేశాధీశ్వర కిరీటకోట సంఘట్టనత్రస్త నిస్తులనవరత్న పరాగపరాగిత నిజభవన ద్వారాసక్తానేక జనపాలఫాలతల ఘటితాంజలిపుంజ రంజితారవిందక (ప) రాయమాణ సభాస్థానస్థ సింహాసనాధిరూఢ నానావిద్వదభీష్ట వర ప్రసాద దేవరాజచిక్కదేవరాజ కరుణాప్రాప్త కర్ణాటరాజ్యలక్ష్మీ నృత్యరంగాయమాణ శ్రీరంగపట్టణ పరిపాలనాధా దృత 'సైన్యాధిపత్య నిర్వాహక' మహారాష్ట్రమదేభ పంచానన, కేళాది వంశాటవీదావదహన, మధురానాథమదవిమర్దన, జయాఘూటశిరఃకందుకక్రీడన, యసమంతరాయ నాసికాకృంతన, నింమోజినమూలోన్మూలన, దాదోజిప్రాణహరణ, దండధరప్రతాప శిలపితలఘంలేరాయఫాలాంకురవిదలన, నానావిధానేకాంతర్బాహ్యాదిశాత్రవమేఘౌఘ ఝంఝానిల, పరరాజగర్వాంధకారవిదళనదినరాజదళవాయి 'దొడ్డరాజతనూజ' యాచకసురభూజ భుజబలాటోప పరాజితారిరాజన్యసమర్పితానేక రత్నరాశియుత ధనకనక వస్తువాహనాది సువస్తువిస్తారిత సంతోషితాఖిల భూసురాశీర్వాదానువర్ధిత పుత్రపౌత్రాది వంశాభివృద్ధి విరాజమాన, 'కళవేకులవంశాంబుధి రాకానిశాకర' ఆశ్వలాయనసూత్ర, పరమపవిత్ర, భారద్వాజగోత్ర, ప్రదీపకా, సేతుసీతాచలమధ్యవర్తికాశీ ప్రభృతిపుణ్యక్షేత్ర నిత్యాన్నదానాద్యనేకధర్మశాస్త్రోక్త దానదీక్షావిచక్షణ, శ్వేతాధీశ్వర కార్యఖడ్గప్రవీణ ఆనవధికా గ్రహారగృహారామక్షేత్రాది సంతోషితాఖిల కవిరాజ, 'శ్రీవీరరాజ ప్రణీతంబైన' మహాభారత వచనకావ్యమునందు ప్రథమాశ్వాసము.

ఈ చదువఁబడిన గద్యమువలన నీగ్రంథమును రచించిన యాతఁడు మైసూరు ప్రభువగు చిక్కదేవరాయలయొద్ద దళవాయి యయిన దొడ్డరాజు కుమారుఁడగు వీరరాజని తెలియుచున్నది. మైసూరుప్రభువులలోఁ జిక్కదేవరాయలు

మిక్కిలి ప్రఖ్యాతుఁడు. ఈతనిఁగూర్చి సంస్కృతాంధ్రకర్ణాటభాషలలోఁ గొన్ని గ్రంథములు రచింపఁబడెను. తెలుఁగునఁ జిక్కదేవరాయ విలాసమును నింక ననేకచాటు పద్యములును గలవు. ఈతఁడు 1650 తర్వాత 1700 లోఁగా రాజ్యమేలెను. ఇంచు మించుగా మనగ్రంథకర్తయు నాకాలముననే యుండును. ఈకవి తాను, ఆశ్వలాయన సూత్రమును భారద్వాజగోత్రమును గల క్షత్రియుఁడయినట్లు చెప్పుకొనెను. ఈతని దాతృత్వాదికమును, ఈతని జనకునిప్రతాపాదికమును గద్యమువలనఁ దెలిసికొననగును. ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున నప్పకవీయమునకు రూపాంతరమై వీరభూపాలీయమను నొక లక్షణగ్రంథముగలదు. కూర్చినగ్రంథకర్త పేరందుఁ దెలియుటలేదుగాని, యది యీ వీరరాజు నుద్దేశించి చెప్పఁబడినదే. ఈభారతసంగ్రహమును ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారముననే కలదుగాని యసమగ్రమై యాది పర్వముమాత్రమే చూపట్టుచున్నది. ఇయ్యది శ్రీకృష్ణాంకితముగాఁ దేనియ తేటవ్రాలె స్వారస్యముగల తెలుఁగు వచనమునరచింపఁబడినది. నన్నయాదుల భారతమున కిది దండాన్వయముగాదు. సంస్కృతభారతపు మక్కికి మక్కికాదు. కథాంశమును జక్కగాఁ దేటపఱుచు స్వతంత్రరచనము. ఈకవి తనగ్రంథముద్ధత శైలినుండవలయునని యపేక్షింపక సర్వసామాన్యముగా నర్థమగునట్లుండవలయునని తలంచితలంచినట్లే నిర్వర్తించెను. ఈగ్రంథమున నెక్కడనుబిగువుదక్కినీరసముగానుండు కూర్పుకాన్పింపదు. కొంత వచనభాగమును మచ్చు చూపుచున్నాఁడను.

"కుమారకా! యేను జాత్యంధుండనయినను బాండు భూపాలుండు నన్ను మిగులంబూజించె. అది యెట్లంటేని, లోచనంబులు లేమింజేసి పరదళంబుల మొగ్గరంబులుపన్ని యగ్గలికమెఱయ గెలువంజాల; స్వరాష్ట్రపరిపాలనంబున కసమర్థుండ. సాంగంబులుగ వేదంబులను రాజశాస్త్రింబులు నధికరించితి. ఎంత యధికరించిన నేమిప్రయోజనంబు. క్షత్రియుఁడగు వాఁడు ధర్మమార్గంబుదప్పక సమరంబుగావించి హతుండయ్యేనేని స్వర్గంబునకరుగు. జయించినఁగీర్తియును భూమియుంబడయుఁగావున నాయుధోపజీవులకాయోధనం బవశ్యకర్తవ్యంబు. అట్లు గెలిచి పుత్త్రులయెడ నైశ్వర్యంబునిలిపి వనవాసంబున కరుగవలయు, నిట్టి కర్మంబున కేనసమర్థుండనయినను బాండునృపాలుండు నన్ను రాజ్యంబుననిలిపి తాను దిగ్విజయంబు సేసి సకలధనంబులు నాయధీనంబులుగావించె. అతండు నన్ను రాజ్యంబున నిలుపుటకు ధర్మంబు కారణంబగుంగాని వేఱొండునిమిత్తంబు లేదు.

క్షత్రియులకుఁబుత్త్రులెందఱున్నను, దేజోధికుండ జ్యేష్ఠుండగుంగాని వయోధికుండు జ్యేష్ఠుండుకానేరండు. అట్లు గావునఁ దేజోధికుండగు పాండునృపాలుండు వయః క్రమంబునఁ గనిష్ఠుండయ్యు జ్యేష్ఠుండనంబడు, నతని కుమారులు వేదశాస్త్రంబులుచదివి సకలార్థంబులుఁ దెలిసి గుణంబులంబ్రసిద్ధులగుచు నస్త్రాభ్యాసంబుసేసి లోకద్వయంబునం బూజ్యులగుచు జనులు తమయెడ ననురాగంబు సేయ మెలంగుచున్న వారు. ధర్మపౌరుషప్రభావంబుల వారలధికులైయున్న యెడ వారలనెట్లు నగరంబువెలువరింపించి వారణావతంబునకుంబనుపువాఁడ, నట్లు పనిచినను లోకంబునంగల జనులు నిందింపకుందురె?

ఆదిపర్వము-నూటనుప్పదితొమ్మిదవ యధ్యాయము.

ఈవచనము సంస్కృతభారతమునఁ గల్గువిషయములన్నియును గల్గి యాంధ్రభారతముకంటె మిక్కిలి విపులముగానున్నది. ఈ చదువఁబడిన భాగము నన్నయార్యునిరచనమున నత్యల్పముగునట్లు సంకుచింపఁబడినది విస్తరభీతిచే దానినిగూడ నిందుదాహరింపమానితిని. సంస్కృతభారతప్రకార మధ్యాయవిభాగముతో నీ యాదిపర్వము మూఁడాశ్వాసములుగా విభజింపఁబడినది. ఆశ్వాసాద్యంతములందుఁ బద్యములు కలవు.

ఈ గ్రంథమునందుఁ గొంతప్రాచీన ప్రయోగసరణి కన్పట్టుచున్నది. (1), అమ్మహాసంగ్రామంబునకుం గూడిన పదునెనిమిది యక్షౌహిణుల రాజులును గాలవశంబునం జనిరందులకు సుయోధనుండు హేతువై నిల్చుటంజేసి యజ్ఞానంబునం దనకేమియుఁ దోఁచదయ్యె. నెంతతెలిసెద నన్నందెలివి నెందఁజాలక యున్నవాఁడ. (2) నూతనందనా! యింతకార్యంబు నడచినపిమ్మటఁ దాను బ్రదికి యుండుటకు ఫలంబులేశంబును గాన, (ధృతరాష్ట్రునిపల్కులు) (3) ఓ డుండుభంబ! తొల్లియొక దుష్టభుజంగంబు తనకుఁ బ్రాణపదంబయిన ప్రమద్వరకుఁ గీడాచరించె. (రురునిపల్కు).

ఇట్టి వాక్యములందు నేను శబ్దము ప్రయోగింపఁబడు పట్టులందుఁ దాను శబ్దము ప్రయోగింపఁబడినది. పూర్వకవుల రచనలందిట్టి ప్రయోగములు కలవు. (1) ఈ ప్రబంధముం దనకిపుడంకితంబుఁ బ్రమదంబునఁ జేయుము

(ప్రౌఢకవిమల్లన).

(2) అత్యుగ్రబాణశక్తిఁ దన్నుఁబంపుడేవ, నన్నిచోడదేవుఁడు.

(మన్మథునిపల్కు).

మఱియు. ఇట్లు కొంతప్రాచీన ప్రయోగసరణికలదు.

(1) శంతను నరపాలుం డేకాంతంబుననే కాంతం గనుఁగొని మరులు కొనియె, యథార్థంబున పలుకరింపుమన సూతుండిటులను. (2) నేనిక్క నిన్నియకు జనకుండ నగుటంజేసి పలుకరించెద నాకర్ణింపుము —— ఇట్లు పెక్కువాక్యములందు "పలుకుధాతువు ప్రయోగింపఁ బడునెడఁ బలుకరించు ధాతువు ప్రయోగింపఁబడినది. ప్రాచీన గ్రంథములం దిట్టి ప్రయోగములు కలవో యని సందియమగుచున్నది. ప్రయోగ వైచిత్ర్యము లిట్టివి కొన్నిగలవు.

మఱియు నిందుఁ దత్సమక్రియలకు శత్రర్థమున నింపుగా గమము తఱుచుగాఁ గావింపఁబడినది. దక్షిణదేశపుఁ బ్రబంధములందెల్ల నిట్టిప్రయోగములు కుప్పతెప్పలుగాఁ గలవు. ఆంధ్రదేశమందు రచింపఁబడిన వసుచరిత్రాది ప్రబంధము లందును గలవు. పెద్దనామాత్యుఁడుకూడ "ఇంపుమీఱఁగ ధాత్రి పాలింపుచుండ" అని ప్రయోగించెను. ఇది ప్రాచీనకవి సమ్మతముకాదు.

అమహదర్థకమగు తచ్ఛబ్దమునకు "వాటిని" మొదలగు రూపములు గూడ వాడఁబడినవి. అయ్యవియసాధువులు. ఇంకనెందేనిఁ జిన్నచిన్ని దోషము లిట్టివి మఱికొన్నియు నుండిన నుండఁబోలు బహుస్థలములందుఁ జూపట్టుచుండుటచేఁ బై ప్రయోగములు గ్రంథకర్తృకృతములేయని చెప్పవలసియున్నది. ప్రాయికముగాఁ దాళపత్త్రసంపుటములు లేఖకదోషభూయిష్ఠములై యుండును. అట్టిదోషములనుగూడఁ దద్గ్రంథకర్తలకుఁదగిలింపరాదు.

ఈవచనభారతము నీవీరరాజును మఱికొందఱునుగలసి పూరించినట్లున్నది. తంజాపురపుసరస్వతీభాండాగారమున వచనాత్మకములగు శాంత్యానుశాసనిక పర్వములు క్రమముగా నారాయణ తుపాకులయనంతభూపాలకకర్తృకములయినవి కలవు. ఇక్కడి యీయాదిపర్వమునందుఁగూడ వీరరాజునాశ్వాసాంతగద్యమునం దొక్కచో నడుమఁ దుపాకులయనంత భూపాలకు గద్యమును వ్రాయఁబడి యున్నది. ఈతుపాకులయనంత భూపాలకుఁడు మధుర రాజులయొద్ద దళవాయియని తెలియున్నది. ~~ఈతఁడును వీరరాజుసమకాలపువాఁడే~~ ఈతఁడును వీరరాజు సమకాలపువాఁడే కాఁదగును. అనంతభూపాలకకర్తృకములయిన వచనకావ్యములు మఱికొన్ని గలవు. అందు విష్ణుపురాణము, భగవద్గీత, యనుగ్రంథములు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునం దున్నవి. విష్ణుపురాణమాఱాశ్వాసముల గ్రంథముగా రచింపఁబడినది. వెన్నెలకంటి సూరనార్యుని విష్ణుపురాణముకంటె నియ్యది కడువిపులమై సంస్కృతమూలము

ననుసరించుచున్నది. ఈకృతియును శ్రీకృష్ణునకే సమర్పింపఁబడెను. ఈ విష్ణుపురాణవచనము ధారాళమగు రచనగల్గి యుంచుక ప్రౌఢమై మిక్కిలి చక్కఁగ నున్నది. వచన భారతమందువలెఁ గాక యిందు సంస్కృత సమాసములు కొంచెమెక్కుడుగాఁ జూపట్టుచున్నవి.

ఇంచుక మచ్చు చూపుచున్నాఁడను.

"అంత శ్రీకృష్ణుండు విమలతర చంద్రికాసాంద్రంబును, హృదయానంద కరంబునై, వికసితనీలోత్పలకుముదసౌరభంబులచే దిగంతంబులఁ బరిమళింపఁ జేయునట్టి శరత్కాలంబున, నుత్ఫుల్లకుసుమవాసనాసక్తంబులై ఝుంకారం బొనర్చునట్టితుమ్మెదలమొత్తంబుచే నలంకృతంబును, విహారయోగ్యంబును నగు బృందావనంబుం గనుంగొని, యచ్చట గోపవనితానికరంబులతోడఁ గూడి రమియించి వారల మనోరథంబులు నెఱవేర్పఁదలంచి, యొక్కనాఁటి రాత్రి యందుఁ దానొక్కరుండ, నవరత్నఖచిత దివ్యాభరణభూషితుండును, దివ్యచందన చర్చితగాత్రుండును, మనోజ్ఞకుసుమ మాలికాధరుండునునై వనంబునకుం జని, జగన్మోహనంబును, నవ్యక్తమధురంబును, అమృతోపమానంబును, మాత్రా లయ సమన్వితంబును నగు వేణుగానం బొనర్చుటయు, సర్వభూత మనోహరం బయిన యమ్మురళీనాదం బాలకించి గోపాంగనలు మదనబాణవిదళిత హృదయలై యవ్వాసుదేవనందను సమీపంబున కరుదెంచిరి. అందొక్క సుందరి నిజ గృహంబునందయుండి శ్రీకృష్ణుని వేణునాదంబున కనురూపంబును, నవ్యక్త మధురంబునుగా మెల్ల మెల్లన గానంబు గావించె."

(అయిదవ యాశ్వాసము పదుమూఁడవ యధ్యాయము.)

ఈతని గద్యమిట్లున్నది.

"ఇది శ్రీనందనందనచరణారవిందమత్తమధుకరాయమాణచిత్తచతుర్విధ కవితా సామ్రాజ్యభోజ చంద్రగిరికృష్ణభూపాలకతనూజ భాగమాంబాగర్భ శుక్తిముక్తాఫల తుపాకులయనంతభూపాలకప్రణీతంబైన విష్ణుపురాణంబునందుఁ బ్రథమాశ్వాసము

వచనభారత కర్తయయిన వీరరాజు కుమారుఁడగు నంజరాజుచే సయితము పెక్కులు వచనకావ్యములు రచింపఁబడెను. నంజరాజు మైసూరు రాజానొద్దమంత్రియై మిక్కిలి యెన్నికకెక్కినవాఁడు. ఈతని నుద్దేశించి సంస్కృతమున నభినవకాళిదాస బిరుదాంకుఁడగు నృసింహకవిచే నంజరాజ యశోభూష

ణమను పేరఁ బ్రతాపరుద్రీయమునకుఁ బ్రతిబింబముగా నొక యలంకార శాస్త్ర గ్రంథము రచియింపఁబడెను. తద్గ్రంథకర్త గ్రంథావసానమున నిట్లు చెప్పుకొన్నాఁడు.

శ్లో॥ఆలూరితిర్మలకవే రభినవభవభూతి నామబిరుదస్య
సుహృదా నృసింహకవినాకృతి రకృతనవీనకాళిదాసేన

ఈయభినవకాళిదాసు డైనందినప్రబంధనిర్మాణసాహసికుఁడఁట ! నంజరాజయశోభూషణము ప్రౌఢరచనగలగ్రంథము. నంజరాజుచే రచింపఁబడిన వచనకావ్యములందు హాలాస్యమాహాత్మ్యము, విష్ణుభక్తవిలాసము, హరభక్తవిలాసము, కాశీమహిమార్థదర్పణము, ననునవి నాకుఁ జేకుఱినవి. హాలాస్యమాహాత్మ్యమున నీనంజరాజు తనతండ్రిని

ఉ॥ ఆదళవాయిదొడ్డవసుధాధిపమౌళికిఁ గల్గె సజ్జనా
హ్లాదకరుండు షోడశమహాద్భుతదానధురంధరుండు తే
జోదిననాథుఁ డంచితయశోధవళీకృతసర్వదిక్తటుం
డాదినృపాలసన్నిభుఁడు దారుఁడు వీర నరేంద్రుఁడున్నతిన్.

అనివర్ణించెను. ఈతనికబ్బములలో హాలాస్యమాహాత్మ్యము స్కాందపురాణమందలి దక్షిణ మధురాపురీ మహిమమును దెలుపు హాలాస్యఖండమునకు సరిగాఁ దెలుఁగున రచియింపఁబడిన డెబ్బదిరెండధ్యాయముల వచనకావ్యము. నంజరాజ కవి వచనరచన మించుక ప్రౌఢమై మిక్కిలి చక్కఁగనే యున్నను వచనభారత శైలికిఁ గొండొక వెన్బడుచున్నది. అందందు వ్యాకరణాపాకరణము లేక పోలేదు. ఈకవిని గూర్చి శ్రీవీరేశలింగముపంతులుగారు కొంత వ్రాసియున్నారు. గ్రంథవిస్తరభీతిచేఁ దక్కిన గ్రంథముల వదలి హాలాస్యమహాత్మ్యము నుండియే మచ్చునకించుక వచన భాగమును జదివెదను.

"ఆ సిద్ధుండు భయ భక్తియుక్తుండగు రాజుం గనుంగొని వాంఛితార్థమ్ము వేఁడుకొమ్మనుచుఁ బలుక నమ్మహీపాలుం డతనికిం బ్రణమిల్లి యంజలిగావించి సద్గుణవంతుఁడగు పుత్రుంగరుణింపుమని యభ్యర్థింప సిద్ధవేషధరుండును సచ్చిదానంద స్వరూపుండును భగవంతుండు నగు హాలాస్యనాథుండు 'ఓయి పాండ్యభూపాలకా! నీకత్యాగ్రైశ్వర సమేతుండగు పుత్రుండును గీర్తియు దీర్ఘాయుష్యంబును గడపలశాశ్వతంబగు ముక్తియుంగలుగుం గాక యని వచియించి గజముఖంబు వలన నేకావళియుందీసి యిచ్చి యాశీర్వాదంబులచేత నతనిం బ్రమోదం

బు నొందించి కరమ్ములం దదీయ శరీరమ్మునివిరి ముహూర్తమాత్రమునం దదృశ్యుండగుటయు భూపాలుండా సిద్ధుని విచిత్రంబవలోకించి యిది సుందరేశ్వరు వినోదంబని మనంబునందలంచినవాఁడై లింగమూర్తిధరుండగు సమ్మహాదేవ సాన్నిధ్యంబున కరిగి భక్తిచేత నమస్కరించి యిట్లని వినుతించె"

(ఇరువది యేకవయధ్యాయము.)

ఈనంజరాజు కర్ణాటభాషయందు భారతేతిహాసమును వచనకావ్యముగా రచించెను. అదియును ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునఁ గలదు.

ఈకాలముననే మధురాపురీనాథుఁడయిన విజయరంగచొక్క భూపాలకు నాదరమునఁ బెక్కులు వచనకావ్యములును బద్యకావ్యములును రచింపఁబడినవి.

రాజరాజనరేంద్ర, కృష్ణరాయ, రఘునాథరాయాదులవలె నీప్రభురత్నమును నాంధ్రకవీశ్వరుల కాలంబనమై 1704 మొదలు 1731 వఱకు రాజ్యమేలెను. శేషము వేంకటపతి మొదలగు వారీతని యాస్థానకవులుగా నుండిరి. అహల్యా సంక్రందని విలాసమును రచించిన సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁ డీతని కొల్వుననున్నవాఁడు. అహల్యాసంక్రందన విలాసమున

గీ॥ సముఖమీనాక్షి నృపగర్భ విమలజలధి
చంద్ర! వేంకట కృష్ణేంద్ర! శౌర్యసాంద్ర
మునుపుజైమిని భారత మనఘవచన
కావ్యమొనరించినట్టి సత్కవివి కావె

అని తారాశశాంకవిజయ మొనర్చిన శేషము వేంకటపతి మెచ్చినట్లు వేంకటకృష్ణప్పనాయకుఁడు చెప్పుకొన్న జైమిని భారతవచన మిప్పు డీయాంధ్ర సాహిత్య పరిషత్తు వారిచే దక్షిణదేశమునుండి సంపాదింపఁ బడిన తాళపత్త్రి గ్రంథములందుఁ గలదు. ఈతనిచే రాధికాసాంత్వనమను నేకాశ్వాసక్షుద్ర ప్రబంధము రచింపఁబడినది. కొంతకాలముక్రింద నాతాళపత్రగ్రంథమును విక్రయించుటకై యొకరు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునకుఁ గొని వచ్చిరి. దానిని నేను చూచితిని. ముద్దుపళనిరాధికాసాంత్వన మందిందలి పద్యములన్నియుఁ గలవు. మఱికొన్ని పద్యములెక్కువగాఁ జేర్పఁబడి నాల్గాశ్వాసములుగా ముద్దుపళని గ్రంథమువిభక్తమై కన్పట్టుచున్నది.

విజయరంగ చొక్కభూపాలకు నాస్థానముననే కవీశ్వరుఁడుగానున్న వెలగపూఁడి కృష్ణకవిచే వేదాంతసార సంగ్రహమను వచనకావ్యమొకటి రచిం

పఁబడెను. అది నాకుఁ జేరుటలేదు. ఈవిజయరంగ చొక్కభూపాలకుఁడు సయి తము శ్రీరంగమాహాత్మ్యమను వచన కావ్యమును రచించెను. ఈవచనమంతగా నిర్దుష్టమనవలనుపడదు.

సులువుగానర్థమగునట్లు వ్యావహారిక శైలిని రచింపఁబడినది. ఇంచుక యుదాహరించెదను.

"అంతనవియన్నియు దేవేంద్రుఁడు వినికోపముచేసికొని ఐరావతము నెక్కి వజ్రాయుధమునుదూసికొని దేవతల నెల్లసహాయముగా గూర్చుకొని ఆరాజుండు తపస్థలంబునకుం జనె. అప్పుడు ఇక్ష్వాకుమహారాజు పూజాద్రవ్యముల నెత్తుకొని దేవేంద్రునికి నెదురుగాపూజచేసెను అప్పుడా పూజ దేవేంద్రుఁడు ఏకకాలంబుగా కొండలు కొట్టే వజ్రాయుధమును చేతతీసికొనికొట్టెను. ఆదెబ్బశబ్దమునకు రాజైనతాను ఇనుమంతైన మనస్సు చలించక శ్రీమన్నారాయణమూర్తి యందుండెడు చక్రమును ధ్యానముచేసెను."

ఈగ్రంథము లేఖక దోషములతో నిండియున్నది. ఇంచుకసంస్కరించి యీభాగమును మచ్చు చూపితిని.

ఈవిజయరంగ చొక్కభూపాలుకాలమున నింక ననేక వచనకావ్యములు రచింపఁ బడినవి. మిత్రవిందా పరిణయమును రచించిన కుంమ్మర్తి వేంకటాచల కవియు నీతని యాస్థానమందున్నవాఁడే. ఈతఁడు

సీ. "చదివి నావేమేమి చదువయోగ్యంబులో
యవియెల్ల నిస్సంశయంబుగాఁగ,
వచనకావ్యములుగా రచియించినావు భా
రతభాగవతములు రామకథయు."

అని విజయరంగ చొక్కభూపాలుఁడు తన్ను మెచ్చినట్లుచెప్పుకొనెను. ఈ తనిభారత, భాగవత, రామాయణ వచనములు మనకు లభింపవలసి యున్నవి.

పదపడి సమీరకుమారవిజయమను ప్రౌఢప్రబంధమొనర్చిన పుష్పగిరి తిమ్మనార్యుఁడు భాగవతసారమనువచనకావ్య మొనర్చెను. ఉత్తరరామాయణము నొనర్చిన కంకంటి పాపరాజకవి కీతఁడు మిత్రము. ఈతని భాగవత సారము సంస్కృతాంధ్ర భాగవతములకు మిక్కిలి సంగ్రహముగా నున్నది. ఇందలి వచనశైలి మిక్కిలి తేలికగాఁ దేటగా నింపుగూర్చుచున్నది. రచనా ప్రౌఢిమ నీగ్రంథమందుఁ దిమ్మకవి చూపలేదు. వ్యాకరణమును మీఱిన ప్రయోగములందందిందుఁ గన్పట్టుచున్నవి. ఇంచుకమచ్చు చూపుచున్నాఁడను.

భా గ వ త సా ర ము.

షష్ఠస్కంధము.

"ఆలోయమకింకరులు అఘోరయమ పాశమున నలసిని గట్టిగాఁగట్టి, కొంపోవ నుద్యోగించఁగా, నంతలో, ఆజాను చతుర్బాహులు, నీలమేఘశ్యాములు, సుగుణాభిరాములు, అమితదయాళువు, విష్ణుదూతలువచ్చి, ఆపాశము త్రెంచి పాఱవైచి, యమదూతలఁ బాఱఁదోలి, యాతనా శరీరధారియైన ఆ యజామిళుని వెఱవకుమని, అభయమిచ్చి, యాదరించి పలికిరి. యమభటులును దిట్టలుగనుక, వెఱకకుఁబోయి మఱలివచ్చి, ఆ మకరకుండల, కిరీట, హార, కేయూర, వైజయంతీ, వనమాలికా భరణులైన విష్ణుదాసులఁ జేరవచ్చి 'అయ్యా మీరెవ్వరివారలు? మమ్మెఱుంగరా పాపకర్మునిఁబట్టి మేము కొంచుకు పోవఁగా అడ్డగించ మీకుఁ బనియేమి యున్నది. యముని శాసనము మీకు నవ్వులాయెనా?" అనఁగా శ్రీమన్నారాయణుని కింకరులు పలికిరి. "ఓయి యమభటులారా! మీరు ధర్మరాజు దూతలుగనుక గుణవంతులు. మీ పలుకులయందు కఠినత్వములేదు. ఈ బ్రాహ్మణుఁడు దురాచారియగును. ఇతఁడు దండింపతగియుండియు దండనకు తగనివాఁడైనాఁడు. దండార్హుఁ డెవ్వఁడు? దండింప తగనివాడెవ్వఁడు? ఆత్మకు కర్మానుభవము ఎటువలె కలుగును? వినిపింపుఁడనిన కేలుముకుచున్న యమదూతలు పలికిరి. వినరయ్యా మహాత్ములారా! శ్రీభగవంతునియొక్క వాక్యములు వేదములు. అందు చెప్పఁబడ్డది ధర్మమనఁబడును. వేదమార్గము తప్పిననే అధర్మమగును. ధర్మమున సుఖమును అధర్మమున దుఃఖమును ప్రాణులు పొందుదురు. ప్రాణిచేసిన పాపపుణ్యములకు సాక్షులు సేనాయున్నారు. కర్మమే వేళజీవుఁడు సేయునో ఆకాలమే కర్మమునకు సాక్షియై యుండును. కాఁబట్టి తప్పించుక పోఁగూడదు."

ఈకవియే రచించిన సమీరకుమారవిజయ మందున్న వచనమును గూడ నించుక చదివినచో నాతనికి భాగవసారమెంత తేలికగా నర్థమగునట్లు రచింపపలయునను నభినివేశముకలదో తేటపడఁగలదు.

సమీర కుమారవిజయ మందలి వచనము.

వ. ఇప్పగిది నప్పరమ పావనుండప్పు డుప్పరంబునఁ గప్పు జిగిగప్పిన నాయొప్పిందబు విప్పగుమెప్పు నందప్పకచూచి ముప్పిరిగొను భక్త్యనురాగ సంభ్రమంబుల మత్ప్రరాయణుండగుటఁజేసి యచ్చోటు వాసి మదీయసన్నిధిఁ బెన్నిధిఁ

గూర్చి చెప్పఁ బని యుండదు. చిన్నయ్యసూరిగారి కాలమున నీచెన్నపురముననే కోలా శేషాచలకవియను నాతఁడు గోడే వేంకటజగ్గారాయల వారికిఁ గృతిగా నీలగిరి యాత్రాచరిత్రమను నొక హృద్యమగు గద్య ప్రబంధమును గల్పించెను. ఈకవి రచన చిన్నయసూరిగారి త్రోవను వెన్నాడుచు మిక్కిలి చక్కగా నున్నది. అతిశయోక్త్యాది కావ్యాలంకారంబులం దొఱంగి కలరూపెఱింగించు వేడ్క నిఖిలజన సుబోధంబగునట్లుగా రచించిన ట్లాతఁడు చెప్పికొనియెను.

ఇంచుక చదివెదను.

"నావిడిదలయగు నిలుసొచ్చిన యనంతరంబ యెచ్చటఁ గూర్చుండిన నెచ్చటఁ గ్రుమ్మరిన నెద్దియంటిన నాసర్వంబతిశీతలంబయి గోచరించె, నంతఁ గొంత తడవునకె చలి మొలతెంచె. మార్గశ్రమంబు నన్విడిదల ప్రవేశించు సమ కాలంబునన శీతంబు గోచరింపదయ్యెనని తోఁచెను. మఱునాఁడె నాకును నా బాసటయయివచ్చిన శ్రీనివాస మొదలాఁకిని స్వదేశంబునుండి కొంపోయిన చలి తోడుగు లొడళ్లం దొడిగికొనవలసె వచ్చె. అచ్చట నగ్నిసెుకండు దక్క నెల్ల పదార్థంబులు నతిశీతలంబులయి యున్న యవి. కొన్ని పదార్థంబులు మంచు గడ్డలంబోలి శీతంబుచే దుస్స్పర్శంబులయి యున్న యవి. టెంకాయ నూనియ నేతితెఱంగునం బేరుచున్నది. వార్చినతోడన పులియఁయందు వడ్డించిన యన్నంబు కొంత ఘృతవ్యంజనాదులతోడ మొదల భుజించి యెడఁగలుగఁ ద్రోచియుంచిన యవశిష్టాన్నంబు భుజియింపఁ బోయిన నొకానొకప్పుడు పర్యుషితకల్పంబయి కానంబడియెడు. మఱియు నచ్చటిచలిరేవగళ్లు హూహూకారంబుఁ బుట్టించు చున్నయది."

స్కాందపురాణాంతర్గతమగు శివరహస్యఖండము ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యకవిచే వచనకావ్యము గారచింపఁబడెను. ఈరచనమించుమించుగాఁ జిన్నయ్యసూరి గారి కాలముననే యాంధ్రదేశమున రచింపఁబడియుండును. కవి విషయమంతగాఁ దెలిసినదిగాదు. ఈరచన మనుప్రాసక్లేశముగల్గి తత్సమపద బహుళమై యించుక క్లిష్టముగనే యున్నను నిర్దుష్టమైనట్లు కన్పట్టుచున్నది. ముద్రితమై విక్రయింపఁబడుచున్న యీ గ్రంథమునుండి యుదాహరణముగై కొనలేదు.

చిన్నయ్యసూరిగారి తర్వాత ప్రసిడెన్సీ కాలేజియం దాంధ్రోపాధ్యాయులుగా నున్న చెదలువాడ సీతారామశాస్త్రిగారు కొన్ని సంస్కృత నాట

కాదులను కథలుగా వచనమున రచించిరి. తేలికపలుకులతోఁ జక్కఁగా నర్థము గుచు నీవచనరచన యింపుగూర్చుచున్నది. చిన్నయసూరిగారికిఁ దర్వాతి వచనగ్రంథకర్తలందు సంహితను బాటింపక సంధి విడఁగొట్టి వాక్యములఁ గూర్చిన వారిలో వీరు తొలుతటివారని చెప్పఁ జెల్లును. వీరి గ్రంథములును ముద్రితములై యున్నవిగావున రచన నుదాహరింపలేదు.

పదపడినాఁడునాఁటికి నాంధ్రవచనరచన క్రొత్తక్రొత్తయై పలువెలుఁగుల వెలయుచున్నది గదా! అప్పటినుండియు నుప్పతిల్లుచున్న వచనగ్రంథములఁ గూర్చియుఁ దద్రచనములఁ గూర్చియుఁ జర్చింపవలసిన విషయమెక్కువ కలదు గావున దానికిఁ గాలాంతరము నపేక్షించి యిందిపుడుపేక్షించితిని. ముఖ్యముగాఁ బ్రాచీన వచనకావ్యముల యునికిని గూర్చి తెలిపికొనఁ దలపెట్టి వ్రాసిన యీ వ్యాసమున నాయజ్ఞానము వలనఁ బెక్కుచోట్ల వస్తువిపర్యయము వాటిల్లియుండును. సహృదయులగువారు దోషములుండిన సంస్కారములఁ దెలిపి నా వ్రాసిన యీవ్యాసమును నిర్దుష్టపఱుచుదురు గావుత మని వేఁడికొనుచు నింతట ముగించుచున్నాఁడను.

వేటూరి. ప్రభాకరశాస్త్రి.



# కవిగీతము.



కవితకవిమూలమునఁ గవి•కవితవలన
ఘనతర స్థితినందుట•గలుగుచుండుఁ
గవితఁబోలిన మధురవ•స్తువులు లేవు
కవులఁబోలిన ధన్యమా•నవులు లేరు
విమలనవనీత మృదులశ•బ్దములఁ గూర్చి
రమ్యభావ ప్రబోధకా•ర్థములఁ గూర్చి
పరిమళామోద మధురభా•వములఁ గూర్చి
తతమనోహరలసదలం•కృతులఁ గూర్చి
యనుపమావ్యక్తను మధుర•ధ్వనులు సెలఁగ
సలలితశిరీషసుకుమార•శయ్యలలర
నూతనమనోజ్ఞ చాతురీ•రీతు లెసఁగఁ
బటుతరాద్భుత వివిధక•ల్పనలు వెలయఁ
దఱచుదొలుకరి మెఱుపులు•మెఱసినట్లు
మెఱసిక్రొవ్వారి సోనలు•గురిసినట్లు
కురిసి సౌరభమెల్లెడ•దొరసినట్లు
దొరసిపండు వెన్నెలవెల్లి•విరిసినట్లు
మహితమై మానితంబైన•మనసుతోడ
భవ్యమై పావనంబైన•పల్కుతోడ
విమలమై విస్ఫుటంబైన•వృత్తితోడ
దివ్యమై ధీయుతంబైన•దృష్టితోడఁ
బదములు నిరర్థకంబులై•గదురకుండఁ
బాదలు రసభావములు చెక్కు•చెదరకుండ
సుస్వభావ మాధుర్యంబు•సుడియకుండఁ
గావ్యదోషంబు లెంచను•గవియకుండ

భావముఁ గరంచు దృశ్యకా♦వ్యములనైనఁ
జవులఁ బుట్టించు శ్రవ్యకో♦శములనైనఁ
దానవర్ణాళిఁ బోలుప♦ద్యములనైనఁ
దారహారాళిఁ బోలుగ♦ద్యములనైన
మహితగతి వ్రాయుమా! వ్రాయు♦మా! కవీంద్ర!
ప్రకృతినీ తోడునీడయై♦పలుకుచుండె
స్వస్థచిత్తతగల దంతే♦చాలు నీకుఁ
గావ్యనిర్మాణమునఁ బర♦కరము లరసి
చూచుకొన నేల? కవితనీ♦సొమ్ముకాదె!
భావనాబల మున్నది♦ప్రకృతియున్న
దిష్టముండినఁ బదముల♦కేమి కొఱఁత?
వారిదవిహారనగ శృంగ♦పదము లరసి
స్వాదు జలపూర్ణనదనదీ♦పదము లరసి
పంకజామోదకాసార♦పదము లరసి
ఫలభరిత దివ్యకేదార♦పదము లరసి
సదమల స్నిగ్ధసైకత♦పదము లరసి
పావనతపోవనాశ్రమ♦పదము లరసి
భవ్యతరమందిరారామ♦పదము లరసి
భవనగోపుర పట్టణ♦పదము లరసి
సార్థకంబుగ భావించి♦సరసకావ్య
మొకటి వ్రాయుము! వ్రాయుము! ♦సుకవిచంద్ర!
సమదకోకిల కలకూజి♦తములలోనఁ
ప్రముదిత మయూరకేకార♦వములలోనఁ
పంజరశుకీశుకానులా♦పములలోన
సుమనసమారోహ దళిఝింజి♦తములలోన
వర్షపాద ప్రచారారా♦వములలోనఁ
దుములకల్లోల జలధిఘో♦షములలోన
ధరణిధర నిర్ఝర ప్రపా♦తములలోన

విమలతటిని తరంగ వే♦గములలోన
సుమధురానిల సంచాల♦నములలోనఁ
దరుణకాదంబినీ గర్జి♦తములలోనఁ
బ్రకృతి యవ్యక్తమంజుల♦ధ్వనులు నెఱపె
వినుచుచున్నది చెవియొగ్గి♦ వినుము! వినుము!
రమణ నొకసారి నీలాంబ♦రంబుఁ దాల్చి
చెలఁగి యొకసారి వెన్నెల♦చీరఁ దాల్చి
పొసఁగ నొకసారి మంచుమే♦ల్ముసుఁగుఁ దాల్చి
లీల నొకసారి మేఘమా♦లికలఁ దాల్చి
ప్రీతి నొకసారి చుక్కల♦ పేరు దాల్చి
పరఁగ నొకసారి క్రొన్నెల♦వంకఁ దాల్చి
వరుస నొకసారి సస్యగ♦ర్భంబుఁ దాల్చి
సరస నొకసారి బాలభా♦స్కరునిఁ దాల్చి
గడియకొకరీతిగా నలం♦కార సరణి
నెఱపుచున్నది ప్రకృతినీ♦ నికటమందు
లసదలంకారముల లక్ష్య♦లక్షణములఁ
దెలిసియుంటి విఁకేమి కా♦వలయు నీకు?
కమ్మపుప్పొడి నెత్తావి♦ గ్రుమ్మరించి
వేగుఁబోకలఁ దెమ్మెరల్♦ వీచునపుడు
ప్రౌఢకాంతల ప్రణయకో♦పములు దీరఁ
గొక్కొరోయని తొలుకోడి♦కూయునపుడు
కాఱుచీఁకటి గుంపులఁ♦గడలఁ ద్రోసి
తూర్పునఁ బ్రభాతకాంతులు♦తోఁచునప్పు
డుదయశైలంబు మాటున♦నుండి బాల
సూర్యుఁడల్లనల్లనఁ దొంగి♦చూచునప్పు
డరుణకిరణంబు లల్లనఁ♦దరులమీఁద
నలరుపవడంపుఁ దీవల♦నల్లునపుడు
ప్రకృతికాంత ప్రసన్నభా♦వంబుఁ దాల్చి

కలవిహంగమ పతములఁ♦గులుకునపుడు
విమలమౌ నీహృదంతరా♦ళమున నెన్ని
యెన్నియూహలు తట్టునో♦యెవరి కెఱుక ?
కలికి చూపుల నెంతరా♦గంబు గలదొ
వెలఁది నవ్వులలో నెంత♦చలువ గలదొ
విరిశరంబులలో నెంత♦చుఱుకు గలదొ
కాంచి తెలుపంగ వలఁతివి♦కవిత గాదె ?
సమయసముచిత నవరస♦స్యందనమున
హృదయకేదారముల నెల్లఁ♦బదను చేసి
లలితసతి బీజంబులఁ♦జిలుకరించి
మొలక లెత్తింపఁగాఁ గృషి♦సలుపుమయ్య !
నీతితత్త్వబోధకుఁడవై♦నెగడునపుడు
తోఁచినన్ని త్రోవల నీవు♦ద్రొక్కవచ్చు
లేదు నిర్బంధమనఁగ నీ♦లేఖినికిని
కలదుగాదె "నిరంకుశాః♦కవయ" యనుట
వెలయు ప్రకృతికిఁ బరిమితి♦కలదుగాని
భావనాప్రకృతికి లేదు♦పరిమితి భువి
భావవీథి యనంతమై♦పరఁగుఁగాన
వివిధగతులఁ జరింపుమీ♦కవివరేణ్య !
నిస్తులంబగు నీ లేఖి♦నీముఖంబు
కలుషపూర్ణమషీరస♦కలితమయ్యు
నవరసంబులఁ జిల్కుచు♦న్నది సతంబుఁ
గృతులచే పట్టుగలవారి♦కేమి కొఱఁత ?
నీమనోభావముల నెల్ల♦నేర్పు మీఱ
సక్షరాకృతి విలసిల్లు♦నట్లు చేసి
మనసువెంబడి నీదు లే♦ఖిని చరింపఁ
గలదుగావునఁ గవితపైఁ♦దలఁపుఁ జేసి
ప్రకృతితత్త్వరహస్యని♦ర్ణయము చేసి

యఖిలవస్తు గుణంబుల నవధరించి
వివిధరూప స్వభావముల్ విశదపఱచి
దేశకాలపాత్రంబులఁ దెలియఁజెప్పి
సనయమర్మ యగతుల బోధనము చేసి
కష్టసుఖసంతతుల నెల్ల గణనఁ జేసి
పాపపుణ్య కర్మంబులఁ బరిగణించి
యనుపమపవిత్ర చరితంబు లనువదించి
సకలవిధ్యుక్త ధర్మముల్ సంతరించి
సర్వశాస్త్రముల్ బోధింపఁ జాలఁగలవు
సర్వధర్మముల్ వివరింపఁ జాలఁగలవు
సర్వశక్తులు గలిగింపఁ జాలఁగలవు
సర్వశుభముల సమకూర్పఁ జాలఁగలవు
జగతి నీమాట మీఁదుగా జరుగుచుండు
జగతి నీచేత నన్వర్థ మగుచునుండు
జగతి నీచూపు త్రోవసే చనుచునుండు
జగతి ధన్యుండనఁగ నీవె సత్కవీంద్ర!

వేంకట పార్వతీశ్వర కవులు.



# ప్రకృతిశాస్త్రములు.

సూర్యుని తేజస్సు ఆకాశముయొక్క అణుపరిస్పందమున (Vibrations of ether) మనకు వచ్చిచేరునని పైనిఁ జెప్పఁబడియున్నది. శబ్దముకూడ నిటు లనే వ్యాపించునని పండితులకు స్పష్టమయిన సంగతియే. కనుక 17 వ శతాబ్దమందు కొందఱు శాస్త్రజ్ఞులు వేడిమికూడ పరిస్పందరూపమాయని యనుమానింప నారంభించిరి. అణువుల పరిస్పంద, గతివేగమే, వేడిమికి కారణమని బోయిలు (Boyle) న్యూటను మొదలగువారు వ్రాసిరి. అయినను వీరి యభిప్రాయమును తత్కాలపువారు ఆమోదింపక పూర్వులవలెనే వేడిమియొక విధమైన ద్రవ్యవిశేషమని (a kind of matter) యాలోచించు చుండిరి. న్యూటను సమకాలికుఁడగు స్టాలుఅను జర్మానియాదేశీయుఁడు దగ్ధమగు ప్రతివస్తువునందును ఫ్లొజిస్టను (Phlogiston) అను నొక పదార్థమున్నదనియు, ఆవస్తువునకు నగ్నిసంస్కారముకలిగినప్పుడు ఆపదార్థమెగిరి పోవుననియు సిద్ధాంతముచేసెను. కఱ్ఱ కాలిన తర్వాత బూడిద తేలికయగుటకును, మైనపువత్తి క్రమముగా మాయమైపోవుటకును ఈఫ్లొజిస్టను వానినుండి యెగిరిపోవుటయే కారణమనియు వస్తువులయందు ఫ్లొజిస్టను హెచ్చుగానున్న యెడల నవి తొందరగా మండుననియుఁ గనుకనే బొగ్గు కొంచెమించు మించుగా స్వచ్ఛమైన ఫ్లొజిస్టను అనియు స్టాలు సమర్థించెను. ఈసిద్ధాంతమాతని సమకాలికులందఱిచే నంగీకరింపఁబడి సుమారు నూఱుసంవత్సరముల వఱకు ప్రసిద్ధమైయుండెను. ఏలోహమైనను దగ్ధముచేయఁబడిన పిమ్మట దాని భస్మము దానికంటె హెచ్చుగాతూగు నని యాకాలపు పండితులకు తెలిసినను వస్తువులయొక్క బరువునందుఁ గలుగు మార్పులను వారు గణనచేయలేదు. ఈ మార్పులు వారికి స్వల్పాంశములుగాఁదోఁచెను.

ఇట్లు రసవాదప్రపంచము అజ్ఞాన తమఃపటలములచే నావరింపఁబడియుండ నాచీఁకటిని బాప, లవోయిజరు అను దివాకరుఁడు ఫ్రాన్సు దేశమున నుదయించెను. ఈమహనీయుఁడు రసాయనశాస్త్రమును సరియైన మార్గమునఁ బెట్టుటచే నాశ్చా

స్త్రమునకు తండ్రిగా నెంచఁబడుచున్నాఁడు. ఇతరులవలెఁగాక యీమహనీయుఁడు
ప్రతిమార్పును త్రాసు నుపయోగించి విమర్శచేయ నారంభించెను. తగరమును
ఒకగాజుబుడ్డిలోఁ బెట్టి గాలిపోరకుండ దానికి బిరడావేసి యాబుడ్డిని తూఁచి
కొన్ని వారములు మంటపైకాఁచి తిరిగి తూఁచఁగా దాని భారమందు వ్యత్యాస
మేమియు కానరాలేదు. కాని బిరడాతీసి చూచునరికి దానిలో తగరము తెల్లని
భస్మమైయుండెను. పైగాలి లోనికి ప్రవేశించుటచే అది తిరిగి తూఁచఁగా హెచ్చు
తూగెను. వీనిని బట్టి యతఁడు తగరము బుడ్డిలోనుండుగాలిలో నొక భాగముతో
సంయుక్తమై భస్మీకృతమాయెననియు, అందుచే బిరడాతీసినపుడు పైగాలి కొంత
లోనికిఁ బోయినందున రెండవమాఱు తూఁచునపుడు బరువు హెచ్చెననియు వాక్రు
చ్చెను. ఆక్సిజను వాయువుకని పెట్టఁబడిన తరువాత లవోజియరు ప్రతివస్తువు దగ్ధ
మగునపుడు ఆవాయువుతో సంయోగమై యెక్కువబరువు గలిగి యుండునని
తెలియపఱచి ఫ్లోజిస్టిను వాదమును ఖండించి రసాయనశాస్త్రమునకు నభివృద్ధి
గావించెను. ఇంతియకాక పదార్థములు భేదమును పొందునపుడు వానికి నాశము
గాని క్రొత్తగా నుత్పత్తిగాని యుండదనియు యావత్తు ప్రపంచమందుండు ద్రవ్య
ముయొక్క ప్రమాణము (Quantity of matter) నందు హెచ్చు తగ్గులు లేవ
నియు సిద్ధాంతముచేసెను. ఇది రసాయనశాస్త్రమునకును, నితర ప్రకృతిశాస్త్ర
ములకును బీజభూతమయినది.

ద్రవ్యము మార్పులుపొంది యనేకవేల పదార్థములుగా నేర్పడియున్నది.
వీనిలో బంగారు, పాదరసము, గంధకము, మొదలగునవి కొన్ని వ్యస్తద్రవ్యము
లనఁబడును (Elements). తక్కినవి వీని సంయోగమువలన, నేర్పడి సమస్త
ద్రవ్యము లనఁబడును (Compounds). లవోజియరు బోధించిన ప్రకారము ప్రతి
మార్పును త్రాసు నుపయోగించి విమర్శించుటచే యేసమస్త ద్రవ్యమైనను
వ్యస్తద్రవ్యముల ప్రమాణానుగుణ్యము (Proportion of quantity) మాఱక
యొక్కటిగానే యుండుననియు, నదిమాఱినప్పుడు మొదటి సమస్తద్రవ్యముగాక
భిన్నమైనది యేర్పడుననియు స్థిరపఱుపఁబడెను. 1803 వ సంవత్సరమున డాల్టను
అను నాంగ్లేయుండు రెండు వ్యస్తద్రవ్యముల సంయోగముచే రెండుమూఁడు
సమస్తద్రవ్యము లుత్పన్నమైనచో వీనిలో నొక వ్యస్తద్రవ్యము ఒకమెత్తుగానున్న
యెడల రెండవ వ్యస్తద్రవ్యము ఒకమెత్తుగాను, రెండుమెత్తులుగాను, మూఁడు
మెత్తులుగాను నుండుననని కనిపెట్టెను. ఈ సంయోగవైచిత్రికి కారణమెద్దియని

యోజించి ప్రాచీనుల పరమాణువాదమును 1804 వ సంవత్సరమున డాల్టను విమర్శించెను. ప్రతి వ్యస్తద్రవ్యము సమానరూపమును భారమును గలిగి భేద్యములు గాని పరమాణువుల సమూహమనియు, పరమాణువులకు నాశనము లేదనియు, రెండు వ్యస్తద్రవ్యముల పరమాణువులకు భారమునందు వ్యత్యాసము గలదనియు, విజాతీయ పరమాణువుల సంయోగముచే సమస్త ద్రవ్యములుత్పత్తి యగుననియు డాల్టను ప్రకటించెను. ఇంతియకాక యితఁడు హైడ్రోజను వాయువుయొక్క పరమాణు భారమును ఒక్కటిగా నెంచి తక్కిన వ్యస్త ద్రవ్యముల పరమాణు భారములను కనుఁగొను మార్గములను కొన్నిటిని చెప్పెను గాని వీనియందు తప్పులుండుటచే రసవాద శాస్త్రజ్ఞులు నిజముగానక తడఁబడుచుండిరి. అట్టి సమయమున 1811 వ సంవత్సరమున అవగాడ్రో అను ఇటాలియాదేశీయుఁడు సమానోష్ణోచ్ఛనోదనములు (Same temperature and pressure) గలిగి సమానపరిమాణము (Volume) గల వాయువిశేషములయందు సమాన సంఖ్యగల యణువు లుండుననియు, ఈ యణువులు సజాతీయములైనను, విజాతీయములైనను పరమాణువుల సంయోగముచే (Combination) నేర్పడుననియు సిద్ధాంతముచేసెను. దీని నుపయోగించి విమర్శించినయెడల ననేక వాయువులయొక్క అణువులు రెండు పరమాణువుల సంయోగమువలన నేర్పడుచున్నవనియు, వ్యస్తద్రవ్యములను వాయురూపముగా మార్చి వానిబరువును సమానపరిమాణముగల హైడ్రోజను వాయువుయొక్క బరువును తూఁచుటవలన వానియణువులు హైడ్రోజను అణువులకంటె యెన్ని రెట్లు హెచ్చు బరువో నిర్ణయింపవచ్చుననియు విశదమగును. ఇట్టి సంబంధము తెలిసినప్పుడు పరమాణువుల భారమును గూడ లెక్కింప వచ్చును.

అవగాడ్రో సిద్ధాంతమునకు నాధారములైన వాయుస్వభావములను కొన్నిటిని బోయల్, చార్లసు, గే లూజాకు (Guy Lussac) అనువారు కనిపెట్టిరి. మన మొకతిత్తిలో గాలినుంచి తిత్తిని గట్టిగా నొక్కిన, అది చిన్నదియై అందలి గాలి తక్కువపరిమాణముగలదిగా నుండును. అనఁగా నోదనము (pressure) హెచ్చినకొలఁది వాయుపరిమాణము తగ్గును. ఆతిత్తిని వేడిచేసినయెడల నది పెద్దదియై వాయుపరిమాణము అధికమగును. కనుక ప్రతివాయువుయొక్క పరిమాణము దానినోదనముతోను, ఉష్ణోచ్ఛతోను (Pressure&temperature) మారుచుండును. మఱియు, రెండు, మూఁడు వాయువులు తమ సంయోగముచే

వాయురూపమగు సమస్త ద్రవ్యము నొకదానిని బుట్టించునపుడు ఆవాయువుల పరిమాణములు ఒకదానికొకటి సంబంధించి యుండునని గే లూజాకు అను వాఁడు కనిపెట్టెను.

వాయువులనుగుఱించి పైనివ్రాసిన యంశములకు, నుపపత్తిగా నొక సిద్ధాంతము బెర్నూలీ, క్లాజియసు, మాక్సువెలు మొదలగువారిచే స్థిరపఱుపఁబడెను. అదియేమనఁగా ప్రతివాయువునందును లెక్కలేని సూక్ష్మములైన అణువులుగలవు. వీని పరిమాణము ఆవాయుపరిమాణము కన్న మిగుల తక్కువగుటచే వీని చుట్టునున్న ఖాళీస్థలములలో, నివి యెల్లప్పుడు స్వేచ్ఛగా ఋజుమార్గముల నతివేగముతో చలించుచు నొకదాని కొకటి తగిలి నప్పుడుగాని, వాయువుండు పాత్రప్రక్కలకు తగిలి నప్పుడుగాని తిరిగి వేఱుమార్గమున పూర్వపురీతినే సంచరించుచుండును. ఆయణువులు తమ యభిఘాతముచే పాత్రను నొక్కుచుండును. ఇదియే వాయునోదనమునకు కారణము.

ఒక పాత్రయందలి వాయువుయొక్క అణువులసంఖ్య హెచ్చిన కొలఁది వాని యభిఘాతము హెచ్చును. కనుకనే వాయునోదనముగూడ హెచ్చును. మఱియు, అణువులగతివేగ మధికమైనయెడల వాని యభిఘాతశక్తి యెక్కువగుటచే వాయునోదనము హెచ్చును.

వాయువులయందువలెనే ద్రవపదార్థములయందును సాంద్రమైన ఘనపదార్థములయందును గూడ యణువులున్నవనియు, అవి తాముండుస్థలములలో చలించుచుండుననియు పండితులచే వివరింపఁబడెను. ఘనపదార్థములను మంటపై కాఁచినచో వాని యణువులగతివేగ మధికమై అణువులకుఁగల యాకర్షణశక్తి క్రమముగాతగ్గి ముందు ద్రవపదార్థములుగాను, పిమ్మట వాయువులుగాను మాఱును. వాయువులనుండి వేడిమి క్రమముగా తీసివేసినయెడల నవి ద్రవపదార్థములుగాను, ఘనపదార్థములుగాను మాఱును. చాలకాలమువఱకు ద్రవరూపముగా మార్చుటకు శక్యముగాని, హైడ్రోజను వాయువుగూడ నిటీవల డీవారు అను ఆంగ్లేయునిచే ద్రవఘనపదార్థములుగా మార్పఁబడెను.

అణువులకేగాక పరమాణువులకు సహితము అనవరతపరిస్పందముగలదని పై సిద్ధాంతమువలన తెలియవచ్చుచున్నది. అణువులయొక్క పరిమాణము, గతివేగము, మొదలగునవి శాస్త్రజ్ఞులచే లెక్కింపఁబడుటచే పరమాణు సిద్ధాంతము గూడ దృఢపఱుపఁబడెను.

అణుచలనసిద్ధాంతము (Kinetic theory) వేడిమి స్వభావము కనిపెట్టుటకు రానురాను చేసిన ప్రయత్నములమూలమున నిర్ణయింపఁబడెను. వేడిమి ద్రవ్యరూపమని 50 సంవత్సరముల క్రిందటివఱకు వ్యతిరేకనిదర్శనములున్నను నమ్మఁబడుచుండెను. రెండు కఱ్ఱలరాపుడువలన నిప్పుపుట్టునని సామాన్యముగా తెలిసిన సంగతియే. 1798 వ సంవత్సరమున జర్మనీదేశమందు రమ్ఫర్డు (Count Rumford) అనువాఁడు ఫిరంగులకు బిలములు కోయుచుచున్నప్పుడు వేడిమి యుత్పత్తియగుట కనుఁగొని ఆవేడిమిచే 19 పౌనుల భారముగల నీటిని 2½ గంటలలో మఱుఁగునట్లు చేసెను. ఇట్లు కలిగిన వేడిమికి పరిమితియున్నట్లు కనఁబడనందున వేడిమి పరిస్పందరూపమై యుండవలయునని యూహించెను. డేవీ అనువాఁడు రెండు మంచుగడ్డలను తీసికొని వానికి బయటనుండి వేడిమితగులకుండఁజేసి వాని రాపిడివలననే వానిని కరగించెను. ఇట్టి నిదర్శనములచే వేడిమి ద్రవ్యరూపము గాదనియు, మనము వినియోగించిన శక్తియే వేడిమిరూపముగాఁ బరిణమించినదనియు తెలియవచ్చును. ఇటులనే వేగముగా చలించుచున్న యేవస్తువైనను చలనరహితమైనపుడు దానికి మొదటఁ గలిగిన గతిశక్తి (Kinetic energy) వేడిమిగామాఱును. వేడిమికిని గతిశక్తికిని గలయన్యోన్యసంబంధము మేయరు, జౌలు అనువారలచే నిర్ణయింపఁబడెను. ఒకపౌనుగుండుకు సుమారు 1391 అడుగుల యెత్తునుండి పడవైచిన దానియభిఘాతమువలనఁబుట్టిన వేడిమి యొకపౌనునీటిని ఉష్ణమానమందొక డిగ్రీ వేడియగునట్లుచేయునని జౌలు లెక్కించెను. గతిశక్తి నాశముపొందినట్లు కనఁబడినను సమాన పరిమాణముగల వేడిమిగామాఱెనుగాని నశింపలేదు. ఈప్రకారమే తేజస్సు, శబ్దము, విద్యుచ్ఛక్తి (Electricity) మొదలగు తక్కినశక్తులుకూడ వేడిమిగామాఱునుగాని నాశనమును పొందవు. కనుకనే ద్రవ్యమునకువలె శక్తికిఁగూడ వద్ధిక్షయములులేవని శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి.

గతిశక్తి వేడిమిగామాఱునట్లు వేడిమిగూడ గతిశక్తిగామాఱుననుటకు రైలుబండ్లు నిదర్శనము. వీనియందు నీటియావిరి చల్లబడినప్పుడు వేడిమి గతిశక్తిగామాఱి బండ్లను వేగముతో పోవునట్లుచేయును. ఇంతియకాక సూర్యుని వేడిమినుపయోగించి చెట్లుచేమలు గాలియందుండు నొక పదార్థమునువ్యస్తపఱచి యాత్మపోషణము గావించుకొనుచున్నవి. మనకుఁగల శక్తులన్నిటికిని సూర్యుని వేడిమియే మూలాధారము. ఈనిదర్శనములవలన వేడిమి గతిశక్తిగామాఱుననుటకు సందే

హము లేదు. అయినను రెండువస్తువులకు ఉష్ణోచ్ఛ (Temperature) సమముగా నున్నప్పుడు వానియందలి వేడిమిని మన ముపయోగించుకొనలేము. ఎటులనఁగా, సమాకారమైనయెత్తున నున్న పాత్రలలోని నీరు ఒకదానినుండి రెండవదానిలోనికి పాఱఁజాలదు. ఒకటి యెత్తైన స్థలమందున్న యెడల నీరుపాఱి కొంతపనిని చేయఁగలదు. కనుక బ్రహ్మాండమందుండు వస్తువులన్నిటికిని ఉష్ణోచ్ఛసమానముగానున్న యెడల వేడిమిని మఱియొక శక్తిగా మార్చుటకు శక్యముగాదు. అట్టియవస్థలో జీవజంతువులుండుట కూడ నసాధ్యమే.

ఇట్లు కొన్ని ప్రకృతిశాస్త్రములు ద్రవ్యమునకును శక్తికిని నిత్యత్వమును సాధించుచున్నవి. ద్రవ్య శక్త్యాత్మకములైన జీవులను గుఱించి చెప్పు జీవ శాస్త్రము (Biology) ఆజీవులయొక్క పరస్పర సంబంధములను, వాని శరీర నిర్మాణము లోనగు నంశములను బోధించుచున్నది. పూర్వులు జంతువులను మచ్చికచేసియు, చెట్లు చేమలను పెంచియు వాని స్వభావములను గనిపెట్టుచు వచ్చిరికాని వాని శరీరతత్వము బాగుగా గ్రహించినవారు కారు. ఈజిజ్ఞాస మొదట గ్రీసుదేశీయులకును వారివలన అరేబియనులకును గలిగి పాశ్చాత్యమండల మంతయు వ్యాపించెను. వ్యాధిపీడితమగు శరీరముల నుండి ఆవ్యాధులఁ దొలఁగించునుపాయము లనేకములు కనిపెట్టఁబడినవి గాని ఈకృషిచేసిన వారు క్రొత్త వస్తువుల ననేకములను కనిపెట్టి అనేకౌషధులఁ బరీక్షించిరి గాని శరీరతత్వము స్పష్టపఱచినవారు కారు. 1628 సం॥ న హార్వె (Harvey) అనువానిచే మనశరీరములందు సూక్ష్మనాళముల ద్వారా రక్తము ప్రసరించుచు జీర్ణకోశమున పక్వమైన పదార్థము నాకర్షించి శరీరమంతటను వ్యాపింపఁజేయుచున్నదను సంగతి కనిపెట్టఁబడిన వెనుక శరీరరహస్యములు కొంతవఱకు వెల్లడియాయెను. కాని సూక్ష్మదర్శనీయంత్రము (Microscope) నభివృద్ధి చేయుటయె శరీర శాస్త్రాభివృద్ధికి మూలకారణ మాయెను.

సజీవములైన వృక్షములలోను, జంతువులలోను, వృక్షములు గాలినుండియు భూమినుండియు నచేతనపదార్థము (Inorganic matter) ను గ్రహించి వృద్ధి పొందుచు, దానిని తిని బ్రదుకఁజాలని జంతువులకు కాయలు పండ్లు మొదలగు వస్తువుల నాహారమునకై యిచ్చుచుండును. జంతువులచే విడువఁబడిన, అంగారామ్ల వాయువు (carbon-di-oxide) చెట్లకు నాహారమగుచు వానిచే విడువఁబడిన ఆక్సిజను వాయువు జంతువుల కాధారమగుచుండును. ఇట్లు వృక్షములు

జంతువులును ప్రాణత్రాణమునకై అన్యోన్యము సహాయభూతము లగుచున్నవి. కాని వాని కత్యంతభేదము గానరాదు. కొన్ని చెట్లు నిద్రావస్థగల వగుటచేతను కొన్ని యేదయిన ధ్వనిని వినినపుడు ఆకులను మూయుటచేతను, మఱికొన్ని క్రిమికీటకాదుల నాహారముగాఁ గొనుటచేతను అవి జంతువులవలె సచేతనము లనుటకు సందియము లేదు. ఇంతియకాక సూక్ష్మదర్శినిచే జంతు శరీరమును గాని వృక్షశరీరమును గాని పరీక్షించినయెడల నది జీవకణము (living cells) లనఁబడు బహుసూక్ష్మపదార్థములచే చేయఁబడినట్టులఁగానవచ్చును. మనకు దృష్టి గోచరము కాని కొన్ని సూక్ష్మప్రాణుల నియంత్రమున శోధించిన నవి యేకకణ మయములై యుండును. తక్కిన జంతుశరీరములలో నీకణము లనేకాకారముల నొప్పుచున్నవి. ఈ కణములే గుంపులుగాఁ జేరి క్రమక్రమముగా ననేక మార్పులఁ బొంది, ఎముకలు, నరములు, చర్మము మొదలగువాని నుత్పత్తి చేయును. అటువలెనే చెట్లయందు కొమ్మలు ఆకులు మొదలగునవి పుట్టుచున్నవి. ఈకణము లాహారమును గ్రహించుచు నన్యకణమును పుట్టించునపు డొక్కొక్క దాని యందు, రెండు, నాల్గు, పదియారు చొప్పున ననేకములు పుట్టి అనేకావయవము లకు కారణమగుటం జేసి యద్భుతమైన యవయవనిర్మాణ మేర్పడుచున్నది ఇట్టి ప్రతికణమందును జీవత్వమునకు మూలాధారమైన పదార్థమొకటి (Protoplasm) యుండును. ప్రాణులకుఁ గల సర్వచేష్టలు దీనియందుఁ గానవచ్చును. దీనినుండియే జీవులన్నియు పుట్టుననుటకు సందియము లేదు.

కణభూయిష్ఠములైన సూక్ష్మప్రాణులును మన దృష్టికి గోచరముగా కున్నను సూక్ష్మదర్శినిచే చూడనగునని పైనిచెప్పితిని. మనమెండుగడ్డిని నీటిలో నానవైచి దానిని వడియఁగట్టి ఆనీటిని కొంతసేపుంచిన యెడల దానియందీప్రాణు లనేకములు గానవచ్చును. జీవపదార్థములు చచ్చినపు డిట్టి సూక్ష్మప్రాణులు వానిశరీరములలోఁ బ్రవేశించి వానిని కుళ్లునటులచేసి యా శరీరపదార్థమును తక్కినజీవుల కుపయోగించువస్తువులనుగా మార్చును. మఱియు నివి గాలియందును నీటియందును బ్రవేశించి వాని ద్వారా జంతుశరీరములఁ జొచ్చి విషూచి, మన్యపుజ్వరము, మొదలుగాఁగల రోగములను పుట్టించును. ఈయంశము పేస్టరు (Pasteur) అను వాఁడు ప్రకటించినది. మొదట నీప్రాణులచేఁ గలుగు వ్యాధులును హానిని నివారించు మార్గములును కనిపెట్టఁబడెను. ఈప్రాణులలోఁ గొన్ని యద్భుతమైన రాసాయనికవ్యత్యాసములను (Chemicalanges)

గూడఁబుట్టించును. మన మొక గాజుపాత్రయందు పంచదార పానకమును పోసి దానికి ఈస్టు (Yeast) అను వస్తువును కలిపిన యెడల నది కొంచెము కాలము లో పులియును. ఈవింతయైన మార్పు ఈస్టుయందున్న సూక్ష్మజీవుల వ్యాపార మున పుట్టుచున్నదని 1838 సం॥ మున ష్వాను అనుశాస్త్రిజ్ఞుఁడు వక్కాణిం చెను. కణమయములైన సూక్ష్మప్రాణులిట్టివిచిత్రవస్తువులను చేయుచుండఁగా మనశరీరములందీ కణముల వ్యాపారమున పుట్టుచున్న వస్తుజాలమును లెక్కిం ప శక్యముకాదు గాన పూర్వులు సజీవపదార్థముచే పుట్టుచున్న వస్తువు లన్నియు దానికిఁ గల యనన్యసాధారణ సామర్థ్యముచేఁ గలుగుచున్న వనియు ఆవస్తువులను మనరసాయన ప్రయోగశాలల (Chemical Laboratories) యందుఁ జేయశక్యముగాదనియు నమ్మిరి. కాని 1828 సంవత్సరమున వోలరు (Wohler) అను మహనీయుఁడు జంతువుల మూత్రమందుఁగల యురియా (Urea) యను వస్తువును ఎమోనియము సైనేటు (Ammonium cyanate) అనువస్తు వునుండితయారుచేసెను. హెనెల్ (Henell) అనువాఁడుఆల్కహాలను(alcohol) మద్యసారమును చేయువిధమును కనిపెట్టెను. పిమ్మట వృక్షజన్యములైన పంచ దార నీలిమందు కర్పూరము కొకేను మొదలగు పదార్థములనుచేయుమార్గ ములు గూడ తెలిసెను. రబ్బరుగూడ నిట్లే తయారుచేయఁబడెను. ఈవస్తువుల లో నీలిమందు మొదలగు కొన్నిటిని విశేషవ్యయప్రయాసములక్కఱలేకయే తయారుచేయుటకు వీలగుటచే వానిని చెట్లనుండి తీయుట మానిరి. కడచిన పది సంవత్సరములలో నీలిపంటను మానుటచే మనదేశమందున్న ఫాక్టరీలన్నియు కట్టివేయఁబడెనని అందటికి తెలిసినదియే.

1897సం॥న బుక్నెరు (Buchner) అనునతఁడు పంచదారపానకమును పులియఁబెట్టుశక్తి ఈస్టుయందున్న సూక్ష్మజీవులదిగా దనియు నాప్రాణులయం దైన యనీజైములను (Enzymes) వస్తువులదనియు ప్రకటించుటచే నావస్తు వుల స్వభావమును అవి చేయఁగల రాసాయనికవ్యత్యాసములను గుఱించి యిపుడు విశేష పరిశ్రమచేయఁబడుచున్నది.

సచేతనవస్తువులన్నిటి యందుఁగల మూలాధార పదార్థమందును కణము లయందును గల వ్యస్తపదార్థములనన్నిటిని శాస్త్రిజ్ఞులు దెలిసికొనిరి కాని జడ పదార్థమునుండి సజీవపదార్థ ముత్పన్నమగునా యనునంశము నేఁటికిని వారి మనస్సును బాధించుచున్నది. స్వచ్ఛమైన నీటిని కొన్నాళ్లుంచిన యెడల దాని

యందనేక సూక్ష్మజీవులు గనఁబడుటచే నీయల్పప్రాణులు తమంతటతాము గాలి నుండియు నీటినుండియు మట్టినుండియు పుట్టుచున్నవని ప్రాచీనులూహించిరి. తొలుకరివాన కురిసిన వెంటనె కప్పలు బెకబెకలాడుటచే నవి తమంతటతాము పుట్టినవని యిప్పటికిని కొందఱనియెదరు గాని హక్స్లె (Huxley) మొదలగు వారీవాదమును ఖండించి నీటియందును గాలియందును సూక్ష్మదర్శినికిఁ గాని గోచరముగాని జీవులు కొన్ని యుండవలెననియు ప్రాణులనుండియె ప్రాణులుత్పన్నమగునుగాని జడపదార్థము సజీవపదార్థముగా మాఱఁజాలదనియు సిద్ధాంతము చేసిరి.

తక్కువజాతి జీవులనేకములు అవయవనిర్మాణము లేనివై యేకకణమయములనియు, హెచ్చు జాతి జీవులలో నద్భుతమైన అవయవనిర్మాణము గలదనియు పైనుదాహరింపఁబడెను. ఈయవయవరచనానైపుణ్యము హెచ్చయిన కొలఁది జ్ఞానముకూడ హెచ్చగుచు. కడపటికి అఖండప్రజ్ఞాబుద్ధులు మానవ శరీరములందుఁ గానవచ్చును. ఈశరీర రచనకును జ్ఞానాభివృద్ధికిని కారణభూతమైనది కణములందున్న మూలాధార పదార్థమె. కణసంఖ్యయు, వాని యాకారములును మాఱిన కొలఁది అనేక విధములయిన అవయవములు పుట్టును. అందుచేతనే కొన్ని సూక్ష్మ జీవులను జంతుజాతిలోనివా లేక వృక్షజాతిలోనివా యనిపోల్ప శక్యముకాదు. అవయవరచనకును, జాతిభేదమునకును మూలాధారపదార్థమునకుజరిగినసంస్కారములే కారణము గనుక ఈజీవరాసులన్నియు నొకదాని కొకటి సంబంధించి పుట్టినవిగాని దేనికది స్వతంత్రముగా పుట్టలేదని తోఁచుచున్నది. పశుపక్షి మృగాదులకును వృక్షములకును పరస్పర సాదృశ్యము సామాన్యజనులకుఁ గానరాకున్నను అవి యన్నియు నొకదాని కొకటి జ్ఞాతులవంటివియె. అన్న దమ్ములలోనున్న పోలిక అన్న దమ్ములపిల్లలలోను, వారికున్న పోలిక తాత సహోదరులలోను గానరాకున్నను వారందఱేకకుటుంబికులై యొక్కని వంశము వారే యగునట్లు మనుష్యులును పక్షులును, మృగములును ఏకవస్తుజన్యములే యని వాని శరీర నిర్మాణమందుఁ గల పోలికచే మన మూహింపవచ్చును. ఈయవయవరచనయందు హెచ్చు పోలిక గలిగియుండునవి ఒక్కొక్క జాతిగా నేర్పఱుపఁ బడినవి.

ఏజాతిజంతువైనను అనాదినుండి భూమిమీఁద మార్పులేని యాకారముతో సృజింపఁబడి యుండలేదని వేఱ చెప్ప నక్కఱలేదు. ఇందుకు దృష్టాంతము

ఇప్పటి గుఱ్ఱములకు డెక్క యొక్కటియె గలదు. కాని అనేక లక్షల సంవత్సరముల క్రిందట గుఱ్ఱమున కైదుడెక్క లున్నట్లును క్రమక్రమముగా నందులో గొన్నిటి కుపయోగము లేనందున నవి పోయి యిప్పు డొక్కటియె నిలిచియున్నట్లును భూగర్భమందు దొరకిన గుఱ్ఱపు శల్యములలోఁ గనఁబడుచున్నది. మఱియు నొక్కొక దేశమందుఁగల పశుపక్షిమృగాదులకును ఇంకొక సమీపదేశమందుఁ గల వానికిని ఆకారములో నత్యంతసాదృశ్యము లేనందునను, ఒక్కొక కాలపుఁ బ్రాణు లొక్కొక్క యాకారము గల వగుటచేతను లెక్క లేని యీప్రాణి జాతులనాదిసిద్ధములను వాదము శాస్త్రీయముగాఁ గానవచ్చుచున్నది. కావున నీవాదమును తిరస్కరించి పరిణామవాదమును (Theory of evolution) సిద్ధాంతపఱచి డార్విను మహాశయుఁడు ప్రాణికోటియందు జాత్యుత్పత్తివిధాన మిట్టిదని నక్కాణించెను. ఇతనియభిప్రాయమును స్పష్టపఱచుటకై యొకటిరెండు దృష్టాంతములనిచ్చెదను. కొన్ని దేశములయందు సిరాటంకముగాఁ దిరుగుచుండెడి రెండుమంచి యడవిగుఱ్ఱములను మచ్చికచేసి సంరక్షించి వానికి వేగముగా పరుగెత్తుటకు నేర్పితిమేని యవి లావణ్యరూపములను పొంది క్రొత్తగుణముల నభ్యసించును. వానిపిల్లలలో మంచివానినెంచి మఱికొన్ని క్రొత్తపనులఁగూడ నలవాటుచేయుచు వచ్చిన యెడల నవిరానురాను కొన్నితరములగు వఱకు సుందరమైన గొప్ప శరీరములును ధైర్యసాహసములును గలవై జవమునందీడు లేయక పందెములయందును యుద్ధములయందును మిక్కిలి యుపయోగించును. ఇట్లు వంశపరంపరగా మనశిక్షకులోఁబడి నూతనగుణాతిశయముల నభ్యసించిన గుఱ్ఱములు ఆకారభేదమును గూడఁ బొంది మొదటి యడవిగుఱ్ఱములకంటె విలక్షణముగాఁ గానవచ్చుచున్నవి. ఇటు వలెనె పల్లెకుక్కలకును వేటకుక్కలకును భేద మేర్పడుచున్నది.

ఇటులనే ప్రకృతియందుఁ గూడ జాతివైషమ్య మేర్పడుట కనేక కారణములు గలవు. అందేదో యొకకారణమున నొకజాతి జంతువుయొక్క పిల్లలలోఁ గొన్నిటికి నొకవింతైన గుణము ప్రాప్తించి ఆగుణము వంశపరంపరగా వృద్ధియగుచుఁ గొన్నితరములగుసరికి ఆసంతతి జంతువులను తక్కిన వానినుండి వేఱుచేయును. ఇందుకు నిదర్శనముగా 1791 సం॥ న అమెరికా ఖండమందొకని గొఱ్ఱెలమందలో పొట్టికాళ్ళుగల గొఱ్ఱె యొకటిపుట్టెను. అది తక్కిన గొఱ్ఱెలవలె కంచెలను దాఁటలేకయుండెను. దానిపిల్లలలో పొట్టికాళ్ళుగలవా

నిని పెంచుచురాఁగా కొన్నాళ్లకు వానిసంతతి యంతయు వేఱుజాతిగా నేర్ప డెను.

సాధారణముగా క్రిమికీటకాదులయందును తిర్యగ్జంతువులయందును సంతానాభివృద్ధి విశేషముగా నుండును. దేశకాలస్థితులు మాఱుచుండుటచేతను శీతోష్ణాది భేదములచేతను, వానికాహారము తక్కువయగుటచేతను నవి ప్రాణ త్రాణమునకై తాపత్రయపడుచు ఆస్థితులకు తమశరీరమును పొందుపఱచుకొని ఆత్మపోషణము గావించుకొను శక్తిగలవి మాత్రము భూమియందుఁ దక్కుచు, తక్కినవి నశించుచుండును. ఈస్థితులు మాఱినకొలఁది తదానుగుణ్యమును వహించుశక్తి గూడ బలిష్ఠములైన ప్రాణులకు హెచ్చుగుచుండును. ఇందుకు దృష్టాంతముగా నాఫ్రికాఖండమున నున్న జిరఫియను నొకజాతి జంతువులలోఁ గొన్నిటికి నేదో యొకకారణమున పొడుగైన మెడలుగలిగె ననియు, అనావృష్టి తటస్థించినపుడెల్ల నవి పొడుగైన చెట్లయాకులను తిని బ్రతుకఁ గలిగిననియు, పొట్టి మెడగలవాని కాసామర్థ్యములేక తామరాను నశించిననియు, అందుచే నిప్పుడున్న జిరఫిజాతిజంతువులన్నిటికిని మెడలు పొడవుగానె యున్నవనియు నీసిద్ధాంతమున సమర్థింపనగును. ఇట్లు మనశిక్షలేకయే ప్రకృతియందు దేశ కాలస్థితులు మాఱిన కొలఁది ఆస్థితుల కానుగుణ్యమును పొందు జంతువులు మాత్రమెంచఁ బడుటచే నూతనజాతు లేర్పడుటకు సందియము లేదు. ఏజాతిజంతు వునందైనను క్రొత్తమార్పులు స్వభావసిద్ధములు. ఇవి వంశానుగుణముగా వానిపిల్లలకు ప్రాప్తించి క్రమముగా వృద్ధియగుచు కొన్నితరములగువఱకు వాని సహజధర్మముల (Natural qualities) గునని డార్వినీయులవాదమందు ముఖ్యాంశము. ఏలక్షణములు వంశానుగుణములగునో ఆసంగతినిగూర్చి పలువురు పలువిధ ములనభిప్రాయపడిరి. వాడుకయే ప్రధానమనువారు తిమింగిలమునకు వెను కటి కాళ్ళు చిరకాలము క్రిందటనే యుపయోగము లేకపోవుటచే తామరాను చిన్నవైనవనియు, నిప్పుకోడికి ఱెక్కలుపయోగము లేనందున దాని ఱెక్కలు పొట్టివగుచున్నవనియు, సమర్థించుచున్నారు. కొందఱు వైద్యశాస్త్రిజ్ఞులు క్షయ, కుష్ఠము మొదలగు రోగములు వంశానుగతములని యందురు. కాని యిట్టియభి ప్రాయములను దృఢపఱచు ప్రమాణములు లేవు. స్త్రీపురుష సంయోగమున నొక బీజకణ (Germ cell) మేర్పడుననియు, దానినుండి యనేక కణములువెలు వడి, అవయవములన్నియు పుట్టుచున్నవనియు చెప్పఁబడినది. ఈశరీర మాజీవక

ణమును పోషించి వృద్ధిచేయుచుండును. అట్టిబీజపదార్థమునుండి మఱికొన్ని బీజపదార్థము లుత్పత్తి యగుటయె సంతానాభివృద్ధియని యందురు. ఇట్లు బీజపదార్థము వంశపరంపరగావచ్చునదియే గావున నైసర్గికగుణసంప్రదాయ మీ బీజకణసిద్ధమని వీజమెన్ (Weismann) అనుశాస్త్రజ్ఞుని యభిప్రాయము. అందుచే మనజీవితకాలమందు అభ్యాసవశమున లభించిన గుణము (Acquired characters) లెవ్వియును బీజపదార్థసిద్ధములు గానందున వంశానుగతములు గావని సిద్ధాంతము. ఇంకను వంశానుగతధర్మములం గూర్చి మెండెలు (Mendel) మొదలగువా రనేకప్రయోగములు చేసిరికాని గ్రంథబాహుళ్యభీతిచే నిచట విస్తరింపలేదు.

డార్విను పరిణామవాదమును బలపఱచు నంశములు రెండుగలవు. భూమిని త్రవ్విచూచిన యెడల దానిగర్భమం దనేకవిధములయిన పొరలుగానవచ్చును. పొరలనేకకోట్ల సంవత్సరములలో నొకదానిపై నొకటి యేర్పడినమాటకు సందియములేదు. వానిలో కడపటి పొరయందు జంతుశల్యములుగాని వృక్షశల్యములుగాని కానరావు. వాని పైపొరలయందు మొదట చేపలయొక్కయు పురుగులయొక్కయు శల్యములును పిమ్మట పాములు మొసలిజాతి జంతువులు మొదలగు వాని శల్యములును పిమ్మట జంతువులు వృక్షములు మొదలగు వాని శల్యములును రానురాను పైపొరయందు మనుష్యశల్యములును గానవచ్చును గావున ఆయా పొర లేర్పడినప్పు డాయాయస్థిపంజరములు గలప్రాణులు మాత్రమే భూమియందు నివసించి యుండెననియు ఆప్రాణులనుండియే మనుష్యశరీరము పరిణమించెననియు స్పష్టమగుచున్నది. ఇంతియకాక పిండోత్పత్తి యయిన పిదప నాపిండ మీయాకారముల నన్నిటిని పొంది వృద్ధియైన కొలఁది అవయవరచన యేర్పడి మనుష్యాకారమునుపొందుటగూడ డార్వినుసిద్ధాంతమును దృఢపఱచు చున్నది.

ఇంక విద్యుదయస్కాంతశక్తులయొక్క గుణవిమర్శచే మనకుఁ గలిగినజ్ఞానాభివృద్ధిని గూర్చి చెప్పెదను.

సూదంటుఱాయి యినుము నాకర్షించుననియు అంబరు అను లక్కవంటి యొకవస్తువును రోమసంబంధమైన గుడ్డతో రాచిన యెడలనది కాగితపు ముక్కలు మొదలగు తేలికయైన వస్తువుల నాకర్షించుననియు చిరకాలము క్రిందటనే పూర్వులు కనుఁగొనిరి. అంబరునకట్లు రాచుటవలన వచ్చినశక్తికి ''విద్యుత్తు''

అని పేరు. దీనికిని సూదంటురాతియొక్క శక్తికిని గల భేదమును గిల్బర్టు (Gilbert) అను నాంగ్లేయుఁడు స్పష్టపఱచెను. ఆయన సూదంటురాతిని వ్రేలాడఁగట్టి దానిసమీపమున వ్రేలాడుచున్న అయస్కాంతశక్తి గల సూదులనుకొన్నిటి నుంచెను. అప్పుడవి యాకర్షింపఁబడు విధమును బట్టి భూమి యొక పెద్దఅయస్కాంతమనియు అందుచే వ్రేలాడుచుండు అయస్కాంతపుసూది భూమి యొక్క ధ్రువములవైపు తిరిగి యుండుననియు ప్రకటించెను.

ఫ్రాంక్లినుమహాశయుఁడనేక ప్రయోగములం జేసి సృష్టియందత్యాశ్చర్యకరమగు మెఱుముయొక్క స్వభావమును గనిపెట్టుటచే కీర్తిని వడసెను. అతఁడొకనాఁడాకాశము మేఘాచ్ఛాదిత మైనపుడు తన కుమారుని వెంటఁబెట్టుకొని యూరివెలుపలికి పోయి తన పట్టురుమాలుతో నొక గాలిపటమునుచేసి దాని మధ్యనొక పొడుగైన సూదిని గ్రుచ్చి యాసూదికిఁ గట్టిన దారముయొక్క క్రింది చివర కొక తాళపుఁ జేతినిగట్టి ఆ త్రాటి నొక స్తంభమున బిగియించి గాలిపటమును విడిచెను. కొన్ని చినుకులు పడిన తరువాత అతఁడు తన వ్రేలిని తాళపుఁ జేతి యొద్దఁబెట్టఁగా దానినుండి యొక మెఱుపు పుట్టి అతని నరములను లాగెను. ఈప్రయోగమున నతఁడు మేఘములు విద్యుద్వంతము లనియు వానివిద్యుత్తును మనము సన్నని యినుప కడ్డీలచే భూమికి తీయవచ్చుననియు మేఘములయందును భూమియందునుగల యనుకూలప్రతికూలవిద్యుత్తుల (Positive and negative electricities)సంయోగముననే పిడుగు, మెఱుపు,కలుగుచున్న వనియు సిద్ధాంతముచేసెను. నాఁటినుండి పిడుగుచేఁ గలుగునుపద్రవముల వారించుటకుఁగా నున్నతభవనశిఖరములయందినుపకడ్డీలను పాఁతుట కారంభించిరి. ఇవి యతని కాలమందే ఫిలడెల్ఫియానగరమున సుమారు 400ల వఱకు పాఁతఁబడెను. కాని యాకాలమున మతాభినివేశము కలవారు ఉఱుము మెఱుపు భగవంతుని యాగ్రహసూచకములనియు వానినాటంకపెట్టుట కుద్యమము మానవునికి తగదనియు నతనిని దూషించిరి. కాని అతని సిద్ధాంతములు జనుల రక్షణార్థ ముపయోగించుటచే నంగీకరింపఁబడెను

గాల్వాని యను ఇటాలియాదేశీయుఁడొకనాఁడు రోగపీడితురాలయిన తనభార్య కాహారమునకై కొన్నికప్పలకు చర్మమును తీసి వానిని విద్యుత్పూరితమైన యొకయంత్ర సమీపముననుంచెను. అదృష్టవశమున

యంత్రసమీపమున నున్న యొకకత్తిని తీయఁగా నాకత్తియొక్క కొన కప్పయొక్క కాలినరములకు తగిలి ఆ కప్ప కాళ్లను కొట్టికొనునట్లు చేసెను. ఆమె యీచిత్రమును తనభర్తకెఱింగించిన నతఁడాశ్చర్యమునొంది ఆకప్ప నొక గాజుబల్లపై నుంచి దాని కాలినరములను మాంసమును ఇనుపతీఁగతోను రాగి తీఁగతోను ఒక్కపర్యాయమె తట్టెను. అప్పుడుగూడ ఆ కప్ప కాళ్లను కదల్పనారంభించెను.

ఆకాలమున పేవియానగరమున పండితుఁడైయున్న వాల్టాయను నతఁడీ ప్రయోగములఁ బరీక్షించి రెండుభిన్న లోహము (metals) లొకదాని కొకటి తగిలి యున్నప్పుడు ఒకదానియందనుకూలవిద్యుత్తు రెండవదానియందుప్రతికూలవిద్యుత్తు నుత్పన్నమవునని వాదించెను. ఆతఁ డొకబంగారునాణెమును వెండినాణెమునునాలుకపైనుంచి వాని నొకతీఁగతో ముట్టఁగా నాలుక చేదుగానవుననియు దానికికారణము విద్యుత్ప్రసారమే యనియు వక్కాణించెను.

ఇంతియకాక అతఁడు రాగిరేకును తుత్తినాగపు రేకును ఒకదానిపై నొకటి నుంచి వానిపైని తడిపిన కంబళిగుడ్డను వేసి దానిపై మఱల నారేకుల నమర్చి, కడపటికి మీఁదనున్న తుత్తినాగపు రేకును అడుగు రాగిరేకును నొక తీఁగతోఁ గట్టెను. అపుడు విద్యుత్ప్రవాహము (electric current) ఏర్పడి ఆతీఁగ ద్వారా ప్రసరించెను. ఇటీవలనే విద్యుత్ప్రవాహమును పుట్టించుట కనేకయంత్రములు కల్పింపఁబడెను.

ఈ ప్రావాహిక విద్యుద్ధర్మములును, దానికిని అయస్కాంత శక్తికినిగల సంబంధములును ఎర్ స్టెడ్, ఆంపేరీ, ఫేరడె మొదలగు వారనేక ప్రయోగములచే స్పష్టీకరించిరి. విద్యుత్పూరితమైన యొక తీఁగను, వ్రేలాడఁ గట్టఁబడిన యొక అయస్కాంతపు సూదిపై సమాంతరముగా నుంచినయెడల నది ఉత్తరాభిముఖమై యుండక, పూర్వపశ్చిమములకు తిరుగును. ఆతీఁగను తీసివేసినపుడా సూది తిరిగి యథాస్థానమును బొందును. ఈప్రయోగముచే విద్యుత్ప్రవాహమున నాసూదికి నయస్కాంతత్వ మబ్బుననియు నందుచే నది కదలుననియు "ఎర్ స్టెడు" (Oersted) అనువాఁడు నిర్దేశించెను. ఈధర్మము నుపయోగించి యేతీఁగయందైనను విద్యుత్ప్రవాహ మున్నదో లేదో కనుఁగొనుటయే కాక దాని బలమును గూడ నిర్ణయింప వచ్చును. అట్టి విద్యుత్పూరితయంత్రములనేకములు నేఁడు వాడుకలో నున్నవి. సమానాంతరములైన (Parallel)

తీఁగలయందు ఒకటే దిక్కునకు పోవుచున్న విద్యుత్ప్రవాహము లొకదాని నొకటి యాకర్షించుననియు, అవి యభిముఖముగా పోవునపుడు ఒకదాని నొకటి నిరాకరించుననియు, ఆంపేరను (Ampere) ఫ్రాంసుదేశీయుని సిద్ధాంతము.

మన మొక రాగితీఁగను గొట్టమువలెఁ జుట్టి, దానిని వ్రేలాడఁగట్టి, విద్యుత్ప్రవాహమును దాని ద్వారా పోనిచ్చితిమేని అది యుత్తరాభిముఖమై వ్రేలాడుటయే కాక ఇనుపముక్కను గూడ నాకర్షించును. ఆగొట్టమందు మన మొక యినుపముక్క నుంచినయెడల నది యొక అయస్కాంతమవును. విద్యుత్ప్రవాహ మాఁగిపోయినపుడెల్ల దాని అయస్కాంత శక్తిగూడ పోవును. ఈవిషయము నుపయోగించి మార్సు (Morse) అను నతఁడు దూరదేశములకు వార్తల నతివేగమున పంపుటకై తంత్రీ వార్తాయంత్రము (Telegraph) నొకదానిని కల్పించెను. ఈయంత్ర సామర్థ్య మెల్లరకు తెలిసినదియే గావున దానియుపయోగమును గూర్చి విస్తరింప లేదు. అయస్కాంతము విద్యుజ్జనకమగు నా యనునంశమును ఫారడెయను నాంగ్లేయుఁడు విమర్శించెను. ఆయన ఉంగరమువంటి యినుపముక్కను తీసి దానిలో సగమువఱకు నొక తీఁగను ఇంకొక సగమునకు వేఱొక తీఁగను చుట్టెను. అందొక తీఁగయొక్క చివరలు విద్యుత్సూచక యంత్రమునకును (Galvanometer) మఱియొక తీఁగ చివరలు విద్యుత్పాత్రమునకును (cell) తగుల్పఁగా నాయంత్రము విద్యుత్ప్రవాహమును సూచించెను. అటువలెనే మన మొక అయస్కాంతమును విద్యుత్సూచక యంత్రముతో సంబంధించియున్న యొక గొట్టమువంటి తీఁగచుట్టయం దుంచితిమేని ఆయంత్రమందున్న అయస్కాంతపు సూది ఉత్తరదిఙ్ముఖముగా నుండక ప్రక్కకు తిరుగును. మనమా అయస్కాంతమును తీఁగచుట్టనుండి వెలికిఁ దీసినపుడు ఆసూది మఱియొక ప్రక్కకుఁ దిరుగును. ఈప్రయోగములచేఁ జూడఁగా నయస్కాంతము తీఁగను సమీపించునపుడును దూరముగా పోవునపుడును ఆ తీఁగయందు విద్యుత్ప్రవాహము లుత్పన్నమవుననియు ఆప్రవాహము లొకదాని కొకటి యభిముఖములగుటచే సూది మొదటిపర్యాయ మొక దిక్కునకును, రెండవమాఱు మఱియొక దిక్కునకును తిరుగుచున్నదనియు తెలియుటకు సందియము లేదు. ఈయంశము తెలియుటచేఁ గలిగిన భాగ్యమింత యని వ్రాయఁజాలము. ఈ రహస్యము నుపయోగించియే అఖండ విద్యుత్ప్రవాహము నొసఁగుచున్న డైనమో యంత్రములును, తంత్రీవార్తాయంత్రములయందుండు సంజ్ఞ లక్కఱ లేకయే దూరమున

నుండి యొకరితో నొకరు మాటలాడుట కుపయోగపడుచున్న టెలిఫోను (Telephone) యంత్రములును కల్పింపఁబడెను. డైనమో యంత్ర జన్యమగు నఖండ విద్యుత్ప్రవాహముచే మోటారుబండ్లు నడిపించుటయు రాత్రివేళ దేదీప్యమానములైన గొప్ప దీపస్తంభముల మహాపట్టణములయందు నిర్మించుటయు సాధ్యమయ్యెను. సమీపమున నున్న తీఁగలలో నిట్టి విద్యుత్ప్రవాహమును పుట్టించు శక్తి అయస్కాంతములకే కాక మఱియొక తీఁగయందున్న విద్యుత్ప్రవాహమునకుఁ గూడఁ గలదని ఫారడెగారు ప్రకటించిరి. ఈమహనీయుఁడే అయస్కాంత శక్తికిని, విద్యుత్తునకును, వెలుతురునకును గల సంబంధమును గూర్చి యనేక ప్రయోగములు గూడ చేసెను. ఇతని ప్రయోగములచే ప్రేరితుఁడైన 'మేక్సివెల్" (Maxwell) అను నతఁడు విద్యుదయస్కాంత శక్తులు, కాంతివలె తరంగరూపమున ప్రసరించుచున్నవనియు, ఆతరంగముల వేగము కాంతివేగమునకు సమానమనియు, కాంతికి, విద్యుత్తునకు, అయస్కాంత శక్తికిని స్వభావమందు భేదము లేదనియు సిద్ధాంతము చేసెను. పిమ్మట హెర్జనువాఁడు అట్టి తరంగములు గలవని రుజువు చేసి వాని సాహాయ్యమున తంతి లేకయే వార్తలనంపవచ్చునని కనిపెట్టెను. ఇట్టి వార్తాయంత్రములచే సముద్ర మధ్యమున నున్నను మనకిష్టము వచ్చినచోటునకు వార్తలంపవచ్చును.

విద్యుత్ప్రవాహమును పుట్టించుటకు వాడఁబడుపాత్రలలో సాధారణముగా తుత్తినాగపు రేకులను, కార్బను పలకలను వాడుదురు. ఆరెండింటికిని రెండు రాగితీఁగలను గట్టుదురు. ఆతీఁగల చివరలు మంచి నీటియందుంచిన యెడల మార్పేమియుఁ గానరాదు. కాని దానికి గంధక ధృతి నొక చుక్కను కలిపినయెడల విద్యుత్ప్రవాహము ఆనీటి ద్వారా పోవుటచే నానీరు రసాయన వియోగమును (chemical decomposition) పొందును. అప్పు డందలి హైడ్రొజనువాయువు తుత్తినాగపు రేకునకు కట్టియున్న రాగితీఁగయొక్క చివర నుండి వెలువడును ఈ స్థలమునకు ప్రతి కూలాగ్రమని (cathode, negative pole) పేరు. ఆటువలెనే మనమారాగి తీఁగలను మైలతుత్తము కలిసిన నీటియందుంచితిమేని, దానియందున్న రాగి ప్రతికూలాగ్రమున కంటుకొనును. బంగారము వెండి మొదలుగాఁగల వస్తువులు కలిసిన నీటియం దీతీఁగల నుంచితిమేని ప్రతికూలాగ్రమునకుఁ గట్టిన వస్తువునందు బంగారునుగాని వెండినిగాని యీవిధ

మున పూఁత పూయవచ్చును. ఈప్రకారమనేక గిల్టువస్తువులు తయారు చేయఁబడి మన బజారుల నిండి యున్నవి.

విద్యుత్ప్రవాహ వశమున తీఁగల చివరలను సమకాలములో వెలువడిన యీవస్తువుల నన్నిటిని తూఁచినయెడల వాని రసాయన ప్రమాణములు (chemical equivalents) సమముగా నుండునని ఫేరడేగారు దృష్టపఱచిరి. అనఁగా 1 తులము హైడ్రోజను వాయువు నిచ్చు విద్యుత్ప్రవాహము మైలతుత్తము నుండి సుమారు 36 తులముల రాగిని, గోల్డుసైనైడను వస్తువునుండి సుమారు 66 తులముల బంగారమును వెలువడునటుల చేయునని యభిప్రాయము.

క్షారములు గలిసిన నీటియందు విద్యుత్ప్రవాహమునఁ గలుగు రాసాయనిక వ్యత్యాసములకు కారణమును అరీనియస్ (Arrehnius) అను నతఁడు సమర్థించెను. మనము మైలతుత్తమును నీటిలో కలిపినపుడు దానియణువులు విద్యుద్వాహకములయిన అయనులను (Ions) రెండు వస్తువులుగా విభజింపఁబడునని యు, విద్యుత్పాత్ర నుండి రాగి తీఁగలను ఆనీటిలోనికిఁ బోనిచ్చినపుడు, రాగి యొక్క అయనులు అనుకూల విద్యుత్తుగల వగుటచే ప్రతికూలాగ్రముచే నాకర్షింపఁబడి ఆయగ్రమును తట్టినపుడు విద్యుత్తును పోఁగొట్టుకొని దాని నంటుకొనుననియు నితని సిద్ధాంతముచేఁ దెలియుచున్నది. అటువలెనే క్షారమేదైనను నీటి యందు కరఁగినపుడు దాని యణువులు అయనులుగా మారును. ఆనీటియందు విద్యుత్ప్రవాహము పోయినపుడు అనుకూల విద్యుత్తుగల అయనులు ప్రతికూలాగ్రమునకును, ప్రతికూల విద్యుత్తుగలవి అనుకూలాగ్రమునకును ఆకర్షింపఁబడును. ఈ అయనుల గతి వేగము మొదలగు ధర్మములు పాటాక్ష్ మొదలగు వారిచే కనుఁగొనఁబడెను.

ఇఁక విద్యుచ్ఛక్తిని వాయువులయందు ప్రసరింపఁజేయుటచే ద్రవ్యమును (Matter) శక్తిని (Energy) గుఱించి మనకుఁ గలజ్ఞాన మెంతవిరివి చేయఁబడెనో చెప్పవలసి యున్నది. ఒక వైపున పూర్తిగా మూయఁబడి రెండవ వైపున చిన్న రంధ్రముగల గాజు గొట్టమును తీసి దాని రెండు చివరలందు ప్లాటినమను లోహపుఁ దీఁగలను చొప్పించి దానియందలి వాయువును సాధ్యమైనంతవఱకు పంపు సాహాయ్యమున తొలఁగించి గొట్టము లోనికి విద్యుచ్ఛక్తి (Electricity) పంపినయెడల నందు కిరణములుపుట్టి అనుకూలాగ్రము (anode) దగ్గఱ వెలుతురు కలుగును. గొట్టములో మధ్యభాగము వెలుతురు లేనిదిగా

నున్నను, కిరణములు గొట్టమును తాఁకిన చోటు భాస్వరమై(phosphorescent) యుండును. ఇట్టి భాస్వరత్వము గాజునుబట్టి వేఱు వేఱు రంగులు గలదియై యుండును. ఈ కిరణములు ప్రతి కూలాగ్ర (cathode) వినిర్గతములగుటచే ప్రతి కూలాగ్ర కిరణము లనఁబడును. వీనికి గాజునకేగాక మఱికొన్ని వస్తువులకుఁగూడ భాస్వరత్వ మిచ్చు శక్తి గలదు. ప్రతి కూలాగ్ర కిరణములు (cathode rays) లోహములను తెల్లగా కాల్చుటకు తగినంత వేడిమి నిచ్చును. ఇవి అయస్కాంతమువలన వ్యత్యస్తగమనము (deflection) గలవి యగును. వీని గతివేగము (velocity) వెలుతురుయొక్క గతి వేగములో పదియవ వంతు అనఁగా సెకండునకు 10000 మైళ్లు పోఁగలవు. కనుకనే యివి పలుచని లోహపు రేకులలో దూరఁబడి రెండవ ప్రక్కను వెళ్లుటకు తగిన శక్తి గలిగియుండును. పైని చెప్పిన గొట్టములు క్రూక్సు అనుపండితునిచే ప్రథమమున వాడఁబడినవి గావున క్రూక్సు గొట్టము లని (Crooke's tube) చెప్పఁబడుచున్నవి. ఈ గొట్టములలోఁ బుట్టు కిరణములు ప్రతికూలవిద్యుచ్ఛక్తిని (negative electricity) వహించి ప్రతికూలాగ్రమునుండి అత్యంత వేగముతో తఱుమఁబడు రేణువుల ప్రవాహము లని క్రూక్సు స్థిరపఱచెను. ఈ రేణువులు పరమాణువుల కన్న సూక్ష్మతరములు. వీనికి ఎలెక్ట్రానులు (electrons) అను పేరు పెట్టఁబడెను.

ప్రతి కూలాగ్ర కిరణముల స్వభావమును శాస్త్రజ్ఞులు తర్కించుచుండ, 1895 సంవత్సరమున జర్మానియాదేశీయుఁడగు రెంజను (Rontgen) అనునతఁడు క్రూక్సు గొట్టమునుండి ప్రసరించు ప్రకాశము(Radiation) బేరియముప్లాటినోసయనైడు అను సమస్తద్రవ్యముచే (Compound) నద్దఁబడినకాగితమును మెఱయునట్లుచేయునని కనిపెట్టెను. అట్టి ప్రకాశము ప్రతికూలాగ్ర కిరణములకు వేఱైన కిరణముల పుంజమైయుండెను. వీని స్వభావ మప్పుడు తెలియకపోవుటచే వీనికి ఎక్సుకిరణములని(x rays)లేక రెంజనుకిరణములని పేరుంపఁబడెను. ఈకిరణములు కాగితము, కఱ్ఱ, పలుచనిలోహపురేకులు, మాంసము మొదలగువానిని చొచ్చుకొనిపోఁగలవు. ఎముకల ద్వారాపోఁజాలవు. కనుక ఫొటోగ్రాపు అద్దమొకదానిపై చేతినుంచి దానిపై రెంజను కిరణములు ప్రసరించునట్లు చేసినయెడల అద్దముపై చేతియెముకలయొక్క బొమ్మమాత్రము గ్రహింపఁబడును. మాంసముబొమ్మయందుఁ గనఁబడదు. రెంజను కిరణముల సాహాయ్యమున ఫొటోగ్రాపువేసి శరీరమందుండు నెముకలస్థితిని, వానికిఁ గలసంబంధమును శరీరమును గోయకయే

కనుఁగొనవచ్చును. ఇందుచేత నీకిరణములను పుట్టించుయంత్రములు ఆసుపత్రుల యందుంపఁబడుచున్నవి. రెంజను కిరణములు, ప్రతికూలకోణకిరణములు గాజును గాని లోహపు రేకులనుగాని తాఁకినప్పుడు గలుగుభాస్వరత్వముతోఁ గూడఁబుట్టుచున్నవి. కనుక భాస్వంతములైన పదార్థములన్నియు నీకిరణములను కలుగఁజేయునను భ్రాంతి శాస్త్రజ్ఞులకుఁ గలిగెను. కొన్ని పదార్థములు సూర్యకాంతియందుంపఁబడి పిమ్మట చీఁకటిలోనికి తీసికొనిపోఁబడినను మెఱయుచుండును. ఇట్లుకలుగు ప్రకాశము భాస్వరత్వము(phosphorescence)అనిచెప్పవచ్చును. భాస్వరమైనపదార్థములిచ్చు ప్రకాశము కాంతినిరోధక (opaque)వస్తువులచే నాఁపివేయఁబడునా లేక దానియందలి యేభాగమైనను రెంజను కిరణములవలె వానిని చొచ్చుకొని పోఁగలవా? దీనిని నిర్ణయించుటకు బెకరలు అనువాఁడు 1896-వ సంవత్సరమున ఫొటోగ్రాపుఅద్దము నొకదానిని నల్లనికాగితపుసంచిలోనుంచి, సంచిపైభాస్వరమైన యొకపదార్థమునుబెట్టి సూర్యకాంతిలో నుంచెను. అదృష్టవశమున బెకరలుతీసికొనిన భాస్వరపదార్థము యురేనియము అనులోహము కలిగియుండెను. అప్పుడు రెంజను కిరణములవలె నల్లనికాగితమును చొచ్చుకొని పోఁగలకిరణములు బుట్టి ఫొటోగ్రాపుఅద్దమునందు మార్పును కలుగఁజేసెను. ఈకిరణములు గూడ పలుచని లోహపు రేకుల ద్వారాపోఁగలవని పిమ్మట కనుఁగొనఁబడెను. ఇట్టి ప్రయోగములను బెకరలు చేయుసమయమున నొకదినమున సూర్యకాంతి లేకపోవుటచే నతఁడు యురేనియము గల పదార్థమును ఫొటోగ్రాపుఅద్దమును నొకపెట్టెలో మూసివేసి కొన్ని వారములైనతరువాత పరీక్షింపఁగా నద్దమందు పూర్వమువలెనే మార్పుగానవచ్చెను. ఈమార్పును కలుగఁజేయుటకు సూర్యకాంతి జరూరులేదు. యురేనియము గలిగిన కొన్ని సమస్తద్రవ్యములు (compounds) భాస్వరమైనవిగాక పోయినను, పైనిచెప్పిన శక్తిని బొందియుండుటచే నట్టిశక్తి యురేనియములోహమునకు సహజమైనదని బెకరలు స్థిరపఱిచెను. ఈలోహమునుండి సహజముగా ప్రసరించు కిరణములకు బెకరలుకిరణము లనిపేరు. ఇవి రెంజను కిరణములను పోలియున్నను, వానికంటె బలహీనములయినవి.

ఇందువ్రాసిన యంశములు ప్రపంచమునకు తెలిసినపిమ్మట, పండితులు గొందఱు యురేనియమువలె స్వయంప్రకాశములైన (radio-active)యితరపదార్థములను కనుఁగొనుటకు ప్రయత్నించుచుండ 1898వ సంవత్సరమున ష్మిటు (Schmidt)అనువాఁడు థోరియము అనులోహమునకుఁగూడనాశక్తికలదని ప్రచు

ించెను. ఈలోహమును యురేనియమునుండి వెడలుకిరణములకంటెబలహీనములయిన కిరణముల నిచ్చుటయేకాక వాయువిశేషమైన యొకపదార్థమును (emanation) గూడనిచ్చును. మనము(Washington light) దీపములలో వాడుకొనుమాంటిలు (mantle) తోరియమునుండి యుత్పత్తియగు నొకసమస్తద్రవ్యము కలిగియుండును గనుక మాంటిలు నొకదానిని కత్తిరించి ఫొటొగ్రాపుఅద్దముపై పఱచి రెంటిని చీకటిలో కొన్ని దినములుంచి పరీక్షించిన నాయద్దమునందు మార్పుగలుగుటచే దానిపై మాంటిలు యొక్కబొమ్మయేర్పడునట్లు చేయవచ్చును. ఈనిదర్శనమును ఫొటొగ్రాపులు వేయఁగల వారెవ్వరైనను జూడవచ్చును.

పైనిచెప్పఁబడిన శక్తిగల పదార్థములన్నియు, యురేనియము, తోరియము అను లోహములు కలిగియున్నవనియు, యురేనియము కలిగిన ఖనిజములు, యురేనియముకంటె హెచ్చుగా నాశక్తిని పొందియున్నవనియు, కూరీ అను ఫ్రాన్సుదేశపుస్త్రీ కనుఁగొనెను. కనుక నిట్టిఖనిజములందు యురేనియముకంటె నెక్కుడుశక్తిగల యేదోయొక లోహముండవలెనని ఆమె యూహించి దానిని వ్యక్తపఱచుటకుఁగాను ఒక టన్ను భారముగలపిచిబ్లెండుఅను ఖనిజమును రసాయనశాస్త్రప్రక్రియలచే శుద్ధపఱచి వడ్లగింజకంటె మిక్కిలి తక్కువ యెత్తుగల రేడియముఅను క్రొత్తలోహమును తయారుచేసెను. ఈ రేడియము యురేనియముకంటె పదిలక్షల హెచ్చుస్వయంప్రకాశమైనది. ఒక ఔన్సు యెత్తుగల రేడియమును సంపాదించుటకు 150 టన్నులపిచిబ్లెండును శుద్ధిచేయవలెను. ఇందుకు వినియోగపఱుపవలసిన ధనము ప్రయాసము నెంతయో దానిఖరీదునుబట్టి యూహింపవచ్చును. అవున్సునకు వేలకొలఁదిరూపాయలు ధరకలదు. విశాస్త్రజ్ఞుని వద్దనైన నొకవడ్లగింజ యెత్తుగలరేడియము ఉన్నయెడల నతఁడెంతో యదృష్టశాలి యనవచ్చును. కూరీఅనునామెకు ఆస్ట్రియా దేశపుగవర్నమెంటువారును, ఆంగ్లేయదేశమందున్న రొసుచిల్డుఅను మహాజనులును ద్రవ్యసాహాయ్యమొసంగిరి. కనుక నామె 1½ వడ్లగింజ యెత్తుగల రేడియమును తయారు చేసికొని వాడుకచేయుచుండెను.

రేడియము మొదలగు స్వయంప్రకాశమైన పదార్థములు ప్రసరింపఁజేయు కిరణములు రెంజను కిరణములవలె నదృశ్యములు కనుకవీనిని పరీక్షించి కనుఁగొనుమార్గములు నాలుగుగలవు. మొదటిది సూర్యతేజస్సువలెనే యీకిరణములు ఫొటొగ్రాపు అద్దమునందుమార్పును కలుగఁజేయఁగలవని పైనిచెప్పఁబడియున్నది.

రెండవది, యివితమసమీపమందుంచు వస్తువులకు భాస్వరత్వమునిచ్చును. మూఁడవది, గాలి, యితరవాయువులు సామాన్యముగా విద్యుచ్ఛక్తిని తమద్వారా వ్యాపింప కుండునట్లు చేయును. కాని స్వయంప్రకాశముగల పదార్థములు వాని యందుంచినప్పుడు అవియట్టి యాటంకమును గలుగఁజేయవు. కనుక విద్యుత్తును వహించిన యేవస్తువైన నిట్టిపదార్థములను సమీపించునప్పుడు తనయందున్న విద్యుత్తును గోలుపోవును. పదార్థములస్వయంప్రకాశత నిర్దేశించుటకు నిదియే సులభము నమోఘమునైనమార్గము. ఈసాధనముచే నొకవడ్లగింజలో మూఁడు వందల కోట్లవంతు యెత్తుగలరేడియమును కనుఁగొనవచ్చును. నాలుగవది, రేడియము మొదలగు పదార్థములు, మండుచున్న బొగ్గుమొదలగువానివలె నుష్ణమునిచ్చును. ఇట్లు రేడియమునుండి ప్రతిగంటకు దానిసమానమైన యెత్తుగలమంచుముక్కను కరఁగించుటకు చాలినంత ఉష్ణమువచ్చును. కనుక రేడియము చుట్టునున్న వస్తువులకంటె హెచ్చువేడిగానుండును. ఇంకొక విశేషముగలదు. ఉష్ణమును వెలుతురున నేక విధముల నుత్పత్తిచేయవచ్చును. కాని రేడియము వానిని తగ్గ లేకుండ నవిచ్ఛిన్నముగా తానుమార్చును, క్షీణతనుపొందకనిరంతరమునిచ్చుచుండును. దీనిని బట్టిచూడస్వయంప్రకాశముగల పదార్థములు తమంతటతామే శక్తిని సృజించుచున్నట్లు కానవచ్చుచున్నది. అట్టిసర్గక్రియను మనమునిరోధించుటకుఁగాని యెట్లైన మార్చుటకుఁగాని వీలులేదు. ఈపదార్థములు, శక్తినిగురించి యీవ్యాసమునందు వ్రాయఁబడిన సిద్ధాంతములకులోఁబడక మనుష్యమాత్రుని బుద్ధిని తృణీకరించుచున్నట్లు కానవచ్చుచున్నది. అయినను పాశ్చాత్యపండితులు వ్యయప్రయాసాదులకు వెనుకదీయక వీనిని పరీక్షించుటచే నూతనశాస్త్రమొకటి యేర్పడి, జనులప్రతిభ విరివినొందుటయే కాక నవీనమార్గములు ప్రసరించుటకుఁ గారణమాయెను.

రేడియము, యురేనియము, థోరియము అను స్వయంప్రకాశములగు పదార్థములనుండి ప్రసరించుకిరణములు మూఁడువిధములు. వీనికి ఆల్ఫా, బీటా, గామా, కిరణములనిపేరు. వీనికి పదార్థములలోనికి చొరఁబడు శక్తియందు తారతమ్యముగలదు. ఆల్ఫాకిరణములు పలుచనికాగితములగుండ గాని మూఁడుఅంగుళముల మందముగానున్న వాయువులద్వారాగాని పోఁజాలవు. బీటాకిరణములు పలుచని అత్తడము, తగరపురేకులద్వారా పోఁగలవు. ఇట్లుచొచ్చుకొనుశక్తి వీనికి ఆల్ఫాకిరణములకంటె నూఱింతలు, గామాకిరణములకు, బీటావానికంటె

నూఱురెట్లు అధికముగా నీరశక్తిగలదు. ఇవియొక అడుగుదళసరియైన యినుపదు క్కద్వారాపోఁగలవు. కనుకనివినిమనుకలద్వారా గూడ నిరాటంకముగా పోఁగ లుగుటచే వీని సాహాయ్యమున, రెంజను కిరణముల సాహాయ్యముచేతను వలెనే వస్తువుల ఫొటొగ్రాపులు వేయుటకువీలులేదు. ఇవిబీటాకిరణములు ఘనపదార్థముల ను (solids) తాఁకినప్పుడు త్పత్తియైన బీటాకిరణములకు సహచరములై యున్నవి. వీనికిని రెంజను కిరణములకును స్వభావమునందు భేదములేదు.

స్వయంప్రకాశములైన పదార్థములను విద్యుత్తుగల వస్తువులు సమీపించునప్పుడు తమయందుఁ గల శక్తిని గోలుపోవునని పైని చెప్పఁబడియున్నది. అట్టినష్టము కలుగఁజేయునవి ఆల్ఫాకిరణములుగాని, బీటా, గామాకిరణములుగావు. కనుక ఆల్ఫాకిరణములకు తక్కినరెంటికంటెనుయొక్కువగతిశక్తి(Kinetic energy)గల దని తెలియుచున్నది. రేడియము గలిగిన సమస్త ద్రవ్యముయొక్క కణమును (Particle)దేనిపైనైనను వ్యాపింపఁ జేసినయెడల, ఆకణము అతిసూక్ష్మమై కంటికికానరాకుండను దానినుండి వెడలుకిరణములు, బీటా, గామాకిరణములతో మిశ్రముకాని ఆల్ఫాకిరణములై యుండును. ఆల్ఫాకిరణముల యభిఘాతముచేజింక్ సల్ఫయిడు(Zinc sulphide)అనుపదార్థము (ఇదితుత్తినాగము గంధకము, వీనిచే నేర్పడిన సమస్తద్రవ్యము.) భాస్వరమైమెఱుఁగుఁపురుగులవలె రశ్ములనిచ్చును. ఇట్లుఅభిఘాతము కలిగినప్పుడెల్ల ఒక్కొక్కరశ్మి వెలువడుచుండును. అట్లు వెలువడినరశ్మి సంఖ్యలెక్కించుటకు సాధ్యముగనుక అసంఖ్యానుబట్టి ఆల్ఫాకిరణములయందలి పరమాణువుల సంఖ్యనుగూడ లెక్కింపవచ్చును. ఈపరమాణు సంఖ్యను లెక్కించుటకు వేఱుసాధనములు గూడఁగలవు. ఇట్టిలెక్కలచే వడ్లగింజ యెత్తుగల రేడియమునుండి సెకండునకు వేయికోట్లపరమాణువులు నిర్గతములగుచున్నవని తెలియవచ్చును. పరమాణువుల భారమును, పరిమాణమును నిర్ణయించుటకుఁ గల సాధనములు ఇదివఱకే సూచింపఁబడినవిగాని పరమాణువులనుకనుఁగొనుటకు వీలుపడునని యిదివఱకు శాస్త్రజ్ఞులు స్వప్నావస్థయందైనను ఊహించియుండలేదు. అయినను ప్రస్తుతము రేడియమునుండి వెడలు పరమాణువులను ప్రత్యక్షముగా లెక్కించుట సులభముగదా! ఇందువలన పరమాణు సిద్ధాంతము దృఢపఱుపఁబడెననుటకు సందియములేదు.

ఆల్ఫాకిరణములు అనుకూల విద్యుత్తును వహించిన హీలియము అను వాయువుయొక్క పరమాణువుల సమూహమని విశదీకరింపఁబడెను. ఈ ఆల్ఫా

పరమాణువులు సెకండునకు 10000 మైళ్లవేగముతో రేడియమునుండి తఱుమఁబడుచున్నవి. కనుక వాని గతిశక్తి యెంతయో యూహింపవచ్చును. ఇందుచేతనే యివి పదార్థములను తాఁకినప్పుడు వానిపరమాణువుల ద్వారాపోవుటకు తగినంత శక్తిగలవి. రెండు పరమాణువులు ఏకకాలమందొక స్థలమునందుండ లేవనునంశము సామాన్యముగా నందఱికి తెలియవచ్చును. అయినను ఆల్ఫాపరమాణువులు తక్కిన పరమాణువులను చొచ్చుకొని పోఁగలుగుట యెంతవింతమైన సంగతి! ఈ విధమున చొచ్చుకొని వెళ్లినప్పుడు ఆల్ఫాకిరణములగతి వేగము సెకండునకు 5000 మైళ్లకన్న తక్కువయగును. అప్పుడు వీనిని మనము కనిపెట్టుటకు సాధనములు లేవు.

బీటాకిరణములు అయస్కాంతమును సమీపించినప్పుడు తిన్ననిమార్గమునఁ బోవును. ఈవిషయమున నివి విద్యుత్ప్రసారమువలె ప్రవర్తించుచుండును గనుక నివి రేడియమునుండి యుద్గారింపఁబడి విద్యుత్తును వహించిన సూక్ష్మతమ రేణువుల సమూహములని నిశ్చయింపవచ్చును. పైనిచెప్పఁబడిన క్రూక్సుగొట్టములనుండి వెలువడు ప్రతికూలాగ్రకిరణములకును, బీటాకిరణములకును స్వభావమునందు భేదమేమియు లేదు. రెండును ప్రతికూలవిద్యుత్తును వహించిన ఇలెక్ట్రానులు అనఁబడు సూక్ష్మతమ రేణువుల సమూహములే. బీటాకిరణములను కనిపెట్టక పూర్వమే సర్. జే జే. టామ్సను అనువాఁడు ఇలెక్ట్రానులయొక్క గతివేగమును, గరిమను (mass) అవి వహించు విద్యుదియత్తు (quantity)ను లెక్కించుటకు తగినమార్గములను తెలియఁజేసెను. క్రూక్సు గొట్టములో ప్రతికూలాగ్రము ఉద్గారించు ఇలెక్ట్రానులయొక్క గతివేగము సెకండునకు 5000 మొదలు 10000 మైళ్లు. రేడియము ఉద్గారించుబీటాకిరణముల ఇలెక్ట్రానులు సెకండునకు 170000 మైళ్ల వేగముగలవి. ఈగతివేగము సుమారు తేజస్సుయొక్కగతివేగమే. దీనినిబట్టి చూడ మనుష్యునిశక్తి యెంతయల్పమో స్పష్టమగుచున్నది. దృశ్యాదృశ్యమగు రేడియముసంబంధమైనకణము చేయుపనికన్న మనుష్యనిర్మితములగు బలవత్తమములైన యంత్రములు చేయుపని యెన్నిరెట్లు తక్కువగా నున్నది!

ప్రతికూలాగ్ర కిరణములయందలి (Cathode) బీటాకిరణములయందలి ఇలెక్ట్రానులు వహించు విద్యుదియత్తు హైడ్రొజనువాయువు యొక్కపరమాణువులు వహించు విద్యుదియత్తునంతయే. కనుక ఇలెక్ట్రానులు ప్రతికూలవిద్యుత్తుయొక్క అప్రత్యక్షమైన రేణువులని నిర్ణయింపఁబడెను. అనఁగా ఇలెక్ట్రానులు

ద్రవ్యసంయోగములేని కేవలశక్తిరూపములైన రేణువులు. అట్లయిన యెడల ద్రవ్యవిశేషములైన వస్తువులన్నిటియొక్క పరమాణువులనుండి ఇలెక్ట్రానులు వెడలుచుండును గనుక వస్తువులన్నియు, కేవలశక్తిరూపమైన రేణువులసమూహములనుటకు సంశయములేదు. కనుక ద్రవ్యమంతయు కాల్పనికము, శక్తియే సత్యము. ఇలెక్ట్రానులయొక్క గతి, గతిభేదమునకు వెలుతురును రెంజను కిరణములను, తంత్రిలేని టెలిగ్రాపులను కలుగఁజేయుచున్నది. వీనియొక్క గరిమ హైడ్రోజనువాయు పరమాణువుయొక్క గరిమలో 770 వంతు.

ఇతరవ్యస్తద్రవ్యముల పరమాణువులుగూడ ఇలెక్ట్రానులయొక్క వ్యూహములు గనుక భిన్నద్రవ్యములయొక్క పరమాణువులకుఁ గల భేదము వానియందుఁగల ఇలెక్ట్రానులయొక్క సంఖ్యను, అవి యుండురీతినిబట్టి కలుగుచున్నది. ద్రవ్యమునకు మూలములు ఇలెక్ట్రానులే అయియున్నవి. ఈ సిద్ధాంతమునకుమున్ను 1815-వ సంవత్సరమున ప్రౌటు అనువాఁడు వ్యస్తద్రవ్యముల పరమాణు భారములు భిన్నాంశ శేషములేని పూర్ణసంఖ్యలుగా నుండునని నమ్మియుండుటచే నీ ద్రవ్యముల పరమాణువులు హైడ్రోజను వాయువు పరమాణువుల వ్యూహములనియు హైడ్రోజను మూలద్రవ్యమనియు(Primary matter) నూహించెనుగాని దీనికితగిన ప్రమాణములేకపోయెను. 1876-వ సంవత్సరమున మెండలీవు అను రుష్యాదేశీయుఁడు వ్యస్తద్రవ్యములను వాని పరమాణు భారముల ననుసరించి వరుసగా వ్రాసినయెడల ద్రవ్యముల గుణములకుఁగల భేదాభేదములను సులభముగా కనుఁగొనవచ్చునని సమర్థించి, అప్పటికి తెలియని క్రొత్త వ్యస్తద్రవ్యము లుండవలెనని నిర్దేశించి, వీని గుణములను, పరమాణు భారములనుగూడ తెలియపఱచెను. ఇందు మూలమున రసాయనశాస్త్ర మెంతయో యభివృద్ధినొందెను. ఈన్యాయమువలన ద్రవ్యమునకు మూలమొకటి యుండవలెనని తెలియవచ్చెను. స్వయంప్రకాశమైన పదార్థముల జ్ఞానము అట్టి మూలము ఇలెక్ట్రాను అని స్ఫుటపఱుచుచున్నది.

మీఁదవ్రాయఁబడిన యంశములను బట్టి రేడియము మొదలగు స్వయంప్రకాశములైన పదార్థములకు శక్తివిశేషముగాఁ గలదని స్పష్టమగుచున్నది. ఈ శక్తి వానికి బయటనున్న వస్తువులనుండి కలుగలేదనియు, వాని పరమాణువులయందు బంధింపఁబడి వానికి మార్పుకలుగునప్పుడు పరమాణువులు భేద్యములగుటచే నాశక్తి వెలువడుచున్నదనియు, రుదెర్ఫరుడు, సాడీ అనువారు సమర్థించిరి. ఇందుకు నిదర్శనములుగలవు. మనము రేడియముగలిగిన సమస్త ద్రవ్య

మును నీటిలో కలిపినప్పుడు దాని స్వయంప్రకాశత్వము పోయి దానినుండి, ఆల్ఫాకిరణములు వెలువడుటచే స్వయంప్రకాశమైన ఇమనేషను అనువాయు విశేష ముత్పత్తియగును. ఇది 1895 వ సంవత్సరమున రామ్సే అనువతనిచే కనిపెట్టంబడిన ఆర్గాను మొదలగువాయువులనుపోలి వానివలెనుండు నొక వ్యస్త ద్రవ్యము. దీని పరమాణువులు విశేష భారముగలవి. ఇది యితరపదార్థములుగా నతివేగముగ మారుచున్నందున దీని స్వయంప్రకాశత్వము మాసమునదినములలో శూన్యమగును. రేడియము మొదటఁ గోలుపోయినశక్తి నిక్కొలఁదినములలో తిరిగి సంపాదించుకొని యథాప్రకారము ప్రకాశము నిచ్చుచుండును. దీనియందు మార్పులు మందముగా జరుగుచుండుటచే ఇమనేషనువలెకొలఁదిదినములలో నిది నష్టపడక పోయినను 2500 సంవత్సరములలో పూర్తిగా వినాశమును పొందునని లెక్కింపఁబడెను. అట్లైన, కొన్నిచోట్ల సంవత్సరములనుండి ప్రస్తుత స్థితిలో నున్న భూమియందు రేడియము మిగిలియుండుటకు కారణముగలదాయని విమర్శింపవలసియున్నది. భూమియందు రేడియము నుత్పత్తిచేయుపదార్థమొకటి దాని ననుసరించియుండి దానివలెనే ప్రతిక్షణము మార్పును పొందుచుండును. అయిన నీ పదార్థము రేడియమునకంటె పదిలక్షలు తక్కువ వేగముతో మార్పునొందును. కనుక దీని జీవితకాలము 800 కోట్ల సంవత్సరములని నిర్ణయింపఁబడెను. ఈపదార్థము స్వయంప్రకాశమైన యురేనియములను లోహము. ఇది వికారము పొందునప్పుడు మఱికొన్ని పదార్థము లుద్భవించి, యువిక్రమముగా రేడియముగా మారును. ఈ రేడియము తొమ్మిదిమార్పులను పొంది వివిధపదార్థముల నిచ్చును. వీనిలోనొకటి కూరీ అనుస్త్రీచే కనిపెట్టఁబడిన పొలోనియము అనుస్వయంప్రకాశమైన లోహముగా నిర్ణయింపఁబడెను. అత్యంత వికారము పొందునప్పుడు గలుగునది సీసమని శాస్త్రజ్ఞులు సందేహించుచున్నారు. ఇమనేషనునుండి యనఁగా రేడియమునుండి హీలియము అనువాయువు పుట్టునని నిశ్శంకముగా కనుఁగొనఁబడెను.

ఇట్లు స్వయంప్రకాశములైన పదార్థములయొక్క పరమాణువులు అంతర్గతశక్తిని గోలుపోయి భేద్యములగుటచే భిన్నపదార్థముల పరమాణువులుగా నేర్పడుచున్నవి. ఇదియే రసవాదము (Alchemy). ప్రాచీనులు క్షుద్రలోహములను సువర్ణముగా మార్చుట కనేకప్రయత్నములను జేసియుండిరి. నేటివఱకును అట్టి ప్రయత్నములు మన హిందూదేశమందు జరుగుచున్నవి. అనేకులు వందల

కొలఁది, వేలకొలఁదిధనమును బయిరాగుల మోసమునకు లోఁబడి కోలుపోవుట సామాన్యముగా తెలిసిన సంగతియే. అయినను ప్రాచీనుల నమ్మకమునకు నాధారములుండవచ్చునని రేడియము విషయమైన జ్ఞానము సూచించుచున్నది. కాని రేడియముపొందు మార్పులను మనము ప్రవేశపెట్టుటకుఁగాని నిరోధించుటకుఁగాని ప్రస్తుతము శక్యముగాదు. అట్లు శక్యమైనచో నొక వ్యస్తద్రవ్యమును మఱియొక వ్యస్తద్రవ్యముగా మార్చుటకేగాక పరమాణ్వంతర్గత శక్తిని మనయిచ్చవచ్చినట్లుపయోగించుకొనుటకుఁగూడ మనకు సులభము. అట్టిభాగ్యము ముందురాఁబోవు జనులకుఁ గలుగునుగాఁబోలు.

ఏచూరి. నరసింహము.

---

# రంజన కిరణములు.

## (Rontgen Rays.)

---

వివిధదేశీయుల చరిత్రములను జదివినవారందఱకును ఆయాదేశములు తమప్రాచీన దైన్యావస్థవదలి బాగుపడుటకు ప్రకృతిశాస్త్రాభివృద్ధియే కారణమని తోఁపక మానదు. పాశ్చాత్యుల నవనాగరికతకును, మితిమీఱిన యైశ్వర్యమునకును, ప్రకృతిశాస్త్రములే ముఖ్యకారణములు. ప్రకృతిశాస్త్రముల జ్ఞానము ఐహిక సౌఖ్యములకును ఐశ్వర్యమునకును నెట్లు కారణమగునని యడుగవచ్చును.

సృష్టియందలి రహస్యములను గ్రహించుటయే శాస్త్రజ్ఞులయొక్క ప్రథమోద్యమము. కాని సృష్టిమర్మముల గ్రహించుటమాత్రముతో వారు తృప్తిచెందరు. అట్టి సత్యాన్వేషణమువలన లభించిన జ్ఞానము దేశాభివృద్ధికిని ప్రజలయొక్క సౌఖ్యమునకును ఎట్లు ఉపయోగపడునాయని నిరంతర మాలోచించుచుందురు. ఈయంశమిూ దిగువనిచ్చిన రెండు ఉదాహరణములవలన స్పష్టము కాఁగలదు. కాఁగుబానపై మూఁతకదలుటనుబట్టి పదార్థములను చలింపఁజేయు శక్తి యావిరికిఁగలదని యొకఁడు కనిపెట్టెను. ఈ స్వల్పవిషయము నింతకు పూర్వమే యనేకులు కనిపెట్టియుందురు. కాని యీజ్ఞానమునుబట్టి యావిరియొక్క శక్తిని గ్రహించుకొని యావిరి యంత్రములను గనిపెట్టిన ప్రాజ్ఞుని యొక్క ప్రతిభావిశేషము మిక్కిలి యాశ్చర్యకరముగాదా? ధూమశకటములు, పొగయోడలు, అనేక విధములైన యావిరియంత్రములును మనుష్యున కెట్లు సేవ యొనర్చుచున్నవో మనకు తెలిసినయంశమే. వేయేల, పాశ్చాత్యుల యైశ్వర్యమునకంతకును ఆవిరియంత్రములే ముఖ్యకారణమన్న నతిశయోక్తి కానేరదు.

అట్లే బెంజమిన్ ఫ్రాంక్లిను గాలిపటము నెగురవేసి మెఱుపుతీఁగను భూమికిఁ దీసికొనిరావచ్చునని మొట్టమొదట కనిపెట్టినప్పుడా మహనీయుఁడు విద్యుత్ప్రభావమెట్టిదో యది మానవకోటి కెంతయుపయోగకరమగునో తెలిసికొనకయుండవచ్చును. కాని తంతివార్తలు విద్యుచ్ఛకటములు మెఱుపు దీపములును

వీనివలనిఫలమును ప్రస్తుతమనుభవించుచున్న మనలో నెవరామహానీయునకు కృతజ్ఞులుగానుండరు? ప్రకృతిశాస్త్రాభివృద్ధి వృత్తాంత మవశ్యము పఠనీయమైనది. ఈచారిత్రమునుండి యిట్టి దృష్టాంతము లనేకములు చూపవచ్చును. కాని గ్రంథవిస్తర భీతిచే నీవిషయమునింతట ముగించి యిటీవలఁగ్రొత్తగాఁ గనిపెట్టఁబడిన రంజనకిరణములు శాస్త్రజ్ఞానాభివృద్ధికిఁ దోడ్పడుటయేగాక మానవసేవ కెట్లు తోడ్పడినవో ఇంచుక విచారింతము.

విద్యుత్స్వభావమును దెలిసికొనుటకై 1890-వ సంవత్సర ప్రాంతముల శాస్త్రజ్ఞులనేకులు వివిధప్రయోగముల సలుపుచుండిరి. ఈ ప్రయోగములలో నీక్రింద (పటము. 1.) మొదటిపటములోఁ జూపఁబడిన గాజు బుడ్డి నుపయోగించు చుండిరి.

ఈపటములోఁ జూపఁబడిన గాజుపాత్ర నిరామయమైనది. అనఁగా నందులోని వాయువంతయు వెలుపలికిఁ దోఁడివేసి మూయఁబడినది. పాత్రలోపలఁ జూపఁబడి యెడమవైపుననున్న రేకును, కుడివైపున గిన్నెవలెనున్న వలయపు రేకును బంగారముకంటెను విలువగల "ప్లాటినమ్" అను ధాతువుతోఁ జేయఁబడినవి. గాజుపాత్రనుండి పైకి వెలువడు రాగితీఁగల మూలమున గాజుబుడ్డిలోనికి విద్యుత్ప్రవాహమును బంపవచ్చును. అట్లు పంపినప్పుడు గాజుబుడ్డి మెఱుపువలె తెల్లని కిరణములతోఁ గాక యించుక పసరువర్ణముగల కిరణపుంజముతో వెలుఁగుచుండును. ఇట్టిస్థితిలో నీగాజుబుడ్డిని ఒక సూక్ష్మదర్శినితోఁ బరీక్షించినయెడల నీకిరణపుంజములో నలుసులువలె నతిసూక్ష్మములై మిక్కిలి తేజోవంతములైన కణములు గాననగును. ఇవి గాజుబుడ్డిలోని ప్లాటినపు రేకు వైపు పరుగిడుచుండును. ఈసూక్ష్మతమము లయిన తేజోభాగములకే విద్యుత్కణములని (Elctrons) పేరిడిరి. ఈ విద్యుత్కణములయొక్క గతివేగము (Velocity of Motion) అత్యద్భుతము. నిముసమునకు రమారమి ముప్పదిలక్షల మైళ్లదూరము బోవుశక్తి వీనికిఁగలదని కనిపెట్టిరి. ఈవిద్యుత్కణములకింకొక యాశ్చర్యకరమైన శక్తియునుగలదు. మిణుఁగురు పురుగులవలె స్వయంప్రకాశములుగాని కొన్ని పదార్థముల నత్యంతప్రకాశముతో వెలిఁగింపఁజేయఁగలవు. "బేరియంప్లాటినోసైనైడు" (Barium platino cyanide) అను నొక మిశ్రద్రవ్యమును దళసరియైన యట్టపైఁ బూసి పైపటములోఁ జూపఁబడిన గాజుబుడ్డిప్రక్క తెరవలె నుంచినయెడల నదిమిణుఁగురు పురుగువలెనే ప్రకాశించు

చుండును. ఈ సంగతులన్నియు రంజన కిరణములఁ గనిపెట్టక పూర్వమే శాస్త్రజ్ఞులకుఁ దెలిసియుండెను.

1895 వ సంవత్సరమున నొకనాఁడు జర్మనీ దేశస్థుఁడగు రాంగెన్ (Rontgen) అనుశాస్త్రవేత్త ఈ ప్రయోగము నొకచీఁకటిగదిలో చేయుచుండెను. ఆసమయమున సూర్యకిరణము లెంతమాత్రము చొచ్చుటకు వీలులేకుండుటకై మొదటి పటములోఁ జూపిన గాజుపాత్ర నొక నల్లని పెట్టెలో నుంచి మూఁతవేసిన తరువాత విద్యుత్ప్రవాహమును యథాప్రకారముగా గాజు బుడ్డిలోని కంపెను. అప్పుడు గాజుబుడ్డి పెట్టెలో నున్నను పెట్టె వెలుపల బల్లపై నున్న ప్రకాశహీనమైన బేరియంప్లాటినో సైనైడు పూసిన అట్ట మిణుఁగురుపురుగువలె ప్రకాశింప నారంభించెను. ఇట్టి యపూర్వమైన సంగతికి రాంగెను విద్వాంసుఁడత్యద్భుతము చెంది పెట్టెను భేదించుకొని గాజుబుడ్డినుండి వెలువడి వచ్చిన కిరణపుంజము నాఁపుటకొరకు దళసరియైన దేవదారిపలక నడ్డము పెట్టెను. కాని యిది యడ్డము వేసినందువలన నేమియు భేదము కలుగలేదు. బల్లమీఁద నున్న యట్ట పూర్వమువలెనే వెలుఁగుచుండెను. ఇందున కాశ్చర్యపడి దేవదారి పలకకు బదులుగా నొక దళసరియైన పుస్తకము నుంచెను. అప్పటికిని ఆబల్లపైనున్న యట్టయేకరీతిగ ప్రకాశించుచుండెను. అంతట విస్మయుఁడై 'రాంగెను' కిరణపుంజమును తనచేతి నడ్డముపెట్టి యాఁపఁజూచెను. ఈపర్యాయము కిరణములు పూర్తిగనాఁగకపోయినను కొంతవఱకాఁపఁబడెను. కిరణములన్నియు చేతివలన నాఁపఁబడిన యెడల చేతియొక్క నీడ బల్లపైనున్న యట్టమీఁద నేర్పడియుండవలెను. అట్లుగాక హస్తముయొక్క అస్థిపంజరము మాత్రము ఆయట్టపై ఛాయగా నేర్పడెను. ఈ ప్రయోగమును బట్టి యీ నూతనకిరణములు సూర్యకిరణములవలెఁ గాక శరీరమందున్న రక్తమాంసాదులను భేదించి-పోఁగలవనియు ఎముకలను మాత్రమట్లు భేదించుటకు సాధ్యము గాదనియు స్పష్టమగుచున్నది.

ఈ యాపూర్వా నుభవమువలనఁ గలిగిన సంతోషముపట్టఁజాలక 'రాంగెను' తన నవీనపరిశ్రమలను ప్రకృతిశాస్త్ర ప్రపంచమునకు తక్షణమే వెల్లడిచేసెను. నాఁటినుండి శాస్త్రజ్ఞులీ నవీనజ్ఞానసంపత్తిని ప్రజాసంరక్షణమునకు ఉపయోగించు మార్గముల వెదక నారంభించిరి. ఈనూతన కిరణములతో కొందఱు ఛాయాపటముల నెత్తిరి. ఆఛాయాపటములలో మనుష్యుని నిజస్వరూప

ము పడుటకు బదులు వానియస్థిపంజరము మాత్రముపడును. ఈనవీన మార్గమువలన అనేకుల నకాలమృత్యువునుండి తొలఁగించుటకు సాధ్యమయ్యెను. ఇవి యెట్లుసాధ్యమగునో ఇందుతోఁ జేర్చిన రెండవపటమును జూచినయెడల గ్రహింపవచ్చును.

రెండవపటము:—యుద్ధరంగములో నీఛాయాపటముల నెత్తుట మిక్కిలి యుపకారిగానుండును. రణరంగమునతుపాకిదెబ్బతగిలినవెంటనే ఛాయాపటమును దీసినయెడల నాతుపాకిగుండు శరీరములో నెక్కడఁ గ్రుచ్చుకొనినది తెలిసి వెంటనే శస్త్రముచేసి తీసివేయుట కవకాశముండును. ప్రస్తుతము యుద్ధములలోను వైద్యశాలలయందును, ఈనూతన కిరణములతో ఛాయాపటముల నెత్తుసాధనములున్నవి. ఈనూతనకిరణములకే రంజనకిరణములని పేరు. మొదటి పటములో సమరేఖలుగాఁ గనుపడుచినవి యీరంజనకిరణములే. సూర్యకిరణముల నాఁపఁగల యనేక పదార్థము లీరంజన కిరణముల నాఁపలేవు. కొయ్యలు, ఇనుము, సీసము, అల్యూమినియము మున్నగు ధాతువులు రంజనకిరణములనాఁపంజాలవు. సూర్యకిరణములకు గాజుపదార్థము లెంత నిర్మలములో రంజనకిరణములకీపదార్థములంత నిర్మలములైయుండును. రంజన కిరణములు విద్యుత్కణ సముదాయమని శాస్త్రజ్ఞులు సప్రమాణముగ సిద్ధాంతము చేసిరి.

వేమూరి విశ్వనాథశర్మ.

---



రంజనకిరణములచే నెత్తిన ఛాయాపటము.

(139-వ పుట కెదురుగ)

# గుణగవిజయాదిత్యుని ఉరుటూరుశాసనము.



ఈశాసనము కృష్ణాజిల్లా, నూజివీడు తాలూకాలోని ఉరుటూరు గ్రామమునందు మలిపెద్ది అక్కయ్య పెరఁటిలో నీనడుమ మట్టిత్రవ్వుచుండఁగా బయలుదేరినదఁట. నామిత్రులగు వేమవరపు రామదాసుపంతులుగారి మూలమున నాకు లభించినది.

ఈశాసనమయిదు రాగిరేకులమీఁద చెక్కఁబడియున్నది. మొదటిరేకుమీఁదను, అయిదవరేకుమీఁదను లోపలిప్రక్కను మాత్రమే యక్షరములు గలవు. పత్రముల పరిమాణము 9¼ అంగుళములు పొడవు, 3¾ అంగుళములు వెడలుపు. రేకులకు నాలుగువైపులను జవయున్నది. పుటకు 7 పఙ్క్తుల చొప్పున 56 పఙ్క్తులు గలవు. అక్షరములు స్ఫుటముగానే యున్నవి కాని త్రుప్పు పట్టుటచేఁ గొన్ని కొన్ని యక్షరములు విశదముగాఁ దెలియకున్నవి.

<u>లిపి</u> ఈశాసనపులిపి రాజరాజునందంపూఁడి శాసనము యొక్క పూర్వభాగములిపిని[1] బోలియున్నది. దీనిని ప్రాక్చాళుక్యలిపియని తఱచుగ వాడుదురు. ఈలిపియందుఁగలిగిన మాఱుపు నందంపూఁడి శాసనమువలన వ్యక్తమగుచున్నది. ఆశాసనమునకుఁ బిదపఁ బుట్టినచాళుక్య శాసనములందు రెండవలిపియే కానవచ్చుచున్నది. కావునఁ బూర్వలిపితో వ్రాసిన శాసనములలో నందంపూఁడి శాసనమే చిట్టచివరది యని చెప్పనొప్పును.

<u>భాష</u>:—గ్రామనామములు తప్ప తక్కిన శాసనమంతయు సంస్కృతభాషయందే రచింపఁబడినది. పద్యములు 14 ఉన్నవి. మిగిలిన భాగమంతయు గద్యము. దోషములచ్చటచ్చటఁ గలవు. అవి మూలమును బరిష్కరించునప్పు డాయాతావులందుఁ జూపఁబడును.

కవి శబ్దాలంకారప్రియుఁడు. ఈక్రింది యుదాహరణములంబట్టి యీకవికి బాణుని కాదంబరియం దధికగౌరవము కలదని తెలియఁదగును.

---

(1). ఆ. సా. ప. పత్రిక. సంచిక1. పుట 46.

| శాసనము. | కాదంబరి. |
| --- | --- |
| 1. వైనతేయ ఇవ వినతానన్ద జననః. | 1. వైనతేయఇవ వినతానన్ద జనః.[2] |
| 2. అనేక ధనుష్మత్సహాయోపృక్షిత నిశాతతరవారి సనాథకరైక సహాయః. | 2. అనంత గజతురగసాధన మపిఖడ్గ మాత్ర సహాయమ్.[3] |
| 3. లక్ష్మీప్రియోఽపి కువధూప్రియః. | 3. కుపతిమపి కలత్ర వల్లభమ్.[4] |
| 4. ఉమాయాఇవ శరవణ భవోఽప్రతిహతశక్తిః. | 4. గుహాఇవాప్రతి హతశక్తిః.[5] |

ఆనాఁటి శాసనకావ్యకర్తలనేకు లీమార్గమునే యనుసరించినారు.

బాణుఁడు 7-వ క్రైస్తవ శతాబ్ద పూర్వార్ధమునందు రాజ్యము చేసిన హర్షవర్ధనుని యాస్థాన కవియగుటచేత ఈశాసనము పుట్టుటకు 200 సంవత్సరములు ముందు వాఁడని యేర్పడుచున్నది. గుణగవిజయాదిత్యుని నాఁటి శాసనము లేవియు నిదివఱకుఁ బ్రకటింపఁబడి యుండలేదు. గతసంవత్సరము గుంటూరిలో నసంపూర్ణశాసనమొక్కటి శాసనాధికారులకు (Government Epigraphist) దొరకినదఁట.

<u>కథాసంగ్రహము:</u>—శ్రీమదిత్యాది నానాగుణ విశేషణ విశిష్టమగు చాళుక్యకులము నలంకరించిన సత్యాశ్రయవల్లభేంద్రుని తమ్ముఁడు (1) కుబ్జవిష్ణువర్ధనుఁడు 18 సంవత్సరములు రాజ్యముచేసెను. అతని కొడుకు (2) జయసింహవల్లభుఁడు 33 సంవత్సరములును, అతని తమ్ముఁడు ఇంద్ర భట్టారకుని కొడుకు (3) విష్ణురాజు 9 సంవత్సరములును, అతనికొడుకు (4) మంగియువరాజు 25 సంవత్సరములును, అతనికొడుకు సకలలోకాశ్రయుఁడగు (5) జయసింహావల్లభుఁడు 13 సంవత్సరములును, అతనితమ్ముఁడు ద్వైమాతురుఁడను (6) కొక్కిలి 6 మాసములును, అతనియన్న (7) విష్ణువర్ధనుఁడు 37 సంవత్సరములును, అతని కొడుకు (8) విజయాదిత్యుఁడు 19 సంవత్సరములును, అతనికొడుకు (9) విష్ణువర్ధనుఁడు 36 సంవత్సరములును, అతని ప్రియతనయుఁడు చాళుక్యార్జున భూపాలుఁడను బిరుదముగల (10) నరేంద్ర మృగరాజ విజయాదిత్యుఁడు నూటయొని

(2). బొంబాయిలో నిర్ణయసాగర ముద్రణయంత్రమందు 1896-వ సంవత్సమందచ్చుపడిన నాగరప్రతిలో పు. 10.

(3) అదే. పుట 20. (4) అదే పు. 20. (5) అదే పు. 8.

మీఁది యుద్ధములుచేసి జయమునొంది యాయుద్ధములలో ననేకులఁ జంపిన పాపమును పోఁగొట్టుకొనుటకై తనపేర ననాటయెనిమిది శివాలయములను, సత్రములను, మఱియు అగ్రహారములు, తటాకములు, ఆరామములు, ఉపవనములు ఇత్యాది ధర్మములను వేఁగిదేశమందంతటఁ బ్రతిష్ఠించి 41 సంవత్సరములును, అతని కొడుకు (11) కలివిట్టారుఁడు (కలివిష్ణువర్ధనుఁడు) 20 మాసములును వేఁగిమండలము నేలిరి. కలివిష్ణువర్ధనునకు శీలమహాదేవి యను ధర్మపత్నియందుఁ గలిగిన జ్యేష్ఠపుత్రుఁడు (12) గుణగవిజయాదిత్యుఁడు గుద్రహారదేశమునందలి ఉఱువుటూరను గ్రామమును 14 రు బ్రాహ్మణులకు సర్వమాన్యాగ్రహారముగా నిచ్చెను. ఈధర్మమున కెవ్వరును బాధకలుగఁ జేయఁగూడదు. చేసినవారు పంచమహాపాతకములు చేసిన ఫలమును బొందుదురు.

ఈధర్మమునకాజ్ఞప్తి గుణగవిజయాదిత్య పాదపద్మోపజీవియగు పండరంగుఁడు. శాసనము చెక్కినది విజయవాడయందుండెడి విజయాచార్యుఁడు.

<u>కథావిమర్శనము:</u>— ఈశాసనమందుఁ బూర్వచాళుక్య వంశావతారము తద్వంశకర్తయగు కుబ్జవిష్ణువర్ధనుఁడాదిగా వర్ణింపఁబడినది. నందంపూఁడి శాసనములోనున్న తత్పూర్వ వృత్తాంత మిందు లేదు. ఆయారాజుల రాజ్యకాల పరిమాణ విషయములో నందంపూఁడి శాసనమునకు నీశాసనమునకును గొంత భేదము కలదు. (2) జయసింహవల్లభుని కొడుకు ఇంద్రభట్టారకుఁడను ఇంద్రరాజు 7 దినములు రాజ్యము చేసిన సంగతి యీశాసనమందు లేదు. నందంపూఁడి శాసనములో నరేంద్రమృగరాజు తాత (8) విజయాదిత్యుఁడు 18 వర్షములును, (10) నరేంద్రమృగరాజు 48 వర్షములును, (11) కలివిష్ణువర్ధనుఁడు 18 మాసములును భూపాలన మొనరించినట్లున్నది. ప్రస్తుతశాసనమందు వారు క్రమముగా 19 సంవత్సరములు, 41 సంవత్సరములు, 20 మాసములును రాజ్యము చేసినట్లు చెప్పఁబడియున్నది. నరేంద్రమృగరాజు 40 సంవత్సరములు రాజ్యము చేసినట్లు కొన్ని శాసనములందును, 44 సంవత్సరములుచేసి నట్లొక శాసనమందును వ్రాయఁబడియున్నది. కాని యనేక శాసనములందు 48 సంవత్సరములనియే యున్నది. (ద. హి. శా. సం. 1, పు. 37.) మంగి యువరాజునకు జయసింహవల్లభుఁడు, విష్ణువర్ధనుఁడు, కొక్కిలి యను ముగ్గురు కొడుకులుండి వారిలో నగ్రజుఁడగు జయసింహవల్లభుని యనంతరము రెండవవాఁడగు విష్ణువర్ధనుఁడు రాజు కావలసియుండఁగా నెట్టులో యాతని దాఁటి కొక్కిలి రాజైనట్లును

ఆఱుమాసములలో నాతని జయించి విష్ణువర్ధనుఁడు దేశమును స్వాధీనముచేసి కొన్నట్లును నందంపూఁడి శాసనమువలనఁ దెలియుచున్నది.

నరేంద్రమృగరాజు 108 యుద్ధములుచేసి గెలిచి యనేక ధర్మకార్యములుచేసిన ట్లాతనికిటీవలివాఁడగు అమ్మరాజునాఁటి శాసనమం దొకదానియందును మఱి కొన్ని శాసనములందును గూడఁ గలదు. (ద. హి. శా. సం.1. పు.36.) నరేంద్రమృగరాజు 12 సంవత్సరములు గంగదేశరాజుల తోడను, రాష్ట్రకూటాధిపతులతోడను బోరి గెలిచినట్లమ్మరాజు శాసనములోని యీ క్రింది శ్లోకముల వలనఁ దెలియుచున్నది.

" గంగరట్ట (6) బలైస్సార్ధమ్ ద్వాదశాబ్దానహర్ని

శమ్ । భుజార్జితబలం ఖడ్గసహాయోనయ విక్రమైః॥ అష్టోత్తరంయుద్ధశతం యుద్ధ్వాశంభోర్మహాలయాన్ । తత్సంఖ్యయాఽకరోద్వీరో విజయాదిత్య భూపతిః॥"

రాష్ట్రకూటగంగరాజులు కర్నాటులు. ఈకర్నాటులతోఁ బోరాటము నరేంద్రుని కాలమునందు మాత్రమేకాక గుణగవిజయాదిత్యుని కాలమునందును, చాళుక్య భీముని కాలమందుఁగూడ నుండినట్లు శాసనాంతరముల వలనఁ దెలియుచున్నది. గుణగుని తల్లియగు శీలక్క యను శీలమహాదేవి రాష్ట్రకూట రాజగు నింద్రభట్టారకుని కూఁతురు. గుణగవిజయాదిత్యునకు "పరచక్రరాముఁడను" బిరుదముగలదు. (నెల్లూరిశాసనములు సం. 1. పు. 164)

<u>కాలనిర్ణయము:</u>—శాసనోక్తదానము ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమునఁ జేయఁబడినట్లు మాత్రము తెలియుచున్నది కాని యది యేసంవత్సరమందో తెలిసికొనఁదగిన యాధారములు లేవు. గుణగవిజయాదిత్యుఁడు 766-వశకాబ్దము మొదలు 810యవ శకాబ్దమువఱకు రాజ్యముచేసి యున్నట్లు విద్వాన్ [డాక్టరు] హుల్ష్గారి సిద్ధాంతము. (ద. హి. శా; సం. పు. 38.) ప్రస్తుతశాసన మీకాలమధ్యభాగమునందుఁబుట్టి యుండునని యూహించిన యెడల 788-వ శకాబ్ద ప్రాంతమునఁబుట్టి యుండి యిప్పటికి 1046 సంవత్సరముల నాఁటిదై యుండును.

<u>స్థలనిర్దేశము:</u>—ఉఱువుటూరు గుద్రహార విషయమునందున్నట్లు చెప్పఁబడినది.

---

(6) రాష్ట్రకూట

ఈదేశమునకు గుద్రవార,[7] గుద్రావార,[8] గుద్రార[9] యను మాఱుపేళ్లితరశాసనములందుఁ గనఁబడుచున్నవి. ఈశాసనములన్నియు ప్రస్తుతము కృష్ణా జిల్లాలోని గుడివాడ గ్రామమునకు సమీపదేశమందున్న గ్రామములకు సంబంధించిన వగుటంబట్టి యీపేళ్లన్నియు గుడివాడ శబ్దమునకుఁ బూర్వరూపములని యూహింపవచ్చును. ఉఱుపుటూరి నిప్పుడు ఉరుటూరందురు. దాని సమీపపు హద్దగు పబఱ్ఱునకు వర్తమాననామము పామఱ్ఱు. పెల్చాలాసను నది యిప్పటి పెడసనగల్లు. కుఱుమద్దవల్లి నిప్పుడు కుఱుమద్దాలియందురు. కోప్పేడి యుండ వలసినచోట నిప్పుడు ఐనంపూడి యను గ్రామముకలదు. ప్రతిగ్రహీతల వాసస్థలములలోఁ గొన్ని గుడివాడ సమీపదేశమందును మఱికొన్ని బాపట్ల సమీప దేశమందును గలవు. విజయవాడ యనునది బెజవాడయని నిశ్చయింప వచ్చును.

గుణగవిజయాదిత్యునకు పాండురంగుఁడను మంత్రియున్నట్లు నెల్లూరి శాసనములు కొన్నిటివలనఁ గూడఁ దెలియవచ్చుచున్నది. గ్రంథవిస్తరమగునని ప్రతిగ్రహీతల గోత్రనామాదులెత్తి యిచట వ్రాయలేదు. మూలము 31-41 పఙ్క్తులుచూచునది. జయంతి రామయ్య.

---

## రాజరాజు నందంపూఁడి శాసనము.

దానార్ణవుని యనంతర మిరువదియేడేండ్లు వేఁగీదేశమనాయక మయిన దను విషయముంగూర్చి చర్చించుచు "చోళరాజు లీకాలమున వేంగీదేశము నాక్రమించుకొనియున్నట్లు చోళచరిత్రమును దెలుపు కొన్ని పుస్తకములలో నున్నది." యని పరిషత్పత్రిక ప్రథమసంచికలో నే వ్రాసియుంటిని. చోళులు వేంగీదేశము నాక్రమించినది విమలాదిత్యునిరాజ్యకాలమందుఁ గాని యంతకుఁ బూర్వము కాదని యశఃకాయులగు రాయబహద్దరు వి. వెంకయ్యగారిదివరలో నిర్ణయించి యున్నారు. కాఁబట్టి యనాయకత్వమునకుఁ గారణము వేఱొకటిగా నుండవలెను.

ఈ శాసనమూలమునం దీక్రిందఁ గనఁబఱిచిన సవరణలఁ జేయునది.

55 వ పుటయడుగున "3 వరస్సత్రియోగ" అనుటకు బదులు "3 వరస్సత్రియాగ" అని చదువునది.

58 వ పుటలో 37 వ పఙ్క్తిలో "పంచవింశతిః" అనుటకు బదులు "పంచవింశతి" అని చదువునది. జ. రా.

---

(7) ద. హి. శా. సం. 1. పు 46. (8) ఇండియన్ ఆంటిక్వెరీ. సం. 8. పు 76.
(9) ఎపిగ్రాఫియా ఇండికా. సం. 4. పు 34.

# గుణగవిజయాదిత్యుని ఉరుటూరు శాసనము.

## మూలము.

---

### ప్రథమపత్రము.

స్వస్తిశ్రీమతాం సకలభువనసంస్తూయమాన మానవ్యసగోత్రాణాం
హారీతిపుత్రాణాం

2. కౌశికవరప్రసాద లబ్ధరాజ్యానాం మాతృగణపరిపాలితానాం స్వామి
మహాసేనపాదా

3. నుధ్యాతానాం భగవన్నారాయణ ప్రసాద సమాసాదిత వరవరాహలా
ఞ్ఛనేక్షణక్షణవశీ

4. కృతారాతిమణ్డలానా(ం) అశ్వమేధావభృథస్నానపవిత్రీకృతవపుషా (ం)
చాళుక్యా

5. నాంకులమల(ం)కరిష్ణోః సత్యాశ్రయవల్లభేన్ద్రస్యభ్రాతా కుబ్జవిష్ణువర్ధ
నః అష్టాదశవర్షాణి

6. తస్యసూనుః జయసింహవల్లభః త్రయస్త్రింశద్వర్షాణి తస్యానుజస్య
ఇన్ద్రభట్టారకస్య ప్రియ

7. తనయః విష్ణురాజః నవవర్షాణి తస్యాత్మజః మంగియువరాజః పఞ్చవిం
శతి వర్షాణి తస్యసుతః

---

### రెండవ పత్రము, మొదటి పుట.

8. సకలలోకాశ్రయః జయసింహవల్లభః త్రయోదశవర్షాణి తస్యానుజః
ద్వైమాతుర(ఃకో)

9. క్కిలిః షణ్మాసాన్ తస్యాగ్రజః విష్ణువర్ధనః సప్తత్రింశద్వర్షాణి తస్య
పుత్రః విజయాదిత్య(ః)

10. ఏకోనవింశతి వర్షాణి తస్యసూనుః విష్ణువర్ధనః షట్త్రింశద్వర్షాణి
తస్యప్రియతనయః వి

11. (జయా)దిత్యః । అష్టోత్తరయుః ద్ధశతం[1] జిత్వాలబ్ధయశోజయః । చాళు
క్యార్జునభూపాలో

12. రాజాచాళుక్యవంశజః॥ ౧॥ నరేన్ద్రమృగరాజ శ్రీవిజయాదిత్యభూపతిః ।
త్యాగిశో[2] గి + + +[3]

13. గినిత్యంసత్యాశ్రయాన్వయః॥ ౨॥ అష్టోత్తరయుద్ధాశతః[4] యుద్ధ్వాలత్వా
పనుత్తయే । తత్ర(ద్యుద్ధ)

14. ప్రదేశేషు వేంగిదేశేసమన్తతః ॥ 3 ॥ అగ్రహారప్రపారామ తటాకోప
వనాని (చ। న)

---

రెండవ పత్రము, రెండవ పుట.

15. రేన్ద్రే[5] శ్వరనామాని సేశ్వరాయతనానిచ॥ ౪॥ సనృత్తగీత సత్రాణి
చాష్టోత్తర శతానియః॥ కృ

16. తవాన్సదాభాతి భూతలే ఖ్యాతసాహసః॥ ౫॥ ఏకచత్వారింశద్వర్షాణి
తస్యసుతః కలివి

17. ష్ణారనామా వింశతిమాసాన్ వేగీమణ్డల మన్వపాలయత్ తస్యజ్యేష్ఠో[6]
విజయాదిత్యః దినకర

18. ఇవ పద్మానన్దకరః వేనతేయ[7] ఇవ వినతానన్దజననః అనేక ధనుష్మత్సహ

19. యోప్యక్షాత నిశాతతరవాణసనాథకరైక సహాయః రామఇవ సీతానన్ద
కరః యుధిష్ఠిర

20. ఇవ భీమార్జునయశోధికః చన్ద్రఇవ సన్మార్గణయాయీ కలాధరోప్యదో
షాకరః ల(క్ష్మీ)

21. ప్రియోపి కువధూప్రియః ఆయతిమాపి[8] సువృత్తః మాతంగప్రియోపి
శుద్ధచరితః + + +

---

(1) అష్టోత్తరం యుద్ధశతం.

(2) భో? (3) ఇక్కడి యక్షరములస్పష్టముగా నున్నవి.

(4) అష్టోత్తరం యుద్ధశతం. (5) న్ద్రే. (6) జ్యేష్ఠతనయః. (7) వైనతేయ.

(8) ఆయతిమానపి.

మూడవ పత్రము, మొదటి పుట.

22. ష్య(   )హాంసగ్రహాః [9] యస్యచమాతా రాష్ట్రకూటాధిపస్యేన్ద్ర భట్టా
రకస్య హిమతో [10] భవా

23. నీవపితు(ః)భూధరమాన్యాతాం [11] జనయన్తి జలధేల్లక్ష్మీరివ జనకాత్సే
తేవశీలాదిగుణాన్విత

24. తావ్యచ్ఛిలకేత్యన్వర్థన వత్యజ [12] తస్యాః ఉమాయా ఇవ శరవణ భవో
ప్రతిహతశక్తి (ర్ధ) [13] త

25. ను(స)మధృతానేక తులాభారదానధారా ప్రక్షాళితకల్మషః స్వవిక్రమ
న్యకృత్తా [14] నే

26. కవక్రారాతి చక్రవిక్రమః। భద్రఘుటకల్పపాదప చిన్తామణికామధేనుషు
గతాసు జీవన్తి

27. + నా [15] కిథమితి దిత్సురివా భూత్సభువన కన్దర్పః॥ ౬॥ బలిశిబిదధీచి
కర్ణ్నా [16] గుప్తష్వేతే పృథ

28. గ్గతాస్త్యాగే యాచకజనభాగ్య వశాత్సఘు[17] స్తేషామివా భవద్గుణగః
॥౭॥ యస్యవిజేతుశ్చ

---

మూడవపత్రము, రెండవపుట.

29 + పఞ్చమహాశబ్ద సంహతిస్వానతి పురాః పరనృపకాకరి విదాణ దరసకా
కేసరి [18]

30. శ్రీవిజయాదిత్య మహారాజః గుద్రహారవిషయేః [19] రాష్ట్రకూట ప్రము
ఖాకా న్కు [20] టుంబినః సర్వాని

31. త్థమా జ్ఞాపయతి। విదితమస్తువోస్మాభిః వంగిపఱ్ఱు వాస్తవ్యాయ కుణ్డిన
గోత్రాయ కన్దడి

32. శర్మణే ఏకోంశః ఉప్పుటూరు వాస్తవ్యాయ కశ్యపగోత్రాయ ఖుద్ధ
శర్మణే ఏకోం

---

(9) ఈభాగము స్పష్టముగాలేదు. (10) హిమవతో.

(11) మాన్యతాం. (12) శేత్యన్వర్థనవత్యజని. (13) స్వ.

(14) న్యక్కృతా. (15) జనాః. (16) కర్ణ్నాః. (17) వశాత్సంఘు. (18) ఈ భాగ మస్పష్టము. (19) యే. (20) ఖాన్కు.

33. శః కారఇఞ్చేడు వాస్తవ్యాయ కుణ్డిన గోత్రాయ చమున శర్మణే ఏకోం
శః ఇన్గణ్టివాస్తవ్యా
34. య కుణ్డిన గోత్రాయ గనేశ్వర[21] శర్మణే ఏకోంశః ఇన్గణ్టివాస్తవ్యా
య కుత్సగోత్రాయ రుద్ర
35. శర్మణే ఏకోంశః ఉప్పుటూరు వాస్తవ్యాయ భారద్వాజ[22] గోత్రాయ
నన్దిశర్మణే ఏకోంశః వ

---

నాలుగవపత్రము, మొదటిపుట.

36. ంగిపఱ్ఱు వాస్తవ్యాయ గోతమగోత్రాయ గోవిన్దశర్మణే ఏకోంశః కార
ఇఞ్చేడు వాస్తవ్యా
37. య కౌశిక [23] గోత్రాయ కేశవశర్మణే ఏకోంశః కుఱ్ఱూరువాస్తవ్యా
య కుణ్డిన గోత్రాయ (శి) వ్వ
38. శర్మణే ఏకోంశః కారఇఞ్చేడు వాస్తవ్యాయ భారద్వాజ[24] గోత్రాయ
ఈశ్వర శర్మణే ఏకోంశః కార
39. ఇఞ్చేడువాస్తవ్యాయ హారితగోత్రాయ భీమశర్మణే ఏకోంశః క్రోవ
శిరి వాస్తవ్యాయ
40. కుణ్డినగోత్రాయ ద్రోణశర్మణే ఏకోంశః వంగిపఱ్ఱు వాస్తవ్యాయ వత్స
గోత్రాయ నారాయ
41. న[25] శర్మణే ఏకోంశః క్రాంజవాస్తవ్యాయ కుణ్డినగోత్రాయ శివ్వ
శర్మణే ఏకోంశః ఏతేద్వాదశ[26]
42. బ్రాహ్మణేభ్యః వేదవేదాంగేతిహాసపురాణ ధర్మశాస్త్రతత్వా[27]
జ్ఞాయపదవాక్య ప్రమాణ

---

(21) గణేశ్వర. (22) భరద్వాజ.
(23) కుశిక. (24) భరద్వాజ.
(25) ణ. (26) ఏతేభ్యశ్చతుర్దశ.
(27) తత్వ.

నాలుగవపత్త్రము, రెండవపుట.

43. విదే సకలకలాభిజ్ఞాయషట్కర్మ్మనిరతాయ [28] ఉత్తరాయణనిమిత్తేః [29] ఉదకపూర్వ్వ [30] సర్వ్వక

44. కరపరిహార(ం)కృత్వా ఉఱువృటూరు నామో [31] గ్రామోదత్తః తస్యా వధయః పూర్వ్వతః పబ్బు దక్షిణ

45. తః పెల్బాగలాను పశ్చిమతః క్రో ప్పేది ఉత్తరతః కుఱుమద్దవల్లి ఏతేషా మ్మధ్యవర్త్తిః [32] అ

46. స్యోపరి న కేనచిద్బాధా కరణీయా యఃకరోతి స పఞ్చమహాపాతకస(ం) యుక్తో

47. భవతి వ్యాసేనాప్యుక్తా శోకాః [33] బహుభిర్వ్వసుధాదత్తా బహుభిశ్చా నుపాలితా । యస్యయస్యయదా

48. భూమి స్తస్య తస్యతదాఫలం॥ ౮॥ స్వదత్తా(ం)పరదత్తాంవా యోహరేత వసున్ధరాం । షష్టివర్షసా [34] హ

49. స్రాణి విష్టాయాంజాయతే కృమిః॥ ౯॥ గవాంకోటిప్రదానేన అశ్వమే ధశతేనచ । తటాకానాం

---

అయిదవ పత్త్రము.

50. సహస్రేణ భూమిహర్త్తా నశుధ్ద్యతేః [35]॥ ౧౦॥ నవిషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముచ్యతే।

51. విషమేకాకిన(ం) హన్తి బ్రహ్మస్వ(ం) పుత్రపౌత్రికం [36]॥ ౧౧॥ మద్వంశజాః పరమహీపతి వంశజాశ్చపా

52. పాదపేతమనసో భూమి [37] భావిభూపః [38] యేపాలయన్తి మమధర్మ్మమి మ (ం) సమస్త (ం) తేషా

---

(28) తత్వజ్ఞాయ, విదే, నిరతాయ యను నేకవచనాంత విశేషణములకు బహువచనార్థము చెప్పుకొనవలయును.

(29) నిమిత్తే. (30) పూర్వ్వం.

(31) నామా. (32) వర్త్తి. (33) శ్లోకాః.

(34) స. (35) తి. (36) పౌత్రకం.

(37) భువి. (38) భూపాః.

53. మయుంవిరచి తోంజలిరేషమూర్ధ్ని॥[39] ౧౨॥ సర్వానేతాన్నా[40] వినః పార్థివేన్ద్రాన్ భూయోభూ

54. యోయాచతే రామదేవః[41] సామాన్యోయం ధర్మసేతు న్నృపాణా[42] (o) కాలేకాలే పాలనీయోభ

55, వద్భిః॥[43] ౧౩॥ ఆజ్ఞప్తిరస్య ధర్మస్య పణ్డరంగో గుణాధిక[44]విజయా దిత్య భూపాలో[45] పాదపద్మ

56. శిలీముఖః॥ ౧౪॥ విజయవాడవా స్తవ్యాయ శ్రీవిజయాచార్యేణా లిలేకసశాన లిఖితపద్య (o)[46]



(39) మూర్ధ్ని. (40) సర్వానేవమ్ అనిపాఠాంతరము.

(41) రామచంద్రః అనిపాఠాంతరము. (42) సేతుర్నృపాణాం.

(43) కొన్ని శాసనములలో నీశ్లోకము పూర్వోత్తరార్ధములు వ్యత్యస్తముగా నున్నవి. అదియే క్రమమని తోఁచుచున్నది. (44) గుణాధికః. (45) భూపాల.

(46) ఈ వాక్యమందులక్షణము చెడినది. "విజయవాడవా స్తవ్యేన శ్రీవిజయాచార్యేణ లిఖితంశాసనమిదమ్" అని వ్రాసిన కవిహృదయానుసారముగా నుండునని తోఁచెడిని.

# గ్రామ్యాదేశ నిరసన సభ.



నవంబరు నెల 24 తేది భానువారము సాయంకాలము మూఁడున్నరగంటకుఁ బచ్చయ్యప్ప కలాశాలాభవనములో నొకగొప్ప సభ కూడెను. ప్రస్తుతము గ్రామ్య భాషలో వ్రాయఁబడిన గ్రంథములను పాఠశాలలలో నుపయోగింపఁ గూడదని చెన్నపురి దొరతనము వారితో మనవిచేయుటకుఁగాను చెన్నపురిలోనున్న యాంధ్ర మహాజనులందఱు సమావేశమైరి. సభయుపక్రమించుటకుఁ బూర్వము మూఁడుగంటలకే పచ్చయ్యప్పకలాభవనము క్రిక్కిఱిసియునట్లు వచ్చిన సభ్యుల సంఖ్య యాంధ్రులకు తమమాతృ భాషయందుఁగల భక్త్యనురాగములను చాటి నది. ఇట్లసమానజయప్రదముగా జరుపఁబడిన సభనలంకరించిన విద్వజ్జన బృందములో నుభయాభాషాప్రవీణులును, పండితాగ్రగణ్యులును, విద్వత్కవిశేఖరులును, పురాణవిద్యాపారంగతులును, రాజాధిరాజులును, వణిక్శిఖామణులును, మఱియు వివిధకళానైపుణ్య విశారదులును కొల్లలుగఁ జూడనైయుండెను. అందుఁ గొందఱ పేరులు మాత్రమిందుఁ బొందుపఱుపఁబడినవి.

పిఠాపురము రాజాగారు, ఆనరబిల్ కురుపాం రాజాగారు, కపిలేశ్వరపురము (కృష్ణాజిల్లా), ఉయ్యూరు, తేలప్రోలు, నడిమి తిరువూరు జమీందార్లును, రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు, ఆనరబిల్ దివాన్ బహద్దర్ ముట్లూరి ఆదినారాయణయ్యగారు, ఆనరబిల్ న్యాపతి సుబ్బారావు పంతులుగారు, ఆనరబిల్ రావుబహద్దరు పిట్టి త్యాగరాయ శెట్టిగారు, జయంతి రామయ్య పంతులుగారు, మాదిరెడ్డి పాపారావు నాయుడుగారు, పండిత గోపాలాచార్యులుగారు, రావు సాహెబు టి. నంబెరుమాళ్లు శెట్టిగారు, పి. అయ్యన్న శెట్టిగారు, తాటికొండ రామచంద్ర రావుగారు, కే. వి. లక్ష్మణ రావుగారు, గట్టుపల్లి శేషాచార్లుగారు, చెన్నాప్రగడ భానుమూర్తిగారు, వేమవరపు రామదాసుగారు, దండిగుంట సూర్యనారాయణశాస్త్రులుగారు, సి. తిరుమలయ్య నాయుడుగారు, మొదలగువారనేకులు గృహస్థులును విద్యార్థులనేకులును వచ్చి భవనమంతయు కిటకిటలాడుచు నిండియుండెను. వీరేశలింగము పంతులుగారు సభాధ్యక్షులుగా నుండిరి.

బ్రహ్మశ్రీ రావు బహదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు కరతాళధ్వనులతో సభాధ్యక్షులుగ నెన్నుకొనఁ బడిరి. తదనంతరము దివాన్ బహదూరు కంచికృష్ణస్వామిరావు, సి. ఐ. ఇ. గారును, పోలవరము జమీన్దారుగారును రాసుదొరగారును మున్నగు కొందఱు తాము స్వయముగా సభ నలంకరించుటకు వలనుపడమికిఁ జింతిల్లుచు, సభయొక్క యుద్దేశముల నామోదించుచు వ్రాసినయుత్తరములు చదువఁబడినవి.

ఆతరువాత సభ్యులుతీర్మానములఁ బరిష్కరింపఁ దొడఁగిరి. గ్రామ్యభాషలో వ్రాసిన తెలుఁగుపుస్తకములను పాఠశాలలలో నుపయోగింపకుండునట్లుత్తరువుచేయుఁడని దొరతనమువారిని కోరుచు నొక మహజరంపుట మొదటి తీర్మానము. ఈతీర్మానమునుగుఱించి ముచ్చటించుచు మ. రా. శ్రీ. జయంతి రామయ్య పంతులుగారిట్లుపన్యసించిరి.

గ్రామ్యభాషయే గ్రాంథికభాషగా మార్పవలెననెడి మనప్రతిపక్షుల వాదము దుర్బలముగను, దోషభూయిష్ఠముగను, గాన్పించుచున్నది. ప్రస్తుత మాంధ్రవాఙ్మయమంతయు సామాన్యులకు దుర్గ్రాహ్యమనియు, దురవగాహమనియుఁ జెప్పుట మిక్కిలి సాహసము. అనుభవవిరుద్ధము. ఇతరభాషలలో వలెనే యాంధ్రమునందును అర్థసౌలభ్యములేని గ్రంథము లరుదుగ నచ్చటచ్చటఁ గాననగును. ఈగ్రంథములయొక్క కాఠిన్యము ప్రౌఢమయిన శైలి వలనఁ గలుగుచున్నది. గ్రంథరచనయందుఁ గల పాకవిశేషములను వ్యాకరణ నిర్బంధములని భావించి పుస్తకరచనయందు వ్యాకరణ నియమములను బాటింపనక్కఱ లేదనుట గొప్పపొరపాటు. సులభశైలిని వ్యాకరణయుక్తముగ వ్రాసిన హృదయరంజకములగు నాంధ్రగ్రంథములు వేనవేలు గలవు. ఆంధ్రవాఙ్మయమునందలి కాఠిన్యము అల్పసాహిత్యమువలన నేర్పడుచున్నది కాని వేఱుకాదు. చాలవఱకు నాంగ్లభాష కొఱకై మాతృభాష నుపేక్షచేయుట వలన దుర్గ్రాహ్యత్వము వాటిల్లుచున్నది. సామాన్యముగ మాతృభాష నుపేక్షచేయు పాఠశాలలో సయితము ప్రతితరగతినుండియు నేవురార్వురు కవులు బయలువెడలుచున్నారు కాఁబట్టి యాంధ్రవాఙ్మయము నిజముగా కఠినమయినది కాదని స్పష్టముకాఁ గలదు.

వాడుకలోనున్న భాష కాలక్రమమున మాఱుచుండుననుమాట సత్యమే. ఏకకాలముననే వివిధ మండలములయందుచ్చారణలోనే కాక యర్థములందు

నయితము భేదము లుండుట సహజము. కాని యేభాషయైనను గ్రాంథిక భాషగా నంగీకరించినతరువాత దానిలో నావశ్యకమైన మార్పులు కొలఁదిగ నెందేనిఁ గలుగును. ఆంగ్లభాషాచరిత్రను జదివిన వారందఱకును ఈవిషయము స్పష్టము కాఁగలదు. ఆంగ్లవాఙ్మయ పితామహుఁ డనఁదగు చాసరుతరువాత నింగ్లీషుభాషలో జరిగిన మార్పులు వర్ణక్రమమునందే తప్ప వ్యాకరణనిబంధనలలో మిక్కిలి తక్కువ. ఇంతియకాక మన ప్రతిపక్షులు వాదించునట్లు ఆంగ్లభాషలో నున్న ప్రాచీన, మధ్యమ, నవీనభేదములు ఆంధ్రభాషలో కూడ నుండవలెననుట యసంభవము. ఇంగ్లీషుభాషతోడి సామ్యము మన భాషకు వర్తింపదు. ఏలయన షేక్సుపియరుమహాకవి కాలమువఱకును ఆంగ్లభాష గ్రాంథికభాషయగుటకు పరిణామముఁ బొందుచునే యుండెను. ఆంధ్రభాష యన్ననో ఇంగ్లీషుభాషవలెఁ గాక వాగనుశాసనుని కాలముననే అనఁగా పదునొకండవ శతాబ్దము నాఁటికే పరిపూర్ణపరిణామమును బొంది సాధారణ గ్రాంథిక భాషగా పండితకోటియొక్క యంగీకారమును బడసియుండెను. ఈ కారణమును బట్టియే మన భాషలో నింగ్లీషు భాషలోవలె ఆంగ్లోసాక్సనుకు సరియైన వాఙ్మయము లేదు.

గ్రాంథిక భాషలో వ్యాకరణ విషయమైన మార్పులు సేయునప్పుడు మిక్కిలి ప్రయాసతో ఆజన్మాంతము భాషాపరిశ్రమముచేసిన పండితకోటి యొక్క యభిప్రాయము ననుసరించి చేయవలెనుగాని ప్రతి గ్రంథకర్తయు తనకుఁ దోఁచిన మార్పులతో పుస్తకముల వ్రాయఁ దొడంగినచో భాషకు గొప్ప యనర్థకము వాటిల్లును. సర్వసాధారణమగు గ్రాంథికభాష ధ్వంసమయి యొకమండలము వారు వ్రాసిన గ్రంథము లింకొక మండలములోనివారికి దుర్గ్రాహ్యము లగును. ఇంతియకాక నిత్యకృత్యములయందు వాడుకలోనున్న భాషలో గ్రంథములను వ్రాసినయెడల వాఙ్మయమంతయు పేలపిండివలె నిస్సారమై యుద్గ్రంథములయొక్క యుత్పత్తికిని ఇదివఱకున్న యుద్గ్రంథములలోని సారము గ్రహించుటకును ప్రతిబంధక మేర్పడును. కావున గ్రామ్యభాషలలో వ్రాసిన పుస్తకములను పాఠశాలలో పఠనీయగ్రంథములుగ నియమింపఁ గూడదని దొరతనమువారికిఁ దెలుపుట భాషాభిమానులయొక్క కర్తవ్యమై యున్నది. ఈ యుద్యమమును నెఱవేర్చుకొనుటకుఁ బఠనీయగ్రంథ నిర్ణయసభ ( Text book committee) లో తెలుఁగువారి సంఖ్య హెచ్చించుట యవసరము.

తెలుఁగు పుస్తకముల నియమించుటలో నాంధ్రేతరభాషలు మాతృభాషగాఁ గల సభ్యుల యభిప్రాయములఁ బట్టి ప్రాఁతతనమువారు పఠనీయ గ్రంథముల నిషేధించుటవలన మన యాంధ్రభాషకు మిక్కిలి యన్యాయము జరుగుట సహజము. ఈ యన్యాయమును వారించుటకు తెలుఁగులో పఠనీయగ్రంథములను తెలుఁగు మాతృభాషగాఁ గల సభ్యులే నియమింపవలెనని కూడ ప్రాఁతతనమువారికి మనము తెలియఁ బఱచుకొనవలెను. కాఁబట్టి యాతీర్మానమును మీరందఱు నేకగ్రీవముగ నామోదించెదరని నమ్ముచు నేనింతట విరమించుచున్నాఁడను.—

క్రిస్టియన్ కాలేజీ ప్రధానాంధ్రోపాధ్యాయులగు బ్ర॥ శ్రీ॥ వం॥ సూర్యనారాయణశాస్త్రిగారు పై తీర్మానము నామోదించుచు ఆంధ్రభాషానుశాసను నాఁటికే గ్రాంథిక భాషగా స్థిరత్వముఁ జెందెననియు నాఁటినుండి నేఁటి వఱకును ఏవిధమయిన మార్పులు లేకపోవుటచేతనే యొక ప్రదేశములోనున్న వారు వ్రాసిన పుస్తకము లింకొక ప్రదేశములోని వారికి సుబోధకములుగ నుండెననియుఁ ఇఁక మీఁదట నట్టి కట్టుబాట్లకు లోపడక యెవరి యిష్టము వచ్చినట్లు వారు వ్రాయఁ దొడఁగినచో నాపుస్తకము లితరులకు దుర్గ్రాహ్యము లగుననియు, కాఁబట్టి గ్రామ్యభాషను గ్రాంథికభాషగా నంగీకరింపఁ గూడదనియు నొక్కి వక్కాణించిరి.

ఈతీర్మానమునే బలపఱుచుచు బ్ర. శ్రీ., వేమూరి విశ్వనాథశర్మగా రిట్లు ముచ్చటించిరి. మనప్రతిపక్షులకును మనకును మూఁడువిషయములలో భిన్నాభిప్రాయము గనుపట్టుచున్నది. (1) విద్యావంతులు నిత్యకృత్యములలో వాడుకొనుభాష వ్యాకరణవిరుద్ధమయినను గ్రాంథికభాషగా నంగీకరించుట మొదటి విషయము. నిత్యకృత్య వ్యవహారములలో మన ముపయోగించుమాటల సంఖ్య మిక్కిలి స్వల్పము. అందులో రమారమి సగము అన్యభాషాపదములు పోను మిగిలిన సగభాగములో గ్రామ్యపదము లెంతసుబోధకములో వ్యాకరణ యుక్తమయిన సలక్షణరూపములును అంతేసుబోధకములుగ నున్నవి. "వచ్చాడు" అన్నచో నర్థమై "వచ్చెను" అనిన నర్థముగాకపోదు. ఇదికాక నవీనశాస్త్రముల నాంధ్రీకరించుటకుఁగాని ఇతర భాషలలో నుండు ఉద్గ్రంథములను తెలుఁగులో వ్రాయుటకుఁ గాని వాడుకలోనున్న పదములంత సహాయకారులు గానేరవు. నూతనపదము లనేకములఁ గల్పింపవలసియుండును. అట్టి తరుణముల నూతనపదములకుఁగూడ గ్రామ్యరూపములఁ గల్పింతురన్నచో హాస్యాస్పద

ముగనుండును. కాఁబట్టి వాడుకలోనున్న భాష వాఙ్మయాభివృద్ధికంత తోడ్పడదు. (2) సంధి నియములఁ బాటింపకుండుట రెండవ విషయము. వ్యాకరణ సంధు లుచ్చారణముయొక్క సౌకర్యమునకై యేర్పడినవి. "వాఁడు + ఉన్నాఁడు" అనుటకంటె వాఁడున్నాడనుటయే సుకరముగదా? వ్రాయునప్పుడు విసంధిచేసి చదువునప్పుడు మాత్రము చదువరుల యిష్టానుసారముగ సంధులు గల్పించుకొనవచ్చునని ప్రతి పక్షులవాదము. ఉచ్చారణయందు భేదములేక పోవుటచేత శకటరేఫమును, స్పష్టముగాక పోవుటచేత నర్ధానుస్వారమును పరిత్యజింపవలెనని వాదించెడు ఈభాషా సంస్కారులు విసంధివలన వ్రాఁతకును తదుచ్చారణమునకును భేదము కలుగుటవలన తమవాదమును తామే ఖండించుకొనుచున్నారు. (3) భాషాంతరపదస్వీకారము మూఁడవ విషయము. ఇతర భాషలలోనుండి పదములఁ గైకొను నప్పుడు పక్షపాత బుద్ధితో సంస్కృతము నుండి తీసికొనుట యన్యాయమనియు, ఆంగ్లభాషనుండి పదములను స్వేచ్ఛగాఁ దీసికొనవలెననియు, వారివాదము. ఇంగ్లీషుభాషలోనికి అన్యభాషాపదములఁ దీసికొనునప్పుడు దానికి సంబంధించిన జర్మన్, గ్రీకు, లాటిన్ మున్నగు భాషల నుండియే గైకొనునట్లు తెలుఁగుభాషకు మాతృకయని చెప్పఁదగు సంస్కృతమునుండియే సాధ్యమైనంతవఱకుఁ దీసికోవలెను. హైందవభాషలలో వలయు పదములున్నను విచ్చల విడిగ నాంగ్లభాషాపదముల వాడుటవలన మనభాష నుధ్వంసముచేయుటయేకాక యాంగ్లభాషకు ప్రాణపదమనఁదగు స్వరమును (Accent) పాటింపకుండుటచేత వారిభాషనుగూడ విరూపమునొందించిన వారమగుదుము. దీనినిఁబట్టి యీమూఁడు విషయములలోను మన ప్రతిపక్షుల వాదము నిర్హేతుకముగను, దుర్బలముగను, పరస్పరవిరోధముగను ఉన్నదని స్పష్టము కాఁగలదు.

బ్ర॥ శ్రీ॥ చెన్నాప్రెగడ భానుమూర్తిగారు రీతిస్థానమును బలపఱుచుచు ప్రతివాదుల వాదప్రకారము సర్వజనసామాన్యమునకు సుబోధకమగుటయే గ్రంథరచనయొక్క ముఖ్యోద్దేశమయినచో రసవంతములై నీతిబోధకములగు లంకాయాగము, కుచ్చెలకథ బొబ్బిలికథ మున్నగు గ్రంథము లనేకములున్నవనియు అట్టి రసవంతములగు గ్రంథములు ప్రజల కొరకింకను వ్రాయవచ్చుననియు, చెప్పిరి. అవస్థలనుబట్టి మనము ఉడుపులను మార్చుకొనునట్లు పాఠకులయొక్క సామర్థ్యమునుబట్టి భాషకూడ మారవలెననియు, అంతమాత్రముచేత కేవలము

పామరులకొఱకు వ్యాకరణ విరుద్ధముగ వ్రాసినగ్రంథములకు ఉద్గ్రంథములయొక్క యౌన్నత్యమును, లాక్షణికత్వమును రావలెనని పోట్లాడుట అసమ్మతము, ఆచార విరుద్ధమేకాక యశాస్త్రీయముని కూడ వాదించిరి.

పైనలుగురుగాక బ్రః శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారును, మ. రా. శ్రీ రంగయ్యనాయుడుగారును ఈ తీర్మానమును బలపఱచిరి. సభ్యులేక గ్రీవముగ తమయంగీకారమును కరతాళధ్వనులచే వెల్లడించిరి.

మనవి పత్రమీ పత్రికానుబంధమునఁ గననగు. రెండవతీర్మానము:—

దొరతనమువారికిఁ బంపవలసిన మనవి పత్రముపై ఆంధ్రపండితులు చేవ్రాలు చేయుటకును, వానితోఁజేర్చి మనవి పత్రమును దొరతనమువారి కంపుటకుఁ దగినయేర్పాటు చేయుటకును, ఒక సభయేర్పఱచిరి. బ్రః శ్రీ. జయంతి రామయ్యపంతులుగారు, దివాన్ బహుదూరు ముట్నూరి ఆదినారాయణయ్యగారు, రావుబహదూరు పి. త్యాగరాయశెట్టిగారు, కే. వి. లక్ష్మణరావుగారు, తేలప్రోలు జమీందారుగారును సభ్యులు. ఈతీర్మానమును మ-రా-రాశ్రీ. వేమవరపురామదాసుగారు ప్రతిపాదించిరి. పండిత డి. గోపాలాచార్యులుగారు ఆమోదించిరి.

సభముగియకపూర్వము సభాధ్యక్షులగు వీరేశలింగం పంతులుగారీ విధముగ నుపన్యసించిరి.

మొట్టమొదట ఆంధ్రభాష నాగరికభాష, గ్రామ్యభాషయని రెండు విధములు. పట్టణవాసులు మాట్లాడుభాష నాగరికభాష. జానపదులు మాట్లాడెడిభాష గ్రామ్యభాష. నాగరికభాషయే గ్రాంధికభాషగా మారినది. ఇప్పుడు గ్రాంధికభాష మార్పవలెనన్నయెడల విద్యాభ్యాస మొనర్చిన నవనాగరకుల భాష యాదర్శముగా నుండెనలెనా? లేకపండితులయొక్క భాషవాడవలెనా? మొదటిది పలాణభాషాపదభూయిష్ఠమై యుండును. రెండవది వ్యావహారికభాషగానుండును. కాఁబట్టి గ్రాంధికభాష యీరెంటికంటెను భిన్నముగా నుండవలెను. మనుష్యులవలెనే వాడుకలోనున్న భాషలుకూడ సంస్కారమును బొందుచుండుట సహజము. సంస్కృతమునకు మొదటిపేరు గీర్వాణము. సంస్కృతమనుపేరు సంస్కరించుట వలననే వచ్చినది. సం॥ అనఁగా చక్కఁగా కృత॥ సంస్కరింపఁబడినదని యర్థము. గీర్వాణభాషను సంస్కరించిన తరువాత వాడుకలోనున్న భాషకు ప్రాకృతమనిపేరు. ప్రాకృతము పాత్రానుసారముగ నాటకరచనయందును ప్రహసనములందును వాడియున్నారు. అట్లె యాంధ్రము

సందుకూడ పాత్రోచితముగ నాటకములందును రసోత్పత్తికొఱకు నవలల యందును ప్రహసనములలోను గ్రామ్యభాష స్వేచ్ఛగా నుపయోగింపఁవచ్చును.

ఆంధ్రవ్యాకరణము ముఖ్యముగా పద్యకావ్యములకు వ్రాయఁబడినది. రమారమి నలువది సంవత్సరముల క్రిందట తెలుఁగులో గద్యకావ్యములే లేకుం డెను. అప్పుడు చిన్నయ్యసూరి తనవ్యాకరణమును రచించి యందుకు లక్ష్య ముగా నీతిచంద్రికను వచనముగ వ్రాసెను. దీని శైలి మిక్కిలి కాఠిన్యము. మొట్ట మొదట నేనును చిన్నయసూరిగారి త్రోవనే తొక్కి కొన్ని గద్య కావ్యములు రచించితిని. కాని యీగ్రంథములను జదివి బోధపరుచుకొనుటకుఁ గావలసిన శ్రమమునకుఁ దగినంత ఫలములేదని తోచి గద్యకావ్యములను సులభశైలిని వ్రాయనారంభించితిని. మొట్టమొదట నన్ను పండితులు పరిహసించినను రాను రాను నాశైలినే యాదర్శముగ నుండ నోపునని కొందఱు చెప్పియున్నారు. గద్య కావ్యములు వ్రాయునప్పుడు వ్యాకరణములో కొన్ని మార్పులవసరమగును. ఎల్లప్పుడు సంధినిత్యమనినచో వచనరచనయందు కష్టమగును. వ్యంగ్యార్థము స్ఫురించు చోట్లను, శ్లిష్టార్థములుస్ఫురించు చోట్లను, అర్థసౌకర్యముకొఱకును, పదములను విసంధిగనే వ్రాయవచ్చును. గద్యరచనయందిదివఱకే యిది యంగీ కరింపఁబడినది.

మన పూర్వకవులు చూపినత్రోవనే మనముక్రొత్త పదములను స్వీకరింప వచ్చును. క్రొత్త వృత్తులు పెరుగుకొలఁది క్రొత్తమాటలు కల్పించుట సహజము. ఇది యిదివఱకు మనభాషలో జరిగినయంశమే. ఏమార్పులుచేసినను నియమము లకులోబడి యుండవలెనుగాని విచ్చల విడిగానుండరాదు. ఇట్టి మార్పులు భాషా భివృద్ధికిఁ దోడ్పడవు.

గ్రామ్యభాషలో గ్రంథములు వ్రాయుటవలన వాఙ్మయాభి వృద్ధికానే కాదు గదా, యొకమండలము వారిపుస్తకములు మఱియొక మండలము వారికి అరబ్బీభాషగానుండును. విశాఖపట్టణమువారు "ఫుల్లలావ్రు" అన రాజమహేంద్ర మువారు "పొయిపట్టలేదా" యని యడుగుదురు. చెన్నపట్టణము వారు "పూడ్చాడు" అనఁగా ఉత్తరాదివారు "గోతిలోనా" యని ప్రశ్నించెదరు. ఇంతియకాక "వాడొచ్చాడు" అనివ్రాసినయెడల రెండవది, వచ్చుధాతువా? ఒచ్చుధాతువాయని సందేహము గలుగును. కొన్ని మండలములలో "ఆడొ

చ్చాడ" ందురు 'వాడా', 'ఆడా' యని సంశయముపుట్టును. భాషయొక్క పరిశుభ్రత పోవును. శబ్దములు చెడిపోవును. కాబట్టి గ్రామ్యభాషలో వ్రాసిన గ్రంథములను పాఠశాలలో నుపయోగింపఁ గూడదు. గ్రంథములను గ్రాంథిక భాషలోనే వ్రాయవలెను.

సభాధ్యక్షులకు వందనములతో సభముగిసెను.

వే. విశ్వనాథశర్మ.



## మహోన్నతులును మహామంత్రి సమేతులు నగు మహారాజ శ్రీ
## మదరాసు గవర్నరు దొరవారికి,
## ఈదిగువను వ్రాళ్లు చేసిన యాంధ్రభాషాభిమానులు
## వినయపూర్వకముగాఁ జేయు మనవి

ఏమనఁగా:—

ఇప్పుడిప్పుడు కొలఁదిమంది తెలుఁగుభాషను తమ యిచ్ఛానుసారముగా "సంస్కరింప" వలయునను నభినివేశమును గల్పించుకొని తదనుగుణముగా గ్రాంథికభాషను విడిచి నేఁటి గ్రంథములిఁక గ్రామ్యభాషయందే రచింపవలయునని వాదించుచున్నారు. మఱియు గ్రామ్యభాషయందు రచింపఁబడిన గ్రంథములఁ బాఠశాలలలో నుపయోగించునటు లొనర్చుటకు యత్నములు జరుగుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇట్లభిమానముతో వాదించు వారిద్దఱు ముగ్గురు మాత్రమే. వారి వాదము నామోదించువారి సంఖ్య యత్యల్పము. రెండుకోట్ల కధికమగు నాంధ్రులసంఖ్యలో నణుమాత్రము. వీరివాదము గ్రాంథికభాషాసంప్రదాయమునకు విరుద్ధమగుటయేగాక ఆంధ్రభాషావాఙ్మయముల వృద్ధికిని, దేశాభివృద్ధికిని హానికరమగుట చేత ఆంధ్రలోకమున కెంతయు ననమ్మతమని స్పష్టముగను నిశ్చయముగను మనవిచేయుచున్నారము.

2. కాలక్రమమున మాఱుచుండుట భాష స్వభావమనియు, మాఱకయెన్నటికి నొక్కరీతిగానే యుండవలయునని వాదించుట యశాస్త్రీయమనియు, భాషకు గ్రామ్యాగ్రామ్యభేదము భాషాస్వరూపము నెఱుంగని పండితమ్మన్యులచేఁ గల్పింపఁబడినదిగాని వాస్తవము గాదనియు, ఇప్పటి గ్రాంథికభాష సంస్కృత పదములతోడను, సాంస్కృతిక వాక్యరచనా విశేషములతోడను, వర్తమానమందు వాడుకలో లేని కేవలపురాతనపదప్రయోగములతోడను నిండియుండుటంజేసి పండితులు కానివారలకు దురవగాహమనియు, సర్వసామాన్యముగా నందఱకును దెలియుటయే గ్రంథరచన యొక్క ముఖ్యలక్షణముకావున నింతటినుండి గ్రంథముల నాంధ్రదేశమం దుత్తమజాతిస్త్రీపురుషులు సంభాషణయందు వాడుచున్న భాషయందే వ్రాయవలెననియు, ఈ పద్ధతి యాంగ్లేయభాషయందుండుటచే నాంధ్రులకుఁగూడ ఆచరణీయమనియు నీవిపరీత సంస్కారవాదుల మతము.

3. ఈ వాదము దోష భూయిష్ఠమయియున్నది. తెలుఁగునందు గ్రాంథికభాష దుర్బోధమని చెప్పుట యతిసాహసము. అనుభవవిరుద్ధము. కొన్నికొన్ని గ్రంథము లతిప్రౌఢముగానుండుట చేత పాండిత్యవిహీనులకు సులభముగా బోధపడక పోవచ్చును. అట్టివి ప్రాచీనగ్రంథములం దంతగా లేవు. అట్టిగ్రంథము లన్ని భాషలయందును గలవు. ఈకాఠిన్యము పాకభేదము ననుసరించినదిగాని లక్షణమువలనఁగలిగినదికాదు. సులభముగా గ్రహింపఁదగిన సలక్షణగ్రంథములనేకములు గలవు. అవి యాంధ్రదేశమందెల్లెడలఁ బ్రచారములోనున్నవి. నేఁడుగూడ భాషాసేవకు లనేకు లీసలక్షణభాష చేతనే సుబోధములగు గ్రంథములనేకములు రచియించుచున్నారు. నిర్దుష్టభాషచేత గ్రంథరచన చేయఁగలవారి సంఖ్య మొత్తముమీఁద కొంచెమయినను, అట్టి గ్రంథములను గ్రహింపఁగల వారనేకులుందురు. ఇట్టులే యన్ని భాషలయందును, ప్రౌఢకవులు కొలఁదిమంది, చదివి గ్రహింపఁగలవారు పెక్కురు. అట్లుకాకున్న ప్రౌఢకావ్యములు లేకపోవలసియే వచ్చును. కొంతకాలమునుండి సలక్ష

*

నముగ స్తెలుఁగున రచింపఁబడిన నాటకగ్రంథము లనేకములు పుట్టుచున్నవి. నాటక సమాజము లనేకములేర్పడి యీ నాటకములను ప్రదర్శించుటయు వేలకొలఁది జనులానాటకములఁజూచి యానందించుటయు జరుగుచున్నది.

4. ఆంగ్లేయభాషయందె యెక్కువపరిచయము గల యీ కాలమువారికి కొందఱకు నలక్షణాంధ్రగ్రంథములుకొన్ని కష్టసాధ్యములుగా నుండవచ్చును. ఈ లోపము వారిమాతృభాషావైముఖ్యమువలనఁ గలిగినదని వారు సర్వసామాన్య విషయములంగూర్చి యొకరితోనొకరు ప్రసంగించు నపుడు గూడ యథేచ్ఛముగాఁ బ్రయోగించు నాంగ్లేయపదములే చాటుచున్నవి. కేవలము వీరల సౌకర్యార్థము భాషామర్యాదల మార్పవలెనని వాదించుట ధర్మముకాదు. వర్తమానమునందాంగ్లేయ విద్యాధికులగు పలువురాంధ్రులు మాతృభాషాభిమానముకలిగి తద్భాషా పరిచయమును వృద్ధి నొందించుకొనుటయే కాక యాభాషయందు గ్రంథములఁగూడ రచియించుచున్నారు. నూతనసలక్షణ గ్రంథరచనకై యనేక సమాజము లేర్పడుచున్నవి.

5. సంభాషణ రూపముగా మాత్రమే వ్యవహరింపఁబడుచున్నంతవఱకు జనులనోళ్లఁబడి దేశభేదమువలనను కాలభేదమువలనను మాఱుచుండుట భాష స్వభావము. అట్టి భాష గ్రాంథికమైన పిమ్మట ననఁగా నాభాషచే గ్రంథములురచించుట కారంభమయిన పిదప పూర్వపు వికారగుణము తగ్గి భాషకు లక్షణమేర్పడి దేశభేదములచే భిన్నముగాక యేకరూపముగా నుండును. ఇది సర్వ గ్రాంథిక భాషలకు సమానలక్షణము. అట్లు కానిచో నొక ప్రదేశమున రచింపఁబడు గ్రంథములు వేఱొక ప్రదేశమునను, ఒకకాలమున రచింపఁబడు గ్రంథములు కాలాంతరమందును బొత్తిగాఁ దెలియకపోవుట తటస్థించి గ్రంథరచనయొక్క ప్రయోజనమునకే భంగముకలుగును. ఈదుస్థితి యాంధ్రదేశమున కింకను బట్టలేదుగాని "సంస్కార" వాదుల యుద్యమము కొనసాగినచోఁబట్టు ననుటకు సంశయములేదు.

6. పూర్వమధ్యాధునిక కాలభేదములచేత ఆంగ్లేయభాష మూఁడువిధములుగా నున్నదనియు, పూర్వకాల భాషకును ఆధునికభాషకును భేద మత్యంతము కలదనియు, ఆంధ్రభాషకుఁ గూడ నట్టి పరిణామము కలిగిన ట్లూహింపవలయుననియుఁ గొందఱియాశయము. ఆంగ్లేయ భాషయందుఁ గలిగిన మార్పులు చాలవఱకాదేశము నార్మనుదేశీయులచే నాక్రమింపఁబడియుండిన కాలమునందు సర్వసామాన్య గ్రాంథికభాష యేర్పడియుండకపోవుటచేఁ గలిగినవనియు, ఆంగ్లేయగ్రాంథికభాషా పితామహుఁడనఁదగిన చాసరునాఁటి భాషకు నిప్పటి భాషకును భేదము బొత్తిగా లేకపోలేదుగాని వానికిఁగల ముఖ్యభేదము వర్ణక్రమము (Spelling) నకు సంబంధించినది గాని లక్షణమునందంతగా మార్పులు కలుగలేదనియు ఆంగ్లేయపండితులు చెప్పుచున్నారు.

7. ఆంధ్రభాషయన్నచో:— 11 వ శతాబ్దారంభమునాఁటికే యనఁగా నార్మనులు ఇంగ్లాండు నాక్రమించుకొనక పూర్వమే యున్నతస్థితికి వచ్చియుండెను. గ్రాంథిక భాష యేర్పడి నేఁటికిఁగూడ నుత్తమగ్రంథముగా నెన్నఁబడుచున్న యాంధ్రభారతమందు మూఁడు పర్వము లాశతాబ్దము పూర్వార్ధమునందు రచింపఁబడియుండెను. పిదప మాతృభాషాభిమానులగు నాంధ్రరాజులే దేశమును కలకాలము పరిపాలించుచుండుటంజేసి భాష నిజమర్యాదానుసారముగనే క్రమక్రమముగా వృద్ధినొందుచు వచ్చినది. పదపడి కొంతకాల మాంధ్రదేశములోఁ గొంత భాగము మహమ్మదీయులచే నాక్రమింపఁ బడియుండెను గాని భాషామర్యాద లదివఱకే స్థిరపడి

యుండుటంబట్టి రాజకీయవ్యవహారముతో సంబంధించిన కొన్ని పారసీకాఙ్గ్లేయదేశ్య పదములు వ్యావహారికభాషయందుఁ జేరుటతప్ప భాషాస్వరూపమున భేదమేమియుఁ గలుగలేదు. కావున యాఙ్గ్లేయభాషా సామ్యమునుబట్టి యాంధ్రభాష మాఱవలెనని వాదించుటయశాస్త్రీయము. క్రొత్తతెలుఁగు ప్రాఁతతెలుఁగు ననుభేదము "సంస్కార" వాదుల స్వకపోలకల్పితముగాని వాస్తవముగాదు. ఆంధ్రులకు దుర్బోధము. ప్రాచీనాఙ్గ్లేయభాషకుఁబోల్పఁ దగిన వస్తువు తెలుఁగులో లేదు. వీరలు క్రొత్తతెనుఁగనునది గ్రామ్యభాషగాని వేఱుగాదు.

8. గ్రాంథికభాషాసాహచర్యముచే సంస్కరింపఁబడిన యుత్తమాఙ్గ్లేయసంభాషణభాషకును ఇప్పటి యాంధ్రుల సంభాషణ భాషకును సామ్యముచెప్పుట యక్రమము. సంభాషణభాషా శైలికంటె గద్యకావ్యముల భాషాశైలియు, అంతకంటెఁ బద్యప్రబంధ శైలియు ప్రౌఢములు. ఆఙ్గ్లేయభాషయందు నాటకములు గద్యగ్రంథములు నెక్కుడుండుటచేతను, చదువా దేశమంతటఁ నధికముగా వ్యాపించియుండుటచేతను, అచ్చుయంత్రముల యుపయోగము ప్రబలుటచేతను, ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి పట్టణములందలి యున్నత విద్యాలయముల మూలమునను గ్రాంథికభాషాసంబంధమెక్కువయయి సంభాషణభాష ప్రౌఢమగుటయుఁ గానికిని గ్రాంథికభాషకును గలయంతర మల్పమగుటయుఁ దటస్థించినవి కాని గ్రాంథికభాష ప్రౌఢిమ తగ్గుట యిందులకుఁ గారణముకాదు.

9. ఆంధ్రభాషయందలి గ్రంథములు ప్రాయికముగా పద్యరూపములుగానే యుండుటచేత గ్రాంథికభాషకును వ్యావహారికభాషకును అంతర మాఙ్గ్లేయభాషయందుకంటె నెక్కువగానున్నది. నాటకములును గద్యకావ్యములును ఇప్పుడిప్పుడు బయలుదేరుచున్నవి. ఈనాఁటి గ్రంథకర్తలు సులభమగు ద్రాక్షాపాకముననే గ్రంథముల రచించుటకు యత్నించుచున్నారు. పలువు రట్లు వ్రాయఁగలిగియున్నారు. ఈప్రకారమింకఁ గొంతకాలము జరిగినపిమ్మట నీ గ్రాంథికభాషా సంబంధముచే నాఙ్గ్లేయభాష యందువలెనే యక్షరాస్యుల వ్యావహారికభాష ప్రౌఢమయి స్థిరపడుననుటకు సందేహములేదు. ఇప్పుడే యారంభమయినది. చదువుకొన్నవా రనేకు లుత్తర ప్రత్యుత్తరములందును, ఉపన్యాసము లిచ్చునప్పుడును, వార్తాపత్రికలయందును సలక్షణమగుభాష నుపయోగించుచున్నారు. అక్షరాస్యుల వ్యావహారిక భాషకును గ్రాంథికభాషకును భేదము తగ్గించుటకు న్యాయ్యమైనమార్గమిదిగాని "సంస్కార" వాదులు చెప్పునదికాదు.

10. "సంస్కార" వాదులు చెప్పునట్లు ఏకరూపమును సర్వసామాన్యము నగు వ్యావహారిక భాష ప్రస్తుత మాంధ్రలోకమందు లేదు. జాతిభేద దేశభేదములనుబట్టి యది వివిధముగానున్నది. ఇందులో నేదియో యొకదేశమందొక జాతివారిచే వ్యవహరింపఁబడుచున్న భాషయందు గ్రంథముల రచింపుదమన్న నవి యితర దేశములందును ఇతరజాతులకును సంస్కారవాదులు కోరునంత సులభముగా నర్థమెట్లగును? ఆభాషకొకలక్షణమేర్పఱచి యాలక్షణము నందఱు నున్నింపవలయునని నిబంధనము చేయుదమన్నచో నదియు నొక గ్రాంథిక భాషగా నేర్పడి వర్తమాన గ్రాంథిక భాషయం దారోపింపఁబడిన దోషములకన్నింటికిని పాత్రము కాదా? గ్రాంథిక భాష యొక్కటియే తెలుఁగుదేశమంతటను తెలియఁదగి యున్నది.

11. కాలక్రమమున గ్రాంథికభాషకూడఁ గొంతవఱకు మాఱుచుండుననుట సత్యమే. ఆప్రకార మాంధ్రభాషకూడ మాఱుచునే యున్నది. పూర్వకవిప్రయోగములకంటె భిన్నములగు ప్రయోగములు తరువాతి కవులగ్రంథములలోఁ గనఁబడుచున్నవి. వానిని లాక్షణికులంగీకరించి యున్నారు. కాని గ్రాంథిక భాషయందు మార్పులు విలంబముగను బహుకవి సమ్మతముగను గలుగును. భాషాలక్షణవిచారము చేయునప్పుడు తత్తత్కాలములందు ప్రామాణికులుగా నెన్నఁబడువారి గ్రంథములందలి ప్రయోగములే ప్రమాణము గాని మఱియేదియు ప్రమాణముకానేరదు. సు

ప్రతిష్ఠితమగు నీమర్యాదకును ఆంధ్రభాషాసంప్రదాయమునకును విరుద్ధముగా సిద్ధులుముగ్గురుచేరి తమ యిచ్ఛానుసారముగా భాషను మార్చెదమనుట హాస్యాస్పదము.

12. ఈ యపూర్వ సంస్కార వాదుల మతానుసారముగా రచింపఁబడిన గ్రంథములు ప్రచారములోనికి వచ్చినయెడల ఆంధ్రులకుఁ గ్రమక్రమముగా నిప్పటి గ్రాంథికభాషతోఁ బరిచయము తగ్గికొంతకాలము గతించిన పిమ్మట నిప్పటి తెలుఁగు గ్రంథము లన్యభాషాగ్రంథములవలె దురవగాహములగుట తటస్థించును. అందువలన రాఁబోవు జనులకుఁ దమదేశపు పూర్వవృత్తాంతము బొత్తిగాఁ దెలియకపోవును. నాగరకులను ఖ్యాతిగల ప్రతిజాతియొక్కయు పూర్వాచారములు, పూర్వపురుషుల యుదారభావములు, ఆశయములు, వారు కనిపెట్టినవిషయములు మొదలగునవి యన్నియు ననఁగా బహుకాలసంచితమగు నాగరకతాసారమంతయు వారివారి వాఙ్మయములందు నిక్షిప్తమైయుండును. జనులు వాఙ్మయము నర్థముచేసికొనలేక పోయినచో వారలకుఁ దమ పూర్వవృత్తాంతము, పూర్వమర్యాదలు తెలియకపోవును. తమ పూర్వవృత్తాంతమును మఱచిపోవుట కంటె ఘోరతరమైన విపత్తేజాతివారికిని దటస్థింపఁబోదుకదా !

13. పిల్లలకును పామరులకును సులభముగా బోధపడునట్లు గ్రంథములు రచించుట కనేక మార్గములుకలవు. అట్టి గ్రంథములయందు సర్వసామాన్యముగా నందఱకు నర్థమగు పదములనే ప్రయోగింపవలెను. తఱచుగా సంధుల సడలింపవలయును. వాక్యములు చిన్నవిగానుండవలయును. విషయముకూడ చదువరుల తెలివికి లోఁబడినదిగానుండవలెను. గ్రంథములు సులభముగా రచియింపవలెనన్న నివిమార్గములుకాని గ్రామ్య భాషను బ్రయోగించుట సరియైన మార్గముకాదు. ఆంగ్లేయ భాషలో పసిపిల్లల నిమిత్తము వ్రాయు చిన్న పుస్తకములు సైతము గ్రామ్యభాషలో వ్రాయరు. తెలుఁగులో నేల వ్రాయవలెను.

14. సరియయిన పర్యాయపదములు దేశ భాషయందు దొరకనియెడల అన్యదేశ్య పదముల గ్రహించుట కభ్యంతరములేదు. కాని దేశభాషాపరిచయ మల్పమును అన్య దేశభాషాపరిచయ మధికము నగుటచే దేశ భాషయందలి పర్యాయపదముల నన్వేషింపకయే యన్య భాషాపదముల యథేచ్ఛముగాఁ బ్రయోగించుట నింద్యము. అట్లు ప్రయోగించినయెడల భాషలలో నెల్ల లలితమనిపించుకొన్న యీ తెలుఁగు సంకరమై కర్ణకఠోరమగును. సంస్కృతపదము లనవసరముగాఁ బ్రయోగించిరనియే కదా సంస్కారవాదులు కొందఱు పండితుల నిందించుచున్నారు. అట్టి తా మన్యదేశ్య శబ్దముల నిరంకుశముగా నెట్లు ప్రయోగింప నొప్పును?

15. మీఁదఁ గనపఱచిన హేతువులంబట్టి యీ యపూర్వ సంస్కారవాదుల వాదమును నిషేధించి వర్తమాన మర్యాదానుసారముగా సలక్షణభాషచే రచింపఁబడిన గ్రంథములనుమాత్రమే పాఠశాలలయందుపయోగించునట్లును,తదితరగ్రంథములనుపయోగింపకుండునట్లును శాసింపవలయునని దొరతనమువారినిందుమూలముగా మఱిమఱి వేఁడుచున్నారము. మఱియు,తెలుఁగు "టెక్స్టుబుక్కు కమిటీ" లో తెలుఁగు మాతృభాషగాఁ గల వారిద్దఱుమాత్రమే యున్నారు. తెలుఁగు తెలియని వారు తెలుఁగు గ్రంథములనియమించుట న్యాయ్యముకాదు గనుక ఆ "కమిటీ" లోని సభ్యులందఱు తెలుఁగు మాతృభాషగాఁగలవారుగా నుండున ట్లేర్పాటుచేయవలయుననికూడఁ బ్రార్థించుచున్నారము.

ఇట్లు,

విన్నవించెడి యాంధ్రభాషాభిమానులు.

# ఆంధ్రనిఘంటునిర్మాణపద్ధతి.



పదముల వ్యుత్పత్త్యాదులఁ దెలియఁజేయు పెద్ద నిఘంటువును తెనుఁగుభాషకు నిర్మించుట యాంధ్రసాహిత్య పరిషత్ప్రధానకార్యములలో నొక్కటి యై యున్నది. కార్యారంభమునకుఁ బూర్వము నిఘంటు వేపద్ధతుల ననుసరించి రచింపవలయునో యది నిర్ణయించుట యావశ్యకము. ఏత ద్విషయమున నాకుఁ దోఁచిన యూహలను సంగ్రహముగాఁ దెలుపుచున్నాఁడను. సహృదయు లగు పండితులు దీని విమర్శించి తమ యభిప్రాయముల ననుగ్రహింతురు గాక.

ఆంధ్రనామసంగ్రహము ; ఆంధ్రనామశేషము ; ఆంధ్రభాషార్ణవము ; సాంబనిఘంటువు ; వేంకటేశాంధ్రము; ఇత్యాది పద్యాత్మకములైనపూర్వ నిఘంటువులు కొన్ని గలవు. ఇవి యన్నియు నమరకోశము ననుసరించి రచింపఁబడినపర్యాయపద పట్టికలుగాని యక్షరక్రమమిందు లేదు. అక్షరక్రమముగ నాంగ్లేయ నిఘంటువులఁ బోలిన తెలుఁగు నిఘంటువు మొదట రచించినవాఁడు ఏ. డి., కాంబెల్ దొరగారు. ఈ నిఘంటువు మిక్కిలి చిన్నది. దీనికంటె బ్రౌ౯ దొర విరచించినది ననేకవిధముల నధికమని చెప్పవచ్చును. కాని యదియు సమగ్రమని చెప్పుటకు వీలులేదు. పదములకు తద్భవ తత్సమాదిభేదముగాని వ్యుత్పత్తిగాని యందుదహరింపఁబడి యుండలేదు. ప్రయోగప్రమాణములయినను కొలఁదిగ నున్నవి. బహుజనపల్లి సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరమునఁ జాలమట్టునకీ లోపములు తీర్పఁబడినవి గాని శబ్దముల వ్యుత్పత్తు లంతేఁగా నిందుఁ గానరావు. మఱియు నీ

ప్రాఁత నిఘంటువులు, అవి యెంతవఱకు పయోగకరములు.

ఆధునిక నిఘంటువులు, వాని లోపములు.

నిఘంటువునం దాంధ్రశబ్దజాలమంతయు నిమిడియున్నదని చెప్ప వలనుపడదు.ఆంధ్రపదపారిజాతము, లక్ష్మీనారాయణీయము నను రెం డచ్చుతెలుఁగు నిఘంటువులు కానంబడుచున్నవి. ఈ రెండు నుపయోగకరములుగనే యున్నవి. ఇవి కాని యిటీవలఁ బాఠ శాలలయందలి విద్యార్థుల కుపకరించుటకై రచింపఁబడిన చిన్న నిఘంటువులుగాని కొఱంతలులేని సమగ్ర నిఘంటువులు కాఁ జాలవు. ఇప్పుడు ప్రచారములో నున్న ద్రావిడభాషా నిఘం టువులలో రివరెండు యఫ్ కిట్టెలు దొరగారి కన్నడ నిఘంటు వగ్రగణ్యమని చెప్ప నొప్పును గాని శబ్ద వ్యుత్పత్తుల వివరింపమి నిదికూడ లోపములేనిది కాదు.మనము రచింపఁదలఁచిన యాం ధ్ర నిఘంటు వీ కిట్టెలు దొరగారి నిఘంటువునకు మెఱుఁగు వెట్టిన రీతిగ నుండవలయును. ఇయ్యది యాంధ్రభాషకు సమ గ్ర నిఘంటువై యాంధ్ర వాఙ్మయాభ్యసనమునకే కాక ముఖ్య

ప్రస్తుత నిఘంటువుయొక్క వ్యాప్తి.

ముగా నాంధ్రభాషయొక్కయుఁ బిదప నితరద్రావిడభాషల యొక్కయు స్వరూప చరిత్రాదుల యన్వేషణమునకుపకరిం చునదిగా నుండవలయును. సర్ జేమ్సు మర్రేగారియాంగ్లే నిఘంటువు (N. E. Dictionary on HistoricalPrinciples) యొ క్క యుపోద్ఘాతంబునందు దాని రచించు విధాన మీ రీతిని నిరూపింపఁబడినది. "(1) ప్రతిపదము నెప్పు డేవిధమున నాం గ్లభాషలోఁ జేరినది, యర్థమునం దెట్టి పరిణామములఁబొం దినది, యే యే యర్థములు వాడుకలో నుండి తప్పినది, యెబ్భంగి నూతనార్థములు వచ్చినది, స్పష్టముగఁ దెలియఁజే యుట. (2) పదముయొక్క ప్రథమ ప్రయోగమాదిగ నేఁటి వఱకుఁ బ్రమాణవాక్యముల నుదహరించుచుఁ బై విషయ ముల నిరూపించుట. (3) శబ్ద తత్త్వ శాస్త్ర పద్ధతులప్రకారము చరిత్ర ప్రమాణము నాధారముగాఁ గైకొని వ్యుత్పత్తుల నిర్వ

చించుట". అనేక కారణములచే మనము మనభాష కింతకార్యము చేయలేకపోవచ్చును. మన వాఙ్మయము మిక్కిలి మితవ్యాప్తి కలది. ఆఁగ్లభాషా నిఘంటు నిర్మాణమున కుపచరించు నంత విద్యాధికత మనకు లభించుట దుస్సాధ్యము. కాఁబట్టి, యాంగ్లేయ నిఘంటు నిర్మాతలతో సమముగా మనము పనిచేయలేక పోయినను వారి యుద్యమమును మనము లక్ష్యముగా దృక్పథమునం దుంచికొందుము గాక.

మనము రచింపఁబోవు నిఘంటువునం దీక్రింది విషయము లుండవలయును.

(అ) ఆంధ్రభాషలో వ్యవహారమునందున్న శబ్దము లన్నియు. (ఇ) ఆ యాశబ్దములు తత్సమ తద్భవదేశ్యా న్యదేశ్య గ్రామ్యములలో నేవియో యా వివరణము. నిఘంటువులో నుండు విషయములు.

(ఉ) శబ్దార్థములు.

(ఋ) శబ్దార్థములకుఁ బూర్వకవి ప్రయోగములు.

(ఌ) దేశ్యశబ్దముల కన్యద్రావిడ భాషలలోని సజాతీయ పదములు.

(ఎ) అవయవవ్యుత్పత్తి, ధాతునిరూపణము; మొదలగునవి.

అ— తెనుఁగు బాసలో నున్న శబ్దములు, తత్సమములు, తద్భవములు, దేశ్యములు, అన్యదేశ్యములు, గ్రామ్యములు నని యయిదువిధములు. ఏ సంస్కృతపదము నైనఁదత్సమముగ నాంధ్రములో నుపయోగింపఁగూడుటచే సంస్కృత నిఘంటువులలోని పదముల నన్నిటినిఁ దెలుఁగు నిఘంటువుల లోనికిఁ జేర్పవచ్చును. కాని యట్లుచేయుటవలన గ్రంథము విస్తరించుటయు వెల యెక్కువయగుటయుఁ దటస్థించును గాని తగిన ప్రయోజనము కానరాదు. సంభాషణమునందును గ్రంథ ప్రపంచమునందును వ్యవహారములో నుండు తత్సమపదముల శబ్దజాలము.

నుమాత్ర మాంధ్రనిఘంటువునందుఁ జూపినఁ జాలునని నా యభిప్రాయము. ముందుముం దెక్కువ తత్సమపదములు వాడుకలోనికి వచ్చినయెడల వాని యర్థములకొఱకు సంస్కృత నిఘంటువులను జూడవచ్చును. ముందు ముందు ముద్రింపఁ బడు నాంధ్ర నిఘంటువులలో వానిం జేర్పవచ్చును. అన్యదేశ్య ములకుఁ దద్భవములకుఁ గూడ నిక్లే యని యెఱుఁగునది. తద్భవములను నూతనముగాఁ గల్పింపవచ్చును. కొందఱు క ల్పించుచు నున్నారు. అయినను వ్యవహారమునందు రూఢము లయిన వానినిమాత్రమే మన మిప్పుడు గ్రహింపవలసియుం డును. మహమ్మదీయరాజ్యవిజృంభణకాలమున భాషలోనికిఁ జొచ్చిన యరబ్బీ, యురుదు, పారసీకపదములను, ప్రస్తుతము వాడుకలో నున్న కోర్టు, జడ్జీ, కేసు, ఆక్టు, మొదలగు నాంగ్లే యపదములను రూఢము లైనవానినే యన్యదేశ్యములక్రింద మనము గ్రహింపవలసియుండును. అన్యభాషా పదముల నెంత వఱకు సలక్షణాంధ్రగ్రంథములయందు స్వీకరింపవలసియుండు నను విషయము సమగ్రమైన చర్చ జరపిగాని నిశ్చయించుటకు వీలు లేదు.

ఆంధ్రదేశము సం దాయామండలములందుమాత్రము సాధారణముగా జనులు సంభాషణలో వాడుకొను పదము లన్నియు నిఘంటువులోఁ జేరవలయునా కూడదా యను విష యమును గూర్చి విచారింపవలసియున్నది. ఆంధ్ర వాఙ్మయము పరిమితమై యున్నందున భాషలోని శబ్దజాల మంతయు గ్రంథస్థ మై యున్నదనుట కనుపుపడదు. జాతివార్తావిషయకగ్రంథ ములు తెలుఁగులో లేవు. కావునఁ దత్సంబంధమైన శబ్ద జాలమును వాడుకభాషనుండియే గ్రహింపవలసియున్నది. కనుక గ్రంథప్రపంచములోని పదములతోఁబాటు కేవల

ప్రాదేశికములుగాక యర్థనియమమును వర్ణనియమమును గలిగి గ్రంథస్థములు కాఁదగిన వాడుక పదములుకూడ నిఘంటువులోఁ జేరవలయునని నా యభిప్రాయము. కొన్నిశబ్దములకు రూపభేదములు రూఢములై యున్నయెడల నారూపాంతరములను గూడఁ బ్రధానరూపముక్రింద నుదహరింపవచ్చును. కాని నీచగ్రామ్యములను, వ్యాకరణమునకుఁ గేవలము విరుద్ధముగనున్నరూపములను, స్వల్పప్రదేశమునందు మాత్రము వాడుకలోనుండి మఱి యెచ్చటఁ దెలియఁబడని పదములను నిఘంటువులోఁ జేర్పఁగూడదు. కొన్ని కొన్ని శబ్దముల విషయముయి యవి గ్రాహ్యములా యగ్రాహ్యములా యని నిర్ధారణము చేయుట కష్టసాధ్యము. ఇక్కార్యమునఁ గొంత స్వాతంత్ర్యము నిఘంటు సంపాదకుల కీవలసియుండును. సామాన్యపద్ధతి యిది యని నిర్ణయించుకొనిన తరువాత విశేషాంశముల స్థిరపఱచుకొనవచ్చును. ఈ సందర్భమున మ్రేగారి యాంగ్లభాషా నిఘంటూపోద్ఘాతములోని యీక్రింది వాక్యములు మననమున నిడికొనఁదగినవి. “15 వ శతాబ్దమునకు ముందాంగ్లభాషలో సర్వసామాన్యగ్రాంథికభాష యొక్కటి యేర్పడియుండక ప్రదేశభేదములచే భాష నానావిధములయి యన్నిటియందును గ్రంథములు రచింపఁబడుచుండెను గావునఁ దత్కాల గ్రంథప్రయుక్తపదములన్నియు నిందు గ్రహింపఁబడినవి. అటుపిమ్మట గ్రాంథికభాష యేర్పడుటంజేసి గ్రాంథికములుగాని శబ్దము లీ నిఘంటువున సాధారణముగా గ్రహింపఁబడలేదు. గ్రాంథికేతరదేశ్యశబ్దములు సాధారణముగా నచ్చాంగ్లేయములే కాని యాశబ్దజాలమంతయు సమగ్రముగా మనకుఁ దెలియకపోవుటను దెలిసినను నాశబ్దములు వర్ణనియమములేక వివిధప్రదేశములందు వివిధరూపములుగా వ్యవహా

రింపఁబడుచుండుటను వర్ణోచ్చారణ నియమములుగల గ్రాంథిక శబ్దములవలె నీ శబ్దముల శాసించుట కనువుపడదు." పదమునకు రూపాంతరము లుండినప్పుడు రూఢమైన రూపమున కెదురుగఁ దక్కినరూపముల నుదహరింపవలయును. 'ఒద్ద' యను పదమును దీసికొందము. దీనికి 'వద్ద' యను మఱియొక రూపము కలదు. 'ఒద్ద' సమీపమున 'వద్ద' యని యుదహరింపవలయును. 'వద్ద' సమీపమున 'చూ. ఒద్ద' యని వ్రాయవలసియుండును. రూఢ రూప మిదియని నిశ్చయించుటకు వీలులేనప్పుడు నిఘంటువులోఁ బ్రథమమున నగపడు రూపమునొద్దఁ దక్కినరూపముల నుదహరింపవలయును.

ముక్కంటి, ఇద్దము, ముత్తుము, ఇమ్మడి మొదలగు సాధారణసమాసములను వాని ప్రధానావయవపదముల క్రిందఁ గనఁబఱచి వివరింపవలయును. తిరిగి యక్షరక్రమమున నా సమాసముల నుదహరించి వాని ప్రధానావయవముల క్రిందఁ జూచునది యని వ్రాయవలయును.

తత్సమాది భేదము, భాషాభాగము.

ఇ—తత్సమమునకు 'స' యనియుఁ దద్భవమునకు 'భ' యనియు దేశ్యమునకు 'దే' యనియు, నన్యదేశ్యమునకు 'అ' యనియు లిఖించి వాని భాషాభాగముఁగూడఁ గనపఱుపవలయును. అన్యదేశ్యములలోఁ బారసీక పదమునకు 'అ, పా' యనియు నాంగ్లేయపదమునకు 'అ, ఆ' యనియు నివ్విధమున లిఖింపఁదగును. కొన్ని శబ్దములకుఁ దద్భవదేశ్య నిర్ణయ మొనర్చుట కష్టసాధ్యము. అట్టి సందర్భములందు సంపూర్ణమైన చర్చ జరుగవలయును. కిట్టెలుగారి కన్నడనిఘంటువునందు దేశ్యపదములు పెద్దయక్షరములతోను తక్కినపదములు చిన్న యక్షరములతోను ముద్రింపఁబడినవి. మన తెలుఁగు నిఘంటువులోఁగూడ నీపద్ధతి నవలంబింపవచ్చును. ఏదైన నొక

పదమున కేశాస్త్రమునందైన విశేషార్థము కలిగియుండినయె డల నాయర్థము వివరించునపు డాశాస్త్రనామ మక్షర సంజ్ఞచేఁ దెలియఁజేయవలయును. సంగీతమునకు 'స' యనియు, వైద్య మునకు 'వై' యనియు ని ట్లుదహరింపవలయును.

ఉ—గ్రంథములయందును, సంభాషణమునందును శబ్ద ములకుఁ గల యర్థములు నిఘంటువునందు వివరింపఁబడవల యును. వాఙ్మయమునందుఁ బూర్వనిఘంటువులుకూడఁ జేరి నవని గ్రహింప నగును. ఒకపదమునకు నానార్థము లున్న యెడలఁ బ్రధానార్థము ప్రథమమునందును దక్కిన యర్థముల సాధ్యమైనంతవఱకు కవి పుట్టినకాలక్రమము ననుసరించియు వరుసగఁ దెలుపవలయును. లక్షణార్థములకు వాచ్యార్థము తోఁ గల సంబంధమును వివరింపవలయును. నానార్థములకు వరుసగ, 1, 2, 3, అని సంఖ్యలను జేర్పవలయును. "అడుగు" అను పదమును దీసికొందము. దీని మొదటియర్థము 'పాదము'. కనుక దీనికి 1 అని సంఖ్య చేర్పవలయును. 'మూఁడడుగుల నేల' ఇత్యాది వాక్యములందు, అడుగు శబ్దమునకు అడుగు కొలఁత యని యర్థము. దీనికి 2 అని సంఖ్య నుంపవలయును. ఈ శబ్దమునకుఁ బద్యపాద మను నర్థముకూడఁ గలదు. దీనికి 3 అని సంఖ్య యుండవచ్చును. వస్తువుయొక్క క్రిందిభాగము నకు అడుగనుపదము వర్తించును. కావున దానికి 4 అని సంఖ్య చేర్పవచ్చును. "ప్రార్థించు, ఇమ్మను" అను నర్థము గల 'అడు గు' అను క్రియాపదము భిన్నపదము కావున దానిని భిన్నపద ముగనే వివరింపవలయును. అర్థవివరణము చేయునప్పుడు సాధా రణముగా వర్తమాన నిఘంటువుల నాధారముగా గ్రహించి కావలసినచోటుల సవరణలు చేయవచ్చును. అర్థవివరణము.

పదముల కర్థ మాంగ్లభాషలో వ్రాయవలయునా ?

అర్థములే భాషలో నుండ వలయును.

తెలుఁగులో లిఖింపవలయునా? లేక రెంటిలో నుదహరింపవలయునా? యను సంశయము తేలవలసియున్నది. ఆంధ్రభాషను వాఙ్మయమును నభ్యసింపఁ గోరు విద్యార్థులకును ద్రావిడ భాషల తత్త్వము నన్వేషించు విద్యాధికులకు నీ నిఘంటు వుపయోగకరముగ నుండవలయును. తెలుఁగర్థము లిచ్చిన యెడల మొదటి యుపయోగము నాంగ్లభాషార్థము లిచ్చిన యెడల రెండవ యుపయోగమును సమకూరును. శబ్దతత్త్వము నన్వేషించు శాస్త్రజ్ఞులు కొలఁదిమందియే యనుమాట వాస్తవమే కాని వారియుద్యమము ముఖ్యమైనదగుటచే వారికిఁగూడ మన నిఘంటు వుపకరించునదిగా నుండవలయును. కనుక నిఘంటువంతయుఁ దెలుఁగుననే రచించి యింగ్లీషు పర్యాయ పదములంగూడ క్లుప్తముగ నుదహరించినచో రెండుప్రయోజనములు సిద్ధించునని నా యభిప్రాయము. ‘అడుగు’ అనుపదము నుదాహరణముగఁ దీసికొందము. దాని నీక్రిందివిధమున వివరింపవలసియుండును.

అడుగు=1. పాదము (Foot)

2. అడుగు ప్రమాణము (A foot measure)

3. పద్యపాదము (Verse line)

4. క్రిందిభాగము, అధోభాగము (Bottom)

ఇట్లు వివరించుటవలనఁ బుటలసంఖ్యయు ధరయు హెచ్చినను వాని కొప్పుకొనవలసియుండును.

ఋ—ప్రయోగములవిషయమై మూఁడంశములు విచారింపవలసియున్నది.

ప్రయోగ ములు.

(1) ఏగ్రంథములు ప్రమాణములుగా గ్రహింపఁదగినవి?

(2) ప్రయోగముల నిర్ణయించుకొను టెట్లు?

(3) ఆప్రయోగముల నెట్లు నిఘంటువులోఁ జూపవలయును?

(1) భారతప్రయోగములు మాత్రమే ప్రమాణములుగాఁ దీసికొనవలయు ననువారు కొందఱుగలరు. కాని యది నా మతము కాదు. ఆంధ్ర వైయాకరణులుగూడ దీని నంగీకరించియుండలేదు. లాక్షణికులలో నగ్రగణ్యుఁడైన యప్పకవికూడ మధ్యమకవులఁ బ్రామాణికులఁగా గ్రహించియున్నాఁడు. మఱియు నితఁ డాంధ్రకవి శిరోమణి యనందగు బమ్మెర పోతనామాత్యుని భాగవతమును గొన్ని కారణములచేఁ బ్రమాణముకాదని నిషేధించినను చాటువుల నజ్ఞాత కర్తృక పద్యములను గూడ నచ్చటచ్చటఁ బ్రమాణములుగ నుదహరించి యున్నాఁడు. దాశరథీ శతకమువంటి శతకములును, శ్రీనాథుని పల్నాటి వీర చరిత్రమువంటి ద్విపదకావ్యములును లోనుగాఁగల నిర్దుష్టాంధ్ర వాఙ్మయ మంతటినుండి ప్రయోగములఁ గైకొనవలయునని నాయభిప్రాయము. గ్రంథ ప్రామాణ్యమున కొక కాలావధి నిర్ణయించి యాకాలము పిమ్మట రచింపఁబడిన గ్రంథములలోనుండి ప్రయోగముల స్వీకరింపఁగూడదని యొక యేర్పాటు చేసికొనుట యుచితముగాఁ దోఁచుచున్నది. దీనివలన నాధునిక వచన గ్రంథములన్నియు నిషిద్ధములగును. కిట్టెలు దొరగారి రీతి ననుసరించి వాఙ్మయమునుండియే కాక సాధారణముగ వాడుకలోనున్న సామెతలనుండికూడఁ బ్రయోగములఁ గైకొనవచ్చునని నేఁ దలఁచెదను. రూపనిష్పత్తికిఁ దోడ్పడకపోయినను సామెతలు పదములయర్థముల సరిగఁ బ్రకాశితముచేయును. ప్రమాణములుగఁ గైకొనఁదగిన గ్రంథముల పట్టిక సిద్ధము చేయుట కొక పండిత సంఘము నేర్పఱుపవలయును.

(2)—శబ్దార్థ శబ్దస్వరూపముల విషయమయి కవిహృదయమును గ్రహించి ప్రయోగములఁ గైకొనవలయును. అనఁగాఁ బ్రతిశబ్దమును నిరూప్యమానరూపమునను నిరూప్యమానా

ర్థమునందును బ్రయోగించుట కవి యభిప్రాయమని నిర్ణయింప వలసియున్నది. అట్లు నిర్ణయింప శక్యమైనయెడల నాప్రయోగ మును గ్రహింపవలయును. లేకున్న విడువవలయును. దీనిని ని శ్చయించుటకుఁ బ్రతిబంధకములు చాలఁ గలవు. పూర్వగ్రంథ ము లన్నియు ముద్రాయంత్రములు లేనికాలమునఁ బుట్టినవి. ప్రచారములో నున్న వ్రాఁతప్రతులు వారు వారు వ్రాసికొని నవి. అవి సరిగా వ్రాయఁబడినవని చెప్ప వీలులేదు. గ్రంథము లనేకము లిప్పుడు ముద్రితములయి యున్నవి, కాని బహు గ్రంథములయందు మూలపాఠశోధనము చక్కఁగా జరిగియుం డకపోవుటంజేసి శోధకుల లోపమువలన నేమి, ముద్రకుల లోపమువలన నేమి యనేక ముద్రితగ్రంథములయందుఁ దప్పు లు గన్పట్టుచున్నవి. కావునఁ బూర్వ లాక్షణిక మతానుసారముగా ఛందోనియమశోధనమున కాగిన ప్రయోగములనే ప్రమాణము లుగా సాధారణముగా గ్రహింపవలయును. మఱియు, శ్లేష య మకానుప్రాసాద్యలంకారములు వచ్చినప్పుడు తత్తదలంకార లక్షణ సిద్ధంబులగు పాఠములుగూడ గ్రాహ్యములు. ఈ పరీ క్షల కవకాశములేని స్థలముల మాత్రమే యితరప్రయోగ ముల సేకరించువిషయము విచారింపవలసియుండును. ఈ నియమములు సామెతలకు వర్తింపవు. అవి యున్నవి యున్న ట్లుదహరింపఁబడవలయును.

(3)—పదము రూపమునుగాని యర్థమునుగాని వివరిం చుటకుఁ బద్యములో నెంతభాగ మావశ్యకమో యంతభాగ మునుమాత్ర ముదహరింపవలయును. ఒక్కప్పు డొక్కపాదమే చాలియుండును. ప్రాసముకొఱ కొక్కప్పు డొకపాదముకంటె నెక్కువ వ్రాయవలసియుండును. ప్రతిప్రయోగమున కెదుట నది యేగ్రంథముయొక్క యే యాశ్వాసములోని యెన్నవ

పద్యమో యక్షరాదికసంజ్ఞలమూలమునఁ దెలుపవలయును. అనఁగా, భారతమునం దుద్యోగపర్వములోని నాలుగవ యా శ్వాసమునందలి యిరువదియైదవ పద్యమని చెప్పవలసివచ్చి నప్పుడు, భార. ఉ. 4. 25 అని లిఖింపనగును. ఏదైన నొకపాఠము సామాన్యముకాక కొన్నికొన్ని ప్రతులయందు మాత్రమే కనఁబడుచున్నచో నాప్రతులను వేఱొకసంజ్ఞచేత సూచింపవలయును. ప్రమాణవాక్యముల నుదహరింపక వానిని సూచించినంతమాత్రమున లాభ మంతగా లేదు. వాఙ్మయములోని గ్రంథములన్నియు నిర్దోషముగ ముద్రింపఁబడువఱకు నట్లొనర్చుటకు వీలుకలుగదు. అప్పుడైనను బ్రయోగములఁ గనిపెట్టుటకుఁ జదువరుల కందఱకు సమగ్రములైనపుస్తకభాండాగారములు కావలసియుండును.-స్థలము కలిసివచ్చుటకుఁ గాను ప్రమాణవాక్యములఁ జిన్నయక్షరములతో ముద్రింపవలయును. ముర్రే దొరగారి పద్ధతి ననుసరించి యర్థములయొక్కయు రూపములయొక్కయుఁ జరిత్రమును సూచించునట్లు ప్రయోగములను గాలక్రమము ననుసరించి కనఁబఱుపవలయును.

౫—ఆంధ్రపదముల చరిత్రమును మర్మములనూ దెలుపుటకై దేశ్యపదములకు తుల్యప్రభవము లగు నితరద్రావిడభాషాపదముల సాధ్యమైనంతవఱకుఁ జూపుట యవశ్యము. అరవము,కన్నడము, మళయాళము,తులు మొదలగు భాషలోని పదముల విషయమున నాయా నిఘంటువులు సాహాయ్యమొనర్పఁగలవు.కిట్టెలు దొరగారి కన్నడనిఘంటువులోఁ జాలమట్టునకు సంబంధము గల నానాద్రావిడభాషాపదములు చేర్పఁబడియున్నవి గాన నది ముఖ్యముగ నుపకరించును. నిఘంటువులలో నున్న యంశములకుఁ దోడు ప్రత్యేకాన్వేషణముకూడనొనర్పవలయును. వాఙ్మయములేని తులు, కూయి వంటిభాషలను తుల్య ప్రభవ పదములు.

శ్రద్ధతో విమర్శించి వానిలోని పదములను గ్రహింపవలయును.

ఎ—వ్యుత్పత్తి వివరణము నిఘంటువునకు ముఖ్యమైన లక్షణము. తత్సమములకు నన్యదేశ్యములకు వ్యుత్పత్తులు చూపుట యవశ్యముకాదు. తత్సమములకు సంస్కృత నిఘంటువులనునన్యదేశ్యముల కాయాభాషల నిఘంటువులను జూచి కొనవచ్చును. తద్భవముల విషయమున వానిప్రకృతుల నుదహరించినఁ జాలును. కావున నీవిషయమై చేయవలసిన పని ముఖ్యముగా దేశ్యశబ్దములనుగుఱించి యై యున్నది. దేశ్యశబ్దము లన్నిటికి నవయవవ్యుత్పత్తుల సంపూర్ణముగఁ దెలుఁగులోఁ గాని యందు దొరకనిచో నన్యద్రావిడభాషలలోఁ గాని వెదుకవలయును. దేశ్యపదముల వ్యుత్పత్తు లిదివఱకే నిఘంటువునందును సక్రమముగాఁ దెలుపఁబడియుండలేదు. కనుక మన నవీన నిఘంటువునకిది ప్రధానలక్షణముగా నుండవలయును. ద్రావిడ శబ్దతత్వశాస్త్ర మిప్పుడు శైశవావస్థయందే యున్నది గాన మనకార్యమునకుఁ జాలినంత సాహాయ్యము లభింపకపోయినను సాధ్యమగువఱకుఁ జేయవలయును.

వ్యుత్పత్తులు.

నిఘంటువునం దుండవలసిన విషయము లివియని నిశ్చయించుకొంటిమి. ఆవిషయముల నన్నిటిని సంపాదించి సమన్వయము చేసి నిఘంటువునందుఁ బొందుపఱచు విధానమును నిర్ణయింపవలసియున్నది. ఏతన్నిర్ణయసౌకర్యార్థము కర్తవ్యాంశములనెల్ల రెండుభాగములుగా నఁగా,(1)శబ్దావళి సిద్ధముచేయుట.(2) తత్సమాదిభేద భాషాభాగముల నేర్పఱచుట. (3) అర్థవివరణము చేయుట. (4) ప్రయోగములఁ గనఁబఱచుట యను నంశము లొకభాగము. (1) సమానభవము లగు నన్యభాషాపదములయొక్కయు, (2) వ్యుత్పత్తులయొక్కయు నన్వేషణమొకభాగముగా విభజింపుదము. ప్రథమభాగములోఁజేరిన కార్య

నిఘంటు నిర్మాణ రీతి.

ముల నెఱవేర్చుటకు ప్రస్తుతమున్న నిఘంటువులు చాలవఱకు సహకారములు కాఁగలవు. ముద్రితములుకాని పదపట్టికలు దొరకినచో నవికూడ మన కుపయోగించును. కాని యీసాధనములన్నికలిపినను శబ్దజాలమంతయుఁ బూర్తిగా నందిమిడియున్న దని చెప్పుటకు వీలులేదు. కావున గ్రంథజాలము నంతయు శ్రద్ధతో విమర్శించి నూతనపదపట్టికల సిద్ధముచేయవలయును. ఈపని నొక్కరుగాని యిద్దఱుగాని యెంత సమర్థులైనను జేయఁజాలరు. చదువరుల ననేకుల నియమించి గ్రంథముల వారికిఁ బంచియిచ్చి, యాగ్రంథముల నుండి పదములనెత్తి వ్రాయునట్లేర్పాటుచేయవలయును. మఱ్ఱేగారి యింగ్లీషునిఘంటువునకు 1300మంది చదువరులు 5000 గ్రంథకర్తల గ్రంథములఁబఠించి, 35 లక్షల ప్రయోగములను బ్రోగుచేసిరఁట ! అంత విపులమైనది మన యాంధ్ర వాఙ్మయము కాదు గావున 20 మంది చదువరుల నియోగించిన మనకుఁ జాలునని నాయాశయము. ఇట్లు యోగ్యులైన చదువరులఁ బెక్కండ్ర నియోగించుటచేత పని త్వరితముగను చక్కఁగను నెఱవేఱఁగలదు. ఒకరు కనిపెట్టినవి మఱియొకరు కనిపెట్టిన వానితో సరిపోల్చుటవలన పని నిర్దుష్టముగ నుండఁ గలదు. ఆంధ్రదేశమునఁ గల పలువురు భాషావిదులసామర్థ్యమును మన ముపయోగపఱచుకొనుటకవకాశము కలుగును. చదువరులు సవిమర్శమైన యాంధ్రభాషాజ్ఞానమును, సంస్కృతభాషాపరిచయమును గలవారుగా నుండవలయును. కొంతవఱ కాంధ్రభాషాజ్ఞానమే చాలునని చెప్పవచ్చును గాని సంస్కృతభాషాపరిచయ మెంతయుండిన నంత మేలగుఁగు. ఇక్కార్యమునఁ జాలమందిపండితుల నియోగింపవచ్చును. వారివారి సుప్రసిద్ధయోగ్యతనుబట్టికాని, లేక పరిషత్కార్యస్థానమునుండి పంపఁబడు నిబంధనల ననుసరించి మాదిరి

కై కొన్నిపత్రములు వ్రాయించి పరీక్షించికాని గ్రంథపాఠకుల నిర్ణయింపవచ్చును. నిర్ణయమైనతరువాత వాచకులందఱు పరిషత్కార్యస్థానమునఁ గూడి కార్యవిధానము నాలోచింపవలసియుండును. వాచకులు వారు వారు వ్రాసినదంత పరిషత్తునకప్పుడప్పుడు పంపుచుండవలయును. దీనిని సంపాదకులు విమర్శించి తప్పులుండినయెడల చదువరులకుఁ దెలుపుచుండవలయును. ప్రధానసంపాదకుఁడు నుపసంపాదకులును వాచకులు నొకచోఁ జేరి యందఱు కూడఁబల్కికొనుచుండవలయును. చదువరులమూలముననే కాక తక్కిన విద్యార్థికుల మూలమునఁ గూడ మనకుఁ గొంతపని జరుగఁగలదు. అట్టి విద్యార్థికులు వ్రాసిపంపినయంశములఁ బరిషత్తువా రంగీకరించినయెడల నవసరమైనచోఁ దగిన ప్రతిఫలముకూడ నొసంగి వారిని బ్రోత్సాహపఱచుట మంచిది. ఈవిధమున నిఘంటువున కుపయోగకరములైన యనేకాంశములఁ బ్రోగుచేయవచ్చును.

ఆంధ్రవాఙ్మయ మంతవిపులమైనది కాదని యిదివఱకుఁ జెప్పియున్నాము గదా. అది చాలవఱకుఁ బద్యకావ్యమయమై యున్నది. కావ్యేతరగ్రంథములుగూడఁ గలవుగాని వానిసంఖ్య కడుస్వల్పము. కావున మనముసంభాషణములో నుపయోగించుపదములన్నియు గ్రంథస్థములైన వనుటకు వీలు లేదు. అందులో వృత్తులకుఁ బరిశ్రమములకు సంబంధించిన పదములు సాధారణముగా వాఙ్మయములోఁ జేరియుండవు. హంసవింశతివంటి కొన్ని గ్రంథములుమాత్ర మట్టిపదములఁ గొన్నిటిఁ దెలుపుచున్నవి; కాని సమగ్రముగఁ దెలుపుచున్నవి కావు. కాఁబట్టి యాసాంకేతికపదముల నన్నిటిం బ్రోవుచేసి నిఘంటువులోఁ జేర్పవలయును. తెలుఁగుదేశమం దచ్చటచ్చట నిర్ణీతస్థలములయం దీ పదముల పట్టికలు సిద్ధముచేసి యాపట్టికల

వ్యావహారికపదసంపాదకసంఘము.

నొకదానితో నొకటిని సరిచూడవలయును. ఈకార్యనిర్వహ ణమునకై తగినవారి నిద్దఱు ముగ్గుర నొకసంఘముగా నేర్ప ఱచి పదపట్టికలఁ గూర్పవలసిన పద్ధతుల మొదట నిర్ణ యించి తన్నిర్ణయానుసారముగా సంఘ మాయాస్థలముల కేగి పట్టికల సిద్ధముచేయునట్లు నిర్ణయింపవలయును. పూర్వోక్తపా ఠకులును ఈసంఘమువారును దమతమ కార్యము లేకకాల మందే చేయుచుందురు. సమానభవపదములను వ్యుత్పత్తు లను గనుఁగొనుటకు కేవలాంధ్రభాషాజ్ఞానమే కాక దానికిఁ దోడ ధమ మింకొక ద్రావిడభాషయొక్క జ్ఞానమును సంస్కృత భాషాపరిచయమును గావలయును. ఇంతియకాక శబ్దతత్త్వశాస్త్రసామాన్యపరిచయమైనను శబ్దతత్త్వాన్వేషణ మునం దాసక్తియు నుండవలయును. ఈయన్వేషణము వలన నొకానొకప్పుడు సాంప్రదాయకములుగాని విపరీతసిద్ధాం తముల కవకాశముకలుగును. అట్లు జరుగకుండ జాగరూక తమై నుండవలయును. సమానభవపదములఁ గనుఁగొనుట, వ్యుత్పత్తుల నిరూపించుట ఒక్కఁడుచేయుపనికాదు. పలు వురు విద్యార్థికు లొనర్పవలసియుండును. ఇప్పుడు గల నిఘం టువు లీ పనికిఁ గొంతవఱకుపకరించును. ఆంధ్రపదపారిజాతము, లక్ష్మీనారాయణీయము నను రెం డచ్చ తెలుఁగు నిఘంటువులు కలవు. ఈ రెంటిలో లక్ష్మీనారాయణీయము కొన్ని విధముల మేలని నాయభిప్రాయము. ఇందుఁ గల పదముల నన్నిటిం బలువురు విద్యార్థికులకుఁ బంచిపెట్టి వారు వాని వ్యుత్పత్త్యా దులఁ జర్చించునట్లేర్పఱుపవలయును. ఉన్నంతవఱకు ద్రా విడభాషా నిఘంటువు లిందున కుపయుక్తములు కాఁగలవు. కూయి (కోదు) భాషవంటి నిఘంటువులులేనిభాషల విష యమై యాభాషల నేర్చినవారివలనఁ గావలసిన యంశముల

గ్రహింపవలసియుండును. తుల్యప్రభవపదముల నిర్ణయించిన పిదప వ్యుత్పత్తివివరణము సులభముగ నుండును.

సంపాదకసంఘము.

పూర్వోక్త గ్రంథమును బట్టి నిఘంటునిర్మాణ కార్యము మూఁడువిధములుగ నున్నదని తేలుచున్నది. అవియేవియన:—

(1) గ్రంథములఁజదువుట, ప్రమాణవాక్యములఁ బ్రోగు చేయుట, యర్థాముల నిరూపించుట.

(2) వాఙ్మయములో లేని పదముల పట్టికల సిద్ధము చేయుట.

(3) సమానభవపదములను వ్యుత్పత్తులను నిర్ణయించుట.

ఈపనులన్నియుఁ దత్తత్కార్యనిర్వహణమునకుఁగా నియమింపఁబడినవారివలన నేకకాలమందే జరుగవలసియుండును. వారు చేసినపని నొక ప్రధానసంపాదకుఁడు (పరిష్కర్త) నైదుగు రుపసంపాదకులు పరీక్షించి సవరించుచుండవలయును. సంపాదకులకు జీతములుండఁగూడదు. గౌరవార్థముగ వారా పనిచేయవలయును. వారికి సహాయులుగా నొక కార్యదర్శియు నొకరిద్దఱు గుమాస్తాలు నియమింపఁబడవలయును. వీరలకు జీతము లీయవలయును. సంపాదకులందఱు శబ్దతత్త్వశాస్త్రి జ్ఞానము కలిగి యుత్సాహముతోఁ బనిచేయువారుగ నుండవలయును. ప్రధానసంపాదకునకు ముఖ్యముగా నీలక్షణము లుండవలయును. సౌకర్యార్థము సంపాదకులలో నొక్కొక్క రొక్కొక్కపని చూచున ట్లేర్పాటుచేసికొన్నను మొత్తముమీఁద నన్నివిషయముల నందఱు నెఱిఁగియుండవలయును. సంపాదకులు తఱచుగను, తక్కినపండితు లప్పుడప్పుడును గూడుచుండవలయును.

జయంతి. రామయ్య.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే ముద్రితము.

# ప్ర క ట న లు.

---

## ఆంధ్రసాహిత్య పరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజారావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్ వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీపిఠాపురము రాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

1 మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.,

2 ,, ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి ఐ. ఇ.,

ది ఆనరబిల్ రావుబహదూర్ పిట్టి త్యాగరాయసెట్టిగారు, బి. ఏ.

కార్యస్థానము.

**192,** ఎస్ప్లనేడు. చెన్నపురి.

పరిషదుద్దేశము:—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగు భాషకితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్వమును నిరూపించు లక్షణశాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును బ్రమాణ పూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్రికనొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్కయుద్దేశము.

చందానిర్ణయము.

| | | | |
|---|---|---|---|
| 1. | ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. | పోషకులకు | ,, | 1000. |
| 3. | యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. | సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, | 6. |

పరిషత్సభ్యులు పత్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేరవ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల.

నిడదవోలు, కృష్ణాజిల్లా.

ఇందు చక్కని క్యాలికోబైండుగల నవలలు రెండుమాసముల కొకటిగా వెలువడును. ఈ నవలలు చరిత్రబోధకములును మనోహరకథాకల్పితములునై చదువరుల హృదయముల నాకర్షించుచుండును. ఈనవలలనుగూర్చియు, ప్రస్తుతకాలమున నాంధ్రభాషాభివృద్ధికి నవలలయొక్క యవసరమును గూర్చియు, ననేకు లనేకాభిప్రాయముల నిచ్చియున్నారు. ఆంధ్రభాషాభివృద్ధికీనవలలు ప్రథమసోపానములని చెప్పవచ్చును. ఇందు శాశ్వతచందాదారులుగా చేరువారికి మంచి కాలికోబైండుచేయబడిన నవలలు డెమ్మీసైజున 100 పేజీలకు రు 0—6—0 చొ॥ వెలయేర్పఱచి వి. పి. గాఁ బంపుచుందుము. ఇతరులకు పోస్టేజిగాక 100 పేజీలకు రు 0—8—0 చొ॥ నిచ్చెదము.

ఏనవలయైనను ఒకరూపాయి వెలకు మించియుండదు.

చందాదారులుగా చేరువారు 0—2—0 అడ్మిషనుఫీజు నీయవలెను.

---

## ఈ గ్రంథమాలికనుండి వెలువడిన నవలలు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1. దుర్గేశనందని. 231 పేజీలు | 0—12—0 | 1—0—0 |
| 2. వసుమతీవసంతము. 300 | 1—0—0 | 1—8—0 |
| 3. లలితచంద్రహాసము. 166 పేజీలు | 0—10—0 | 0—14—0 |
| 4. మృణ్మయి. 256 పేజీలు | 1—0—0 | 1—5—0 |
| 5. సీతారామ. 320 పేజీలు | 1—0—0 | 1—8—0 |
| 6 నూర్జహాను. 340 పేజీలు | 1—0—6 | 1—8—0 |
| 7. రాజసింహ. 280 పేజీలు | 1—0—0 | 1—8—0 |

## అనుబంధగ్రంథములు.

| | |
|---|---|
| 1. రాధారాణి | 0—4—0 |
| 2. యుగళాంగులీయకము | 0—3—0 |
| 3. రాజభక్తి | 0—2—0 |
| 4. లీల | 0—4—0 |
| 5. దుర్గేశనందని విమర్శనము | 0—3—0 |

వలయువారు:—

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

నిడదవోలు, కృష్ణాజిల్లా.

అని వ్రాయవలయును.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల

ఆంధ్రులపౌరుషము! ఆంధ్రులయాస్నత్యము!! ఆంధ్రులబుద్ధివైభవము!!!

# ఆంధ్రులచరిత్రము.

## రెండవభాగము

ఇందు క్రీ. శ 1100 నుండి 1350 వరకుగల ఆంధ్రదేశచరిత్ర వర్ణింపబడినది.

పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయుల వ్రాతలు, మొదలగువాని నన్నింటిని శోధించి తెలుగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు, కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు మొదలగువారి చరిత్రలు ఈ యుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి.

రామానుజుఁడు, బసవేశ్వరుఁడు, నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్రమహారాజు, మహారాణి రుద్రమదేవి, మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలమందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. ప్రదేశములయొక్కయు, కట్టడములయొక్కయు, పటములుకలవు.

పౌరుషమునందును, పాండిత్యాతిశయంబునందును రాష్ట్రపాలనయందును ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి తీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది.

ఇట్టిగ్రంథము తెలుగులోగాని మఱియే యన్యభాషలోగాని యెవ్వరును రచించియుండలేదు.

విఖ్యాతలేఖకులగు శ్రీయుతచిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే నిది రచింపబడినది. 400 పేజీలుగలిగి మంచికాగితములమీద చిన్న యక్షరముల తోముద్రింపఁబడి చక్కని క్యాలికో బైండుచేయఁబడిన నీయమూల్యగ్రంథము మాచందాదారులకు పోస్టేజితో రు 1-0-0 కును, చందాదారులు కానివారలకు పోస్టేజిగాక రు 1-8-0 లకును ఇయ్యబడును.

☞ విజ్ఞానచంద్రికా బుక్కుడిపో యందు సంస్కృతాంధ్రగ్రంథము లనేకములు దొరకును. వలయువారికి క్యాటలాగులు పంపబడును.

చిరునామా:—

ఆ. లక్ష్మీపతి, బి. ఎ. ఎం. బి. సి. ఎం.

మేనేజరు.—విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట.—మద్రాసు.

# పల్నాటి వీరచరిత్రము

ఇది శృంగారనైషధ, కాశీఖండ, హరవిలాసాది ప్రబంధముల రచించి కవిసార్వభౌముండని ప్రసిద్ధికెక్కిన శ్రీనాథునిచే రచింపఁబడినది. 12 వ శతాబ్దాంతమునందలి యాంధ్రదేశచరిత్రమే పల్నాటి వీరచరిత్రముగనున్నది. చరిత్రముగ నమూల్యమైనదనియుఁ గావ్యముగ నాంధ్రవాఙ్మయాలంకారమనియు స్వాభావిక కవితాధిష్ఠానమనియు నైషధాదిప్రబంధములచేత శ్రీనాథునికిఁగలిగిన యశస్సు దీనిచే ద్విగుణీకృతమైనదనియుఁ బలువురు పత్రికాధిపతులు పండితులు ప్రశంసించియున్నారు. ఇది ప్రకటింపఁబడుటకిదియే ప్రథమపర్యాయము. వీరచరిత్రకథాసారము, వీరచరిత్రచారిత్రము, శ్రీనాథజీవిత సంగ్రహము నను 90 పుటల యుపోద్ఘాతము బెజవాడ హిందూహైస్కూలునందలి తెలుఁగు పండితులును బ్రస్తుతమాంధ్రసాహిత్య పరిషత్తు మేనేజరునగు అక్కిరాజు ఉమాకాంతంగారిచే రచింపఁబడి దీనికిఁ జేర్పఁబడినది. దీనివెల రు 1—0—0. నిందుకాలికోబైండు చేసినది, రు. 1—4—0. వలయువారీక్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

అక్కిరాజు ఉమాకాంతం.
మేనేజరు.
ఆంధ్రసాహిత్యపరిషత్తు
192, ఎస్ప్లనేడు, చెన్నపురి.

---

V. LI I V L: P I s 500.

## విజ్ఞానచంద్రికామండలి: బహుమతి నవల.

రు ౫౦౦ ల బహుమానము.

ఆంధ్రదేశచరిత్రమునకు సంబంధించిన విషయమును దేనినైనను గొని కథ నిర్వహించి నవలను వ్రాయువారలలో ఉత్తమమగు నవల వ్రాయువారికి ఈబహుమతి యొసగఁబడును. పూర్వచళుక్యయుగము, కాకతీయయుగము, విజయనగర సామ్రాజ్యము, రెడ్డిప్రభుత్వము, ఈచరిత్రభాగములలో నేకాలపు కథయయినను తీసికొనవచ్చును. ముఖ్యకథ చరిత్రాత్మకముగనుండిన చాలును. మిగతభాగము కల్పితమయినను కావచ్చును. ఈవిషయమున ఇంగ్లీషునందలి స్కాటుయొక్క నవలలు అనుసరణీయములు. నవలయందు కథాచమత్కృతియు (Plot) పాత్రపోషణమును (Characterisation), భాషయునను మూఁడు విషయములు పరీక్షింపఁబడును. గ్రంథమును పరీక్షించునపుడు కథాచమత్కృతికి 200 గుణములును (Marks), పాత్రపోషణమునకు 200 గుణములును, భాషకు 100 గుణములును ఏర్పరుపబడును. ముగ్గురు పరీక్షకులు నవలను పరీ

ష్ఠించి బహుమతినొసంగుదురు. బహుమతి నందుటకు కనీసము 35॥ గుణము లైనను సంపాదింపవలెను. బహుమతినందిన నవలయొక్క కాపీరైటు విజ్ఞానచంద్రికామండలివారిదే యగును.

## గ్రంథము వ్రాయువారీక్రిందివిధుల గమనింపవలయును.

1. గ్రంథము విజ్ఞానచంద్రికామండలి గ్రంథముల యాకృతిని 300 మొదలు 400 పేజీలలోపుగ నుండవలెను.
2. కాగితమునకు ఒకవయిపుననే వ్రాయవలయును.
3. నవల పూర్తియైనపిదప దానితోడంగూడ ప్రతిప్రకరణమందలి విషయముల క్రోడీకరించివ్రాసిన గ్రంథవిషయసూచి నొకదానిని జతచేసిపంపవలెను.
4. గ్రంథకర్తలు గ్రంథములమీాద తమ నామములను వ్రాయంగూడదు.
5. ఏదో యొక మారుపేరు వ్రాసిపంపవలెను.
6. వేరొక యుత్తరమునందు తాము పెట్టుకొనిన మారుపేరును, తమ నిజమైన పేరు విలాసములును వ్రాసి యొక కవరునందుంచి సీలుచేసి ఆకవరు పైన తమ మారుపేరుమాత్రము వ్రాసిపంపవలెను.
7. నవల 1913 వ సం॥ మే నెల 31 ది సాయంకాలము 6 గంటలలోగ మదరాసు చింతాద్రిపేటలోని విజ్ఞానచంద్రికామండలి కార్యస్థానమునచేరవలెను.

కె. వి. లక్ష్మణరావు ఎం. ఏ. సంపాదకుడు.



భరతఖండమునందలి కలకత్తా, బొంబాయి, బనారస్, మొదలగు పట్టణములయందు జరిగిన
చిత్రవస్తుమహాప్రదర్శనములయందు బంగారు పతకములను మొదటితరగతి యోగ్యతాపత్రములను
శ్రీ శ్రీ శ్రీ గద్వాలమహారాణిగారినుండి మహామారినివారణౌషధములకై
బొందిన




మద్రాసు గవర్నమెంటువారి శానిటరీ కమిషనరగు లెఫ్టినెంటుకర్నల్ డాక్టరు డబ్ల్యు. జి. కింగ్, ఎమ్. బి. సి. ఎమ్., డి. పి. హెచ్., సి. ఐ. ఇ., ఐ. ఎమ్. ఎస్., దొరగారు ఇట్లు వ్రాసిరి.—



ప్రాచీన హిందూ వైద్యశాస్త్ర వైదుష్య విశేషముతోగూడిన సంస్కృత పండితులగు, పండిత డి. గోపాలాచార్యులవార్లను నేను చిరకాలమునుండి యెరుగుదును. ఇట్టి పరిచయమును బట్టి పూర్వకాలపు పద్ధతులను గురించి మిక్కిలి హృదయంగమయినట్టియు నుపయోగమయినట్టియు జ్ఞానమును సంపాదించితిని.

ఆయుర్వేదమార్తాండ, భిషజ్మణి

# పండిత డి. గోపాలాచార్యులు, ఎ. వి. ఎస్.,

నెల్లూరి ఆయుర్వేదకాలేజ్ ప్రిన్సిపాలును,
మైసూరుదొరతనమువారి ఆయుర్వేద విద్వత్ పరీక్షకులును,
సుశ్రుత, మాధవనిదాన, పథ్యాపథ్యములకు వ్యాఖ్యానకర్తలును,
ఆయుర్వేదపరిభాషా సంగ్రహకర్తలు,
ఆయుర్వేదాశ్రమం, జార్జిటవున్, మద్రాస్.

*The Ayurvedic Printing Works, Madras.*

# ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల నియమములు.

ఇదివఱకెన్నడు ప్రచురములుకానట్టి నాయుర్వేద గ్రంథములను గొన్నిఁటి నాంధ్రటీకాసహిత ములుగను, కొన్ని కేవల యాంధ్రీకరణములుగను జేసి ముద్రించి "ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల" యను పేరుతో ప్రకటించుచున్నాడను.

మఱియు నాయుర్వేద వైద్యమందలి ప్రత్యేక ప్రత్యేక విషయములనంబరగు శస్త్ర, గర్భిణి, రసాయన, ఓషధితత్త్వము, మొదలగు కొన్నిటి నితర వైద్యపద్ధతులతోఁ జక్కఁగఁ జర్చించి యాంధ్ర భాషలో గ్రంథములుగ వ్రాసి ముద్రించెదను.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలో బ్రచురింపఁబడు గ్రంథములన్నియుఁ గైకొనుటకు నొప్పుకొను వారు శాశ్వతపుఁ జందాదారులుగ నెంచఁబడుదురు.

శాశ్వతపు జందాదారులకు మా గ్రంథమాలలోని మాధవనిదానమునకు తప్ప మిగిలిన గ్రంథములన్నిటికిని నియమించిన ఖరీదులలో నొకరూపాయకు నాలుగు అణాలవంతునఁ దగ్గించి యిచ్చెదను.

శాశ్వతపుఁ జందాదారులు కానివారికి నిర్ణీతమగు వెలలకు నేమాత్రము తగ్గింపఁబడదు.

శాశ్వతపుఁ జందాదారులుగాని, శాశ్వతపుఁ జందాదారులు కానివారలుగాని యంచెకూలి (వి. పి. చార్జి) వగైరాలు భరింపవలెను.

మా గ్రంథమాలకు శాశ్వతపుఁ జందాదారులుగనుండు వారు ముందుగాఁ జందాధనమును నియ్య నక్కఱలేదు.

పుస్తకములు ముద్రణమైనతోడనే ముంయుగఁ దెలియఁజేసి యాయా గ్రంథములను పి. పి. గాఁ బంపెదను.

శాశ్వతపుఁ జందాదారులుగఁ గాఁదలచినవారు ప్రవేశరుసుముక్రింద రు. 0—2—0 పోష్టు బిళ్ళలను బంపుచు నిందుఁగనఁబఱచిన ప్రకారము గ్రంథమాలాధిపతులకు నుత్తరమును వ్రాసికొనవలయును.

అట్లు ప్రవేశరుసుమును ముందుగాఁ బంపక పుస్తకములను గోరువారికి ముందుగాఁ బంపెడు పుస్తకముల వీపీలో 2 అణాలను జేర్చి వసూలుచేయఁబడును.

## ముద్రణలోనున్న వైద్యగ్రంథములు.

| | |
|---|---|
| రసప్రదీపిక | నాడీతంత్ర |
| మసూరిక | మధుమేహ |
| విషూచి | యోగశతక |
| జ్వరము | సుశ్రుతసంహిత |

ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి
పండిత డి. గోపాలాచార్యులు, ఎ వి. ఎస్.,
ఆయుర్వేదాశ్రమం, జార్జిటవున్, మద్రాస్.

టెలిగ్రాఫ్ అడ్రసు
"పండిట్" మదరాస్.